



ముఖచిత్రం : కృష్ణ వినాయకీయం

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య

# ఆగస్టు నెల క్విజ్

## సమాధానాలు

1 — ఎ  2 — బి  3 — డి

4 — బి  5 — డి

6. డాప్లర్ రాడార్ 7. రజియా సుల్తానా 8. ఏడాదిగా/సంవత్సరంగా
9. రాజరాజ చోళుడు  10. 1957 ఆగస్టు 7

1. టి. హెచ్. పతంజలి, తెనాలి; 2. ఎన్. లక్ష్మీదేవి, పాలకొల్లు;
3. టి. రాంబాబు, తెనాలి.

ఆల్ కరెక్టు సమాధానాలు పంపిన పై ముగ్గురికి రూ. 33.67 చొప్పున పంచటమైంది.

—సంపాదకుడు

# అక్టోబర్ సంచికలో

1978 చక్రపాణి ప్రథమ అవార్డు పొందిన

శ్రీమతి షీలా శివరామ్ నవల

## 'ఆశల ఆరాటంలో....'

ప్రథమ అవార్డు పొందిన

శ్రీ సి.ఎస్. రావు కథ

## 'ప్రశ్న'

ప్రచురింపబడుతాయి.

తప్పక చూడండి !

సమతా ఆర్ట్స్

# మల్లెపూవు

దర్శకత్వం వి మధుసూదనరావు ఈస్ట్మన్ కలర్

నిర్మాతలు: వి ఆర్ యాచేంద్ర కె చటర్జి



జమరుద్ అంజలి సుదర్శన్

(ఎయిర్ కూల్డ్ హైదరాబాదు) (సికిందరాబాదు) (ఎయిర్ కూల్డ్ హైదరాబాదు)

(సుదర్శన్‌లో రోజూ ఉ. 11-15 ని.ల ఆటలు మాత్రమే)

—నైజాం: శ్రీ లక్ష్మీచిత్ర రిలీజు



# 1978 చక్రపాణి అవార్డులు

## ఫలితాలు

1978 సంవత్సరానికి చక్రపాణి అవార్డులను కింది విధంగా నిర్ణయించడమైంది

**నవలలు :**

మొదటి అవార్డు : రూ 2,250 —'ఆశల ఆరాటంలో...'
—శ్రీమతి షీలా శివరామ్, నౌమండి.

రెండో అవార్డు : రూ. 1,116—'ముడిపడని బంధం'
—శ్రీ ఎ. వి. సత్యనారాయణరావు, హైదరాబాదు

మూడో అవార్డు : రూ 850—'ధరిత్రి'
—శ్రీ వేమకోటి సీతారామశాస్త్రి, శ్రీకాకుళం

**కథలు :**

మొదటి అవార్డు : రూ 1,000—'ప్రశ్న'
—శ్రీ సి. యస్. రావు, హైదరాబాద్.

రెండో అవార్డు : రూ. 750—'మనోధర్మం'
—శ్రీ తమిడిపాటి రామగోపాలం, విశాఖపట్నం

మూడో అవార్డు : రూ. 500—'కూలితల్లి'

—శ్రీ వి. రాజారామ్మోహనరావు, హైదరాబాద్

నాలుగో అవార్డు : రూ. 350—'కష్టార్జితం'

—శ్రీ పి. శ్రీనివాసశాస్త్రి, సికిందరాబాద్

అయిదో అవార్డు : రూ. 250—'శరన్మేఘం'

—శ్రీమతి నందుల సుశీలాదేవి, కాకినాడ

1978 చక్రపాణి అవార్డులలో రచయితలూ, రచయిత్రులూ ఎంతో ఉత్సాహంగా పాల్గొన్నారని తెలియజేయటానికి సంతోషిస్తున్నాం. వారందరికీ మా కృతజ్ఞతలు.

అవార్డుల నిమిత్తం మాకు చేరిన మొత్తం నవలలు: 94; కథలు: 606.

అవార్డుల నిర్ణయంలో నవలలకు శ్రీ ఇచ్ఛాపురపు జగన్నాథరావు, శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి న్యాయనిర్ణేతలుగా వ్యవహరించారు. కథలకు అవార్డుల నిర్ణయంలో శ్రీ పురాణం సుబ్రహ్మణ్య శర్మ, శ్రీ ఇచ్ఛాపురపు జగన్నాథరావు న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించారు. వారికి మా కృతజ్ఞతలు.

అవార్డులు పొందనప్పటికీ, ఉత్తమంగా భావించిన కొన్ని నవలలనూ, కథలనూ 'యువ' లో మామూలు ప్రచురణకు స్వీకరించడం జరిగింది. వాటిని గురించి ఆయా రచయితలకూ, రచయిత్రులకూ ప్రత్యేకంగా తెలియజేశాం.

మొదటి అవార్డు పొందిన నవలనూ, కథను అక్టోబరు 'యువ' సంచికలో ప్రచురిస్తాం. మిగతా అవార్డులు పొందిన నవలలనూ, కథలనూ వరసగా వివిధ సంచికలలో ప్రచురిస్తాం.

—సంపాదకుడు,

యువ, హైదరాబాద్

# యువ

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 38 సెప్టెంబరు, 1978 సంచిక 3

గతమాసంలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి రెండు చాలా మంచి నిర్ణయాలను ప్రకటించారు. వానిలో ఒకటి, నగరాలలోని నివేశనస్థలాల చట్టాన్ని గురించినది; మరొకటి, ఫిలిములకు రాష్ట్రప్రభుత్వం సబ్సిడీలను యివ్వడానికి సంబంధించినది.

నగరాలలోని నివేశనస్థలాలను ఒక కుటుంబం ఎంత ఉంచుకోవచ్చుననేది నిర్ణయిస్తూ, కేంద్రప్రభుత్వం నాలుగేళ్ళనాడు ఒక శాసనాన్ని చేసింది. ఆ శాసనం ఆంధ్రప్రదేశ్‌లోకూడా అమలుజరుపబడింది. ఈ శాసనంవల్ల ప్రభుత్వానికిగాని, సమష్టిమీద ప్రజలకుగాని ఏమాత్రం ప్రయోజనం కలుగకపోగా అనేకమంది వ్యక్తులు, అనేక కుటుంబాలు చాలా కష్టనష్టాలకు గురిఅయారు. ఆ శాసనంలో. ప్రజల సౌకర్యం దృష్టిలో వుంచుకొని కొన్ని సవరణలను ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించినంతవరకు అమలుజరిపి వున్నట్లయితే, ఎంతో బాగుండేది. కాని అలా చెయ్యడం జరగలేదు. చివరకు, ఆ శాసనం చెల్లదని హైకోర్టు తీర్పుచెప్పడం జరిగింది. రాష్ట్రప్రభుత్వం, ఆ తీర్పును వెంటనే ఆమోదించవలసింది. కాని అలా చెయ్యక సుప్రీంకోర్టులో అపీలు పడవేసింది. ఈ అపీలును ఉపసంహరించుకుంటున్నామనీ, నగర నివేశనస్థలాలకు సంబంధించిన శాసనాన్ని కొత్తగా రూపొందించి శాసనసభలో ప్రవేశపెడతామనీ, గతమాసంలో రాష్ట్రముఖ్యమంత్రి డాక్టరు చెన్నారెడ్డి ప్రకటించారు. ఇది చాలా సంతోషించవలసిన

విషయం. ఇలాంటి సముచిత నిర్ణయాన్ని తీసుకున్నందుకు ముఖ్యమంత్రిని అభినందిస్తున్నాము.

ఈ విషయంలో రాష్ట్రప్రభుత్వానికి మేము కొన్ని సూచనలు యిదివరకే చేశాము. అవేమిటంటే, కొత్తగా తయారుచెయ్యబోయే శాసనానికి ప్రాతిపదికగా, తమిళనాడులో ప్రస్తుతం అమలులోవున్న శాసనాన్ని దృష్టిలో పెట్టుకొని, ఆంధ్రప్రదేశ్‌లోని నగరాలనూ, నగరాలలోని నివేశన స్థలాలకు సౌకర్యాలులేని విషయాన్నీ గమనించి ఆప్రకారం కొన్ని ప్రత్యేక మినహాయింపులను చెయ్యడం, ఒక ముఖ్యవిషయం. తమిళనాడులోని మదరాసు, మధుర, తిరుచిరాపల్లి మొదలైన నగరాలలో ప్రజలకు వున్న నగర పారిశుద్ధసౌకర్యాలు, అండర్ డ్రెయినేజి మొదలైనవి ఒక్క హైదరాబాదు నగరంలో తప్ప ఆంధ్రప్రదేశ్‌లోని వరంగల్, విజయవాడ, గుంటూరు, విశాఖపట్టణం, రాజమండ్రి మొదలైన పెద్ద పట్నాలలోకూడా లేవు. ఈ నగరాలలోని నివేశన స్థలాల విలువ, తిరుచిరాపల్లి, మధురలలాంటి నగరాలలోని నివేశన స్థలాల విలువతో పోలిస్తే చాలా తక్కువ. అంచేత, కుటుంబానికి కాక ప్రతి వ్యక్తికీ తాను ఉంచుకోవడానికి అనుమతి యిచ్చే నివేశన స్థలపు పరిమితి, మధుర, తిరుచిరాపల్లిలో ప్రస్తుతం అమలులో వున్నదానికి రెట్టింపు అయినా వుండేటట్టు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిర్ణయిస్తే ప్రజలకు కష్టంవుండదు. అంతేకాక, గరిష్ఠపరిమితిలోపు నివేశన స్థలంగలవారు గాని, పరిమితికి పైబడిన స్థలంవున్నా చట్టంనుంచి మినహాయింపు పొందిన వారుగాని తమ స్థలాన్ని అమ్ముకోవడానికి ప్రభుత్వం అనుమతిపొందాలనే షరతును పెట్టకుండావుంటే, ప్రజలకు ఏ యిక్కట్టూ వుండదు.

ప్రభుత్వం బాగా ఆలోచించి ఆమోదించినట్లయితే, మేము చేసిన మరొక సూచన వున్నది. అదేమిటంటే, ప్రస్తుతం వున్న నివేశన స్థలాలకు గరిష్ఠపరిమితిని వెంటనే అమలువచ్చేటట్లుగాక,ఏ అయిదేళ్ళతరువాతనో ఆ గరిష్ఠ పరిమితి అమలులోకి వస్తుందని ప్రకటించడం. గరిష్ఠపరిమితికి మించిన నివేశన స్థలంగలవారు, అయిదేళ్లలోపున ఆ నివేశన స్థలాన్ని గరిష్ఠ పరిమితికి మించ కుండా, తగ్గించుకోవాలని నిబంధనపెట్టడం. ఇలా చేసినట్లయితే, పరిమితికి మించిన స్థలాలుగలవారు తమకు ఎక్కువవున్న స్థలాన్ని అమ్ముకోవడమో, అన్నదమ్ములమధ్యనూ, తండ్రికొడుకులమధ్యను పంచుకోవడమో చేస్తారు. ఈ విధంగా, నివేశన స్థలం లేనివారికి నివేశన స్థలం సంపాదించుకోవడానికి అవకాశం కలగడమేకాకుండా,అయిదేళ్లయేటప్పటికి ఏ వ్యక్తికీ, యిరుగుపొరుగు

వారికి ఎవరికీ మించిన నివేశన స్థలం వుండకుండా, నివేశన స్థలాల విషయంలో ఒక విధమైన సమానత్వం ఏర్పడుతుంది. ఏ వ్యక్తికి నష్టంవుండదు; ఏ కుటుంబానికి బాధవుండదు ప్రభుత్వం యీ సూచనను శ్రద్ధతో పరిశీలిస్తారని ఆశిస్తున్నాము

* * *

ఆంధ్రప్రదేశ్‌లో ఫిలిం పరిశ్రమ నెలకొని, అభివృద్ధికి వస్తుందనే ఆశతో, ఆంధ్రప్రదేశ్‌లో, అత్యధిక భాగం తయారయిన ఫిలిముకు లక్ష రూపాయలను సబ్సిడీగా యిస్తామని, సుమారు పదిహేనేళ్ళనాడు రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించారు. ఆ ప్రకారం, ఇన్నాళ్లూ ప్రతి సంవత్సరమూ కొన్ని ఫిలిములకు యీ సబ్సిడీని యిస్తూ వచ్చారు. కాని ఆంధ్రప్రదేశ్‌లో ఫిలిం నిర్మాణం అభివృద్ధి పొందలేదు. మంచి స్టూడియోల నిర్మాణంగాని, పటిష్టమైన నిర్మాణ పద్ధతులుగాని ఏర్పడలేదు. సబ్సిడీని పొందడానికి అవసరమైన నిబంధనలను ఎంతవరకు పాటించాలో అంతవరకు మాత్రమే వాటిని పాటించి, ఫిలిం నిర్మాతలు చాలా మంది ఆ సబ్సిడీలను వసూలు చేసుకున్నారుగాని రాష్ట్రంలో ఫిలిం నిర్మాణ సౌకర్యాలను పెంపొందించడానికి శ్రద్ధ చూపలేదు. అంచేత, ఫిలిం నిర్మాణానికి ఆంధ్రప్రదేశ్‌లో పదిహేనేళ్ళనాడు ఉన్న సౌకర్యాలు, యీనాటికీ ఏమాత్రం అభివృద్ధి పొందలేదు. అంచేత యీ సబ్సిడీ పద్ధతిని రద్దుచేస్తున్నామని ముఖ్యమంత్రి ప్రకటించారు. ఇది కూడా చాలా సుముఖత నిర్ణయం. రాష్ట్రంలో ముఖ్యంగా హైదరాబాద్ నగరంలో, ఫిలిం నిర్మాణానికి సౌకర్యాలను కలిగించి, ఎక్కువ ఫిలిములు పూర్తిగా మన రాష్ట్రంలోనే తయారయేటట్టు చెయ్యడానికి అన్నివిధాలా సహాయం చేస్తామని ముఖ్యమంత్రి చేసిన ప్రకటన హర్షించదగినది.

ఫిలిం నిర్మాణం, బాగా జరిగితే, అది ఒక పెద్ద పరిశ్రమగా పరిణమించగలదు కొన్ని లక్షల మందికి ఉపాధి కల్గించగలదు. ప్రభుత్వాదాయాన్ని బాగా పెంచగలదు. నగరానికి శోభ తేగలదు. లలితకళలకు ప్రోత్సాహం ఇవ్వగలదు. కాబట్టి, ప్రభుత్వం, ఒక పెద్ద ప్రణాళికను మంచి కట్టుదిట్టాలతో తయారుచేసి, ఆ ప్రకారం, రాష్ట్రంలో ఫిలిం నిర్మాణం ఎక్కువగా జరిగేటట్టు చూడాలి. స్టూడియో సౌకర్యాలు పూర్తిగా హైదరాబాద్ నగరంలోనే కేంద్రీకరించక, అన్ని వసతులూగల ఒకటి రెండు పట్టణాలలో కూడా ఏర్పాటు చేయడం మంచిది. ఈ విషయంలో ప్రభుత్వ కృషికి, తెలుగు ఫిలిం నిర్మాతలందరూ సంపూర్ణమైన సహకారాన్ని చేకూర్చుతారని ఆశిస్తున్నాము.

---

అక్టోబరు నెల యువ

# భావపరిచయ పోటీ

బహుమానం రూ. 25

**ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి**



గమనిక : వ్యాఖ్యలు పోస్టుకార్డు మీదనే వ్రాయాలి.
ఆగస్టు 28 వ తేదీలోపు మాకు చేరాలి.

---

## సెప్టెంబరు నెల భావపరిచయ పోటీ

*బహుమతి పొందిన వ్యాఖ్య*



గళంలోని సమన్వయం ! శ్రోతల కది విస్మయం

— కె. వి. ఎన్. రాఘవన్, వరంగల్.




శ్రీనివాసన్ స్కూటర్ని లజ్‌లో ఆపి డిగాడు. నలువైపులా ఫ్లోరసెంట్ లైట్లు ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి. ఎటుచూసినా షాపులు!

బస్సులూ, కార్లూ దూసుకుపోతున్నాయి. శ్రీనివాసన్ పేవ్‌మెంటు మీద నిలబడి సిగరెట్ వెలిగించాడు. పొగ వదుల్తూ ప్రవాహంలా కదిలే ప్రజలనూ, వాహనాలనూ చూస్తున్నాడు.

టైం చూశాడు. తొమ్మిదింకా కాలేదు. లుంగీ, పొట్టిచేతుల చొక్కా ధరించిన ఒక నల్లటివ్యక్తి అతడి పక్కనుంచి వెళ్తూ ఎందుకో ఆగాడు.

పిక్‌పాకెట్ ఏమో అనుకున్నా డతను.

"బాటిల్ సార్!" అన్నాడతను తగ్గుస్వరంలో.

అతడివంక శ్రీనివాసన్ పరీక్షగా చూశాడు.

"ఏం బాటిల్ ?"

"గోల్కొండ బ్రాండీ, సార్. హాఫ్ బాటిల్."

"ఎంత ?"

"యాభై రూపాయలు సార్."

"కల్తీలేని సరకేనా ?"

"ఒకసారి తాగిచూస్తే మీకే తెలుస్తుంది. మంచి స్టాకు సార్," అన్నాడతను.

తమిళనాడులో ప్రొహిబిషన్ మూలంగా బ్రాండీ, విస్కీ, రమ్ మొదలగు మత్తు ద్రవాలు సులువుగా దొరకవు ఆ వ్యక్తి బాటిల్ గురించి చెప్పగానే శ్రీనివాసన్ ఆశ్చర్యపోయాడు.

అతడి వయస్సు ముప్ఫయి ఏళ్లు. ఒక టెలివిజన్ కంపెనీలో అతడు సేల్స్ ప్రమోటర్‌గా పనిచేస్తున్నాడు. బయటి రాష్ట్రాలకు వెళ్ళినప్పుడు తప్పక తాగుతూ వుంటాడు. మద్రాస్ పట్నంలో దొరుకుతున్న యీ అవకాశాన్ని పోగొట్టుకోకూడదని అతడు నిశ్చయించుకున్నాడు.

"బాటిల్ని నేను చూడాలి," అన్నాడతను.

"ఇక్కడ చూపించలేను." అలా వెళ్దాం రండి," అన్నాడతను.

ఇద్దరూ రోడ్డు దాటారు. ఒక స్ట్రీట్‌లైట్ కింద నిలబడ్డారు. సమీపంలో ఎవ్వరూ లేరు. బనీను అడుగునుంచి అతడొక బాటిల్‌ను తీసి శ్రీనివాసన్ కిచ్చాడు.

లైట్ కాంతిలో బాటిల్ని అతడు జాగ్రత్తగా పరిశీలించాడు. సీల్డ్ బాటిల్, గోల్కొండ బ్రాండీ! కల్తీ సరకులా లేదు. ఇంతకు ముందు ఎన్నిసార్లో ఆ బ్రాండీ తాగిన శ్రీనివాసన్‌కి నమ్మకం ఏర్పడింది. "నువ్వు ప్రతిరోజూ యీ ప్రాంతంలో ఉంటావా ?" అడిగా డతను.

అతడు వెంటనే జవాబివ్వలేదు.

"నాకు యీ సరకు మళ్ళీ మళ్ళీ కావలసి వుంటుంది. అందుకని అడుగుతున్నాను," అన్నాడతను.

"వుంటాను, సార్."

పర్స్ తెరిచి యాభైరూపాయలు అతడి కిచ్చాడు శ్రీనివాసన్. అతను గబగబా వెళ్ళిపోయాడు.

శ్రీనివాసన్ పేవ్‌మెంటమ్మట నడిచాడు. బాటిల్ భద్రంగా పాంటుజేబులో ఉంచి. ఒక హోటల్లో కెళ్ళి అతడు మిక్చర్. పకోడీల పొట్లాలు కొన్నాడు. హుషారుగా రోడ్డు కటువైపున్న స్కూటర్ ముందుకు నడిచాడు. క్షణంలో స్కూటర్ రోడ్డమ్మట దూసుకుపోయింది.

* * *

రామారావు, గోపాలం పేవ్‌మెంటు మీదనుంచి పక్కకు కదిలారు. కొంచెం దూరంలోవున్న గుడిసెలోకి రహస్యంగా దూరారు.

గుడిసెలో హరికెన్ లైటు వెల్గుతోంది. పొట్టిగా, లావుగావున్న ఒకతను వాళ్ళవైపు చూశాడు. అతడు ధరించిన తెల్లటి షర్టు లైటుకాంతిలో మెరుస్తోంది. అతడి చేతికి ఖరీదైన సీకో వాచ్ వుంది.

"ఏం కావాలి సార్ ?"

"మెక్‌డోవల్ బ్రాందీ, రెండు హాఫ్ బాటిల్స్," అన్నాడు రామారావు.

మూలగా వున్న ఒక కర్రపెట్టెలోంచి అతడు రెండు బుడ్డీలను తీసి వాళ్ళ కిచ్చాడు.

"నూట యిరవై రూపాయలు," అన్నాడతను.

అతడు అడిగిన ప్రకారం వాళ్ళు డబ్బిచ్చారు. బాటిల్స్‌ను పాంటు జేబుల్లో దాచుకొని వాళ్ళు హుషారుగా వెళ్ళిపోయారు.

గుడిసె బయట నిలబడి అతను వాళ్ళవైపే చూస్తున్నాడు. ఎవరో గుడిసె వైపు వస్తున్నారు. అతడి వయస్సు యాభై పైగా వుంటుంది. ఖరీదైన సూటులో వున్నాడతను.

గుడిసె ముందున్నతను సూటుమనిషి వంక ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఇక్కడ బాటిల్స్ దొరుకుతాయని విన్నాను," అన్నాడతను.

"ఎవరో చెప్తే విన్నారా?" అడిగాడు గుడిసెముందున్న వ్యక్తి.

"నా ఫ్రెండ్ రామన్ చెప్పాడు."

"లోపలకు రండి," అన్నాడు అతను.

సూటుమనిషి లోపలకు వెళ్లాడు. హరికెన్ లైట్ డిమ్ కాంతిలో గుడిసె నలువైపులా చూశాడు.

"ఏం కావాలి సార్ ?"

"బ్రాందీ, విస్కీ ఏదైనా సరే - నాకు ఎక్కువగా కావాలి. మేరేజి పార్టీ," అన్నాడతను.

"మెక్‌డోవల్ ఫుల్ బాటిల్ 120 కి యిస్తాను."

"పది బాటిల్స్ కొంటాను. ధర తగ్గించాలి." బేరమాడాడు, సూటుమనిషి.

"ఐదు రూపాయలు తగ్గించుకోండి."

"అలాగే."

అతడు బాటిల్స్ తేడానికి క్రరపెట్టె దగ్గరకు వెళ్ళాడు. సూటుమనిషి రెండడుగులు ముందుకేశాడు.

"నాకు కావలసిన స్టాకు దొరికినందుకు సంతోషంగా వుంది. నీ పేరేమిటి?"

"దొరైరాజ్" అన్నాడతను.

దొరైరాజ్ పది బుడ్డీలను ఒక అట్టపెట్టెలో పెట్టాడు.

"నే నొక బాటిల్ని చూడొచ్చా ?"

ఒక బాటిల్ని తీసి అతడు సూటుమనిషి కిచ్చాడు.

అతడు బాటిల్ని పరీక్షించాడు. కల్తీ సరకులా లేదు.

"తొందరగా డబ్బివ్వండి!" వెయ్యీ నూట యాభై," అన్నాడు దొరైరాజ్.

సూటుమనిషి చెయ్యిని కోటుజేబులోకి పోనిచ్చాడు. పైకొచ్చిన అతడి చేతిలో పిస్టల్ మెరుస్తోంది.

"దొరైరాజ్! నిన్ను అరెస్టు చేస్తున్నాను?" గర్జించాడతను.

దొరైరాజ్ రెండుసార్లు దగ్గాడు. ఎవరో సూటుమనిషిని వెనకనుంచి బలంగా లాగారు. సూటుమనిషి బోర్లా ముందుకుపడ్డాడు

పిస్టలున్న అతడిచేతిమీద దొరైరాజ్ కాల్తో గట్టిగా తొక్కాడు. గుడిసెలో చాలామంది గుమిగూడారని సూటుమనిషి గ్రహించాడు

అతడి చేతి ని పిస్టల్ని దూరంగా తన్నాడు దొరైరాజ్.

అతడిని లేవదీసి కాల్తో పొట్టలో తన్నాడు. అతడు దూసుకుంటూ వెనక్కి వెళ్ళాడు. వెనకనుంచి ఎవరో తన్నారు. అతడు ముందుకు పడ్డాడు.

"నన్ను అరెస్టు చేస్తాడట!" అర్చాడు దొరైరాజ్.

గుడిసెలో వొచ్చిన జనమంది దొరైరాజ్ వ్యంగ్యంగా అన్న మాటలు విని నవ్వారు. "వీడు పోలీసోడిలా వున్నాడు. సఫా చేసెయ్యండి !" అర్చాడతను.

సూటుమనిషి బాధతో మూలుగుతున్నాడు. తటాలున అతడి వీపులోకి కత్తి దిగింది. ఒకడు అతడి నోరును నొక్కేశాడు అతడి చావుకేక బయటకు వినపడలేదు.




గుడిసె బయట యిద్దరు మనుషులు కాపలా వున్నారు. సూటుమనిషి చుట్టూ వున్నవాళ్లు దూరంగా జరిగారు.

గ్లాసుల్లో పోసుకొని వాళ్లు తాగుతున్నారని కొనవూపిరితో వున్న సూటుమనిషి గ్రహించాడు. సమీపంలో నేలమీద పడున్న బాటిల్ని అతడి చెయ్యి చుట్టేసింది. అతడు పక్కకు కదిలాడు.

"శవాన్ని ఏంచేద్దాం ?" అన్నారెవరో.

"ఎక్కడేనా పారేయండి. మనమీదకు అనుమానం రాకూడదు. వీడిక్కడికి ఎలా వచ్చాడో చూడండి. కారులో వచ్చుంటే దానిలోనే వాడి శవాన్ని పడేసి పట్టుకుపోవచ్చు," అన్నాడు దొరైరాజ్.

"చూస్తాం," అన్నా డొకతను.

* * *

## 2

గిరి ఎక్స్ వై జెడ్ కారును పోనిస్తున్నాడు. పక్కనే కూర్చున్నాడు వాలి. ఆజానుబాహుడు, కండలు తిరిగిన శరీరం, బుగ్గమీసాలు, కాంతివంతమైన కళ్లు. అతడినోట్లో వున్న పొడుగాటి చుట్ట కాల్తోంది. పొగవదుల్తూ అతడు ఆలోచిస్తున్నాడు.

క్లాక్ టవర్ సమీపంలో పోలీస్ జీప్ ఆగివుంది. ప్రజలు గుంపులుగా నిలబడివున్నారు. పోలీసులు పెక్కుమంది వున్నారు.

కారును జీప్ వెనుక ఆపాడు గిరి. వాలి కిందకు దిగాడు. ఇన్‌స్పెక్టర్ కేశవన్ గబగబా వచ్చి వాలికి నమస్కరించాడు.

రోడ్డు వారగా పాతబడిన ఆస్టిన్ కారు ఆగివుంది. కారు ముందుసీటుమీద ఒకతను బోర్లా పడున్నాడు. అతడు ధరించిన కోటు ఎర్రబడి వుంది, వెనుకనుంచి కత్తితో పొడిచుండాలి! కత్తి కోటును చీల్చుకొంటూ లోపలకు పోయింది.

"ఇత నెవరో తెలిసిందా ?" అడిగాడు వాలి.

"ఇన్‌స్పెక్టర్ పీటర్ సార్. ప్రొహిబిషన్ డిపార్టుమెంటు తరపున పనిచేస్తున్నాడు. మఫ్టీలో వెళ్ళి దొంగసారా అమ్మే రహస్య స్థావరాలను పరికిస్తూ వుంటాడు," అన్నాడు యిన్‌స్పెక్టర్.

ఇన్‌స్పెక్టర్ పీటర్ కోటుజేబులను వాలి తడిమి చూశాడు. ఒక జేబులో క్వార్టర్ విస్కీ బాటిల్ వుంది. సీలు పగల్లేదు.

బాటిల్ని వాలి పరీక్షగా చూశాడు. ఆంధ్రరాష్ట్రంలో ఒక పేరుపొందిన కంపెనీ తయారుచేసిన విస్కీ అది !

"కేశవన్ భాయ్! పీటర్‌కు తాగే అలవాటుందా ?" ప్రశ్నించాడు వాలి.

"పీటర్ తాగరు, సార్. ఒకప్పుడు తాగేవారు. తర్వాత పూర్తిగా మానేశారు. మద్యపానం అంటే ఆయనకు అసహ్యం. ఎన్నో కుటుంబాలు దాని మూలంగా చితికిపోయి, నాశనమవుతున్నాయని ఆయన అభిప్రాయం," అన్నాడు కేశవన్.

మరో జేబులో పర్స్ వుంది. పర్స్‌లో యిరవై రూపాయలు, అరవై పైసలు చిల్లర కనిపించింది.

"ప్రొహిబిషన్ అఫెండర్స్‌ను పట్టుకోడానికి వెళ్ళే యితని దగ్గర పిస్టల్ లేకపోవడం విచిత్రంగా వుంది," అన్నాడు వాలి.

"ఆయన జేబులో పిస్టల్ ఎప్పుడూ వుంటుంది," అన్నాడు కేశవన్.

శవాన్ని పైకెత్తి కారు సీటును వాలి పరీక్షించాడు. సీటుమీద రక్తం మరకలు లేవు!

చుట్టపొగ వదుల్తూ వాలి క్షణకాలం ఆలోచిస్తూ వుండిపోయాడు. ఇన్‌స్పెక్టర్ కేశవన్, అసిస్టెంట్ గిరి అతడి పక్కనే వున్నారు.

"కేశవన్ భాయ్! పీటర్ కార్లో యిక్కడ మరణించలేదు. ఎక్కడో

అతడిని చంపి, కారులో శవాన్ని తెచ్చి యిక్కడ వదిలేసి వుండాలి," అన్నాడు వాలి.

"అలాగే కనిపిస్తోంది, సార్" అన్నాడు యిన్స్పెక్టర్.

"ఇన్స్పెక్టర్! పీటర్ మత్తుద్రవా లమ్మే రహస్య స్థలానికి వెళ్తుంటాడు. అతడు బ్రతికుంటే తమకు ప్రమాదమని గుర్తించి బూట్లెగ్గర్స్ పీటర్ని హతమార్చారు. తనెక్కడికి వెళ్లిందీ మనకు సూచించడంకోసం యీ క్వార్టర్ బాటిల్ని అతడు జేబులో పడేసుకొని వుంటాడు," అన్నాడు వాలి

"వాలిగారూ, సమీపంలోవున్న యితర రాష్ట్రాలనుంచి మత్తుద్రవాలను స్మగుల్ చేసేవాళ్లను ధ్వంసం చెయ్యాలి! అంతవరకూ పీటర్ ఆత్మకు శాంతి చేకూరదు!" అన్నాడు ఇన్స్పెక్టర్ కేశవన్ వుద్రేకంగా.

వాలి సూటిగా ఇన్స్పెక్టర్ వంక చూశాడు. "కేశవన్ భాయ్, బూట్లెగ్గర్స్ అన్నిటికీ తెగించిన వ్యక్తులు. వాళ్ల తోవకు అడ్డొచ్చినవాళ్లను నిర్దాక్షిణ్యంగా నిర్మూలిస్తారు!"

"వాలిగారూ! యిటువంటి ఘోరాలు జరగకుండా మనం జాగ్రత్తపడాలి," అన్నాడు కేశవన్.

వాలి మాట్లాడకుండా తన కారువద్దకు నడిచాడు. గిరి స్టీరింగ్ వీల్ వెనక కూర్చున్నాడు. పక్కనే కూర్చొని వాలి తలుపుమూశాడు.

బయట నిలబడిన ఇన్స్పెక్టర్ కేశవన్వైపు అతడు నవ్వుతూ చూశాడు.

"కేశవన్ భాయ్! నేరస్తులు నేరాలు చేస్తూనే వుంటారు. ఎప్పుడో అప్పుడు మనకు చిక్కుతారు, డోంట్ వర్రీ," అన్నాడు వాలి.

గిరి కారును పోనిచ్చాడు. కారు స్పీడుగా ప్రయాణం చేస్తోంది.

"అతడి దగ్గరున్న పిస్టల్ ఏమై వుంటుంది?" అడిగాడు గిరి.

"అతడిని చంపినవాళ్లు లాక్కొని వుండాలి!"

"చాలామంది అతడిని చుట్టుముట్టారని మీ రెందు కనుకుంటున్నారు?"

"పీటర్ బలమైన మనిషి. అతడు ఎవరితోనో పోట్లాడుతూవుండగా మరెవరో వెనకనుంచి పొడిచుండాలి! అందువలన ఎక్కువమందితో అతను పోరాడాడని మనం అనుకోవాలి," అన్నాడు వాలి.

హోటల్ అశోక్ కాంపౌండ్లో కారు ఆగింది. కిందకు దిగి వాలి ముందు హాల్లోకి నడిచాడు. కిందిభాగంలో వున్న తన గదివైపు పెద్ద అంగల్లో కదిలాడు.

* * *

# 3

ఏర్‌కండిషన్డ్ గదిలో చల్లగా వుంది. గది అందంగా అలంకరించబడింది. గదిలో ఖరీదైన సోఫా లున్నాయి. మరోవైపున గాడ్‌రెజ్ స్టీల్ టేబుల్, కుర్చీలు వున్నాయి.

ఒక సోఫాలో కూర్చుని వున్నాడు బూట్‌లెగ్గర్ బుచ్చయ్య.

పొట్టిగా, లావుగా వున్నాడతను. అతడు ధరించిన పాంట్, స్లాక్ ధగధగా మెరుస్తున్నాయి. కుడిచేతికి ఖరీదైన వాచ్ వుంది. ఎడంచేతిమీద బంగారు కంకణం మెరుస్తోంది.

బుచ్చయ్య వయస్సు నలభై దాటి ఉంటుంది. మొహంనిండా మసూచికం మచ్చలు! నల్లటి మనిషి. అతడి ఎదురుగా దొరైరాజ్ నిలబడి వున్నాడు.

"ఏం జరిగింది ?" అడిగాడు బుచ్చయ్య.

"అతడు మామూలు కస్టమరు అనుకున్నాను బాస్. పిస్టల్‌తో నన్ను బెదిరించాడు. నేను గట్టిగా దగ్గగానే మన మనుషులు లోన కొచ్చారు. సింహాలు అతడిని వెనకనుంచి పొడిచేశాడు," అన్నాడు దొరైరాజ్.

"గుడ్‌వర్క్."

"శవాన్ని అతడి కారులో పడేసి క్లాక్‌టవర్ ప్రాంతంలో మన మనుషులు వదిలేశారు."

"అతడెవరో తెలిసిందా ?"

"ఇన్‌స్పెక్టర్ పీటర్ అని ప్రజలు చెప్పుకుంటున్నారు." బుచ్చయ్య క్షణకాలం ఆలోచించాడు.

"అతడు నీ గుడిసెలోకి వస్తుంటే ఎవరేనా చూసుంటారా ?" అడిగాడతను.

"ఎవరేనా చూసివుండొచ్చు !"

"పోలీసు ఆఫీసర్ మరణిస్తే తలిమ్మా పోలీసువాళ్లు కక్షగట్టి మనమీద పగ సాధించడానికి ప్రయత్నిస్తారు. బి కేర్‌ఫుల్ !" అన్నాడతను.

గ్లాసులో స్కాచ్ విస్కీ పోసుకుని సోడా కలిపాడతను. గడగడ విస్కీ తాగేసి బుచ్చయ్య సిగరెట్ వెలిగించాడు.

"ఏ మార్పులేనా అవసరమైతే నీకు కబురుచేస్తాను. కొన్నిరోజులపాటు ఎలర్ట్‌గా వుండు," అన్నాడు బుచ్చయ్య.

అతడికి వినయంగా దొరైరాజ్ నమస్కరించాడు.

"ఈ రాత్రి కొత్తస్టాక్ రెండు లారీల్లో బెంగుళూరునుంచి వస్తుంది. ఇక్కడి ప్రజలకు ఏ కరువూ లేకుండా మనం చూడాలి," అన్నాడు బుచ్చయ్య.

"అలాగే బాస్," అని దొరై రాజ్ వెళ్లిపోయాడు.

టెలిఫోన్ మ్రోగింది. అతడు రిసీవరెత్తి "హలో!" అన్నాడు.

"బాస్, కిషోర్ రిపోర్టింగ్. నేను క్లాక్‌టవరు దగ్గర వున్నాను. ప్రఖ్యాత డిటెక్టివ్ వాలిగారొచ్చి ఇన్‌స్పెక్టర్ పీటర్ శవాన్ని చూసివెళ్లారు."

"వాలిగారా?" అన్నాడు బుచ్చయ్య ఆశ్చర్యంగా.

"యస్, బాస్."

"ఆయన డేంజరస్ మేన్. మనం చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి," అన్నాడతను.

కిషోర్ చెప్పిన మరి కొన్ని విషయాలు విని అతడు రిసీవర్ని పెట్టేశాడు. అతడి మెదడులో ఆలోచనలు తిరుగుతున్నాయి.

* * *

## 4

ఆకాశంలో అర్ధచంద్రుడు నీరసంగా కనిపిస్తున్నాడు. నక్షత్రాలు మినుకు మినుకుమంటున్నాయి.

రెండు లారీలు రోడ్డువారగా ఆగాయి. ఒక ఫియట్ కారొచ్చి వాటిపక్కనే ఆగింది. కారులో ఐదుగురు మనుషులున్నారు.

లారీ డ్రయివర్లు కారుపక్కకు వచ్చారు. వెనుకసీటుమీద కూర్చున్న జాన్ వాళ్లవైపు నవ్వుతూ చూశాడు.

"పైన చెక్‌పోస్టు వస్తోంది. మీరు ధైర్యంగా వుండండి. ఏదేనా ప్రమాదం వస్తే మేం వెంటనే మీకు సహాయపడ్తాం," అన్నాడు జాన్.

డ్రయివర్లు తలలూపి లారీల దగ్గరకు వెళ్లారు. ఫియట్‌కారు ముందుకు వెళ్లిపోయింది.

చెక్‌పోస్టుముందు రెండు లారీలు ఆగాయి. గోల్డెన్ లారీ సర్వీస్ అని పెద్ద అక్షరాల్లో లారీలమీద రాయబడివుంది.

చెక్‌పోస్టులో అరడజనుమంది వున్నారు. లారీలను పైపైన చూసి వాళ్లు పోనిచ్చారు. రెండు లారీలూ రోడ్డమ్మట దూసుకుపోతున్నాయి.

రెండు ఫర్లాంగులు దాటాక పోలీస్‌జీప్ లారీలకు ఎదురైంది. ఆపమని పోలీసులు డ్రయివర్‌కు సౌంజ్ఞచేశారు.

రెండులారీలూ ఆగాయి. సబిన్‌స్పెక్టర్ శివరామ్ నలుగురు కానిస్టేబుల్స్‌తో సహా లారీలదగ్గరకొచ్చాడు. "చెక్ ది లారీస్ !" అన్నాడు శివరామ్.

కానిస్టేబుల్స్ రెండు లారీలను చెక్ చేస్తున్నారు. ఒక డీల్‌వుడ్ పెట్టెను తెరిచి చూశాడు కానిస్టేబుల్. అందులోవున్న బ్రాందీ బుడ్డీలను చూసి అతడు గట్టిగా అర్చాడు, "బ్రాందీ బాటిల్సు, సార్ !"

సబిన్‌స్పెక్టర్ శివరామ్ లారీఎక్కి పెట్టెలోవున్న బ్రాందీబుడ్డీలను చూశాడు. అమాంతంగా కిందకు దూకాడు

ఇద్దరు డ్రయివర్లూ, క్లీనర్లూ రోడ్డువారగా నిలబడి బీడీలు పీలుస్తున్నారు.

"పదండి, మా జీప్‌వెనక," అన్నాడు సబిన్‌స్పెక్టర్.

కారు హెడ్‌లైట్ల కాంతి వాళ్ళమీద పడింది. ఒక ఫియట్ కారొచ్చి వాళ్ళ పక్కనే ఆగింది

తటాలున తలుపులు తెరిచి ఐదుగురు బయటకు దూకారు. సబిన్‌స్పెక్టర్ని చుట్టేశారు.

"ఏమిటి గొడవ?" అడిగాడు జాన్.

జాన్ ఎలుగుబంటిలావు న్నాడు. సూటు ధరించాడు. "మిస్టర్, ఇది నీకు సంబంధించిన విషయం కాదు. నీ కారు చెక్ చెయ్యాలి," అన్నాడు సబిన్‌స్పెక్టర్.

బెల్ట్ హోల్డర్‌లో వున్న రివాల్వర్ని బయటకు తీయబోయాడు శివరామ్. అతని గద్దం జాన్‌దెబ్బకు పగిలింది. అతడు వెనక్కి పడ్డాడు.

శివరామ్ రివాల్వర్ని జాన్ లాక్కున్నాడు. జాన్ కోపంగా నేలమీద పడున్న శివరామ్‌వైపు చూశాడు.

"మమ్మల్ని ఆపితే నువ్వు చిక్కుల్లో పడ్తావు. మాతో సహకరిస్తే నీకు లాభిస్తుంది," అన్నాడు జాన్.

"ప్రాణంపోయినా మీకు నేను తలొంచను. ఆఖరిదాకా మీతో పోట్లాడతాను," అన్నాడు శివరామ్.

జాన్ పకపక నవ్వాడు. నేలమీదున్న సబిన్‌స్పెక్టర్ వైపు రెండుసార్లు షూట్‌చేశాడు. శివరామ్ అరుస్తూ కళ్ళుమూశాడు.

నలుగురు కానిస్టేబుల్సూ చేతులెత్తి వణుకుతూ నిలబడ్డారు.

"వాళ్ళపేర్లూ, అడ్రెస్‌లూ రాసుకోండి," అన్నాడు జాన్.

కానిస్టేబుల్ల పేర్లూ, అడ్రెస్‌లూ ఒకతను రాసుకున్నాడు. జాన్ వాళ్ళవంక చూశాడు.



"ఈ లారీలు ఏ కంపెనీకి చెందినవో మీరు చూశారు. ఆ కంపెనీ పేరు బయటపెడ్తే మీ యిళ్ళకొచ్చి మిమ్మల్నీ, మీ భార్యలనూ, పిల్లల్నీ హతమారుస్తాం," అన్నాడు జాన్.

జాన్ రూపంచూస్తే అతడు చెప్పింది చేస్తాడనే భయం అందరిలోనూ తలెత్తుతుంది!

"మేం చెప్పం సార్," అన్నాడొక కానిస్టేబులు.

"మరోగంటదాకా యిక్కడే వుండండి. ప్రాణాల్తో మిమ్మల్ని వదుల్తున్నాను. నాతో చెప్పినట్లు మీరు చెయ్యకపోతే పగ సాధిస్తాం."

సబిన్స్పెక్టర్ శవాన్ని రోడపక్కగా పారేయించి, జాన్ ఫియట్కార్లో కూర్చున్నాడు. బాటిల్లోవున్న రా విస్కీని అతడు కొంచెం తాగి సిగరెట్ వెలిగించాడు.

బయట నిలబడిన డ్రయివర్లవైపు అతడు చూశాడు

"చాలా వేగంగా లారీలను పోనీయండి. గంటలో మద్రాసుపట్టణం సమీపానికి చేరుకోవాలి." హెచ్చరించాడు జాన్.

"అలాగే, బాస్," అన్నాడు డ్రయివర్.

లారీలు కదిలాయి. ఫియట్ వాటినిదాటి వేగంగా ముందుకుపోయింది.

* * *

5

పోలీసుస్టేషన్ వరండాలో బల్లమీదున్న సబిన్‌స్పెక్టర్ శివరామ్ శవాన్ని వాలి పరీక్షగా చూశాడు

శవం పక్కన పూలదండలు కుప్పలుగా పడున్నాయి. ఇరవై రెండేళ్ళ యువతి, యాభై ఏళ్ళ స్త్రీ శవంపక్క కూర్చుని ఏడుస్తున్నారు.

"ఆమె రేవతి, శివరామ్ భార్య. ఆమె శివరామ్ తల్లి," ఇన్‌స్పెక్టర్ సుకుమార్ పరిచయం చేశాడు వాలికి.

జాలిగా వాలి వాళ్ళవైపు చూశాడు.

"నా బిడ్డకు పెళ్ళయి సంవత్సరం యింకా కాలేదు. దుర్మార్గులు వాడిని పొట్టనపెట్టుకున్నారు," అని తల్లి ఏడుస్తోంది.

వాలి పక్కనున్న గిరి వాళ్ళ ఏడ్పును భరించలేక రుమాలుతో కళ్ళు తుడుచుకున్నాడు. రేవతిని ఓదార్చుతూ అతడు పక్కనే కూర్చున్నాడు.

"కానిస్టేబుల్సు ఎక్కడున్నారు ?" అడిగాడు వాలి.

ఇన్‌స్పెక్టర్ సుకుమార్ తన గదిలోకి నడిచాడు-వాలి అతడి వెనకనే వెళ్ళాడు.

నలుగురు కానిస్టేబుల్సు గదిలో కొచ్చారు. వాళ్ళవైపు వాలి చిరునవ్వుతో చూశాడు.

"మీరింతమంది వుండి శివరామ్‌ని ఎందుకు చావనిచ్చారు ?" వాలి ప్రశ్నించాడు.

"ఆయనది మొండిధైర్యం సార్. మేం ఏదేనా చేసేలోపల వాళ్ళు ఆయన్ని కొట్టి చంపేశారు," అన్నాడు కానిస్టేబుల్ శివన్.

"వాళ్ళెవరు ?"

"వాళ్ళు ఫియట్ కారులో వచ్చారు సార్. మేం కారును చెక్ చేస్తున్నాం. ఈలోపల కార్లోంచి దిగినవాళ్ళు ఆయన్ని హతమార్చారు," అన్నాడు కానిస్టేబుల్ గిరిధర్.

"కారులో మీకు ఏదేనా దొరికిందా ?"

"కారులో రెండు విస్కీబాటిల్సు వున్నాయి. కారులోనివాళ్ల బాగా తాగి వున్నారు."

"వాళ్లను ఆపడానికి మీరెందుకు ప్రయత్నించలేదు ?" అడిగాడు వాలి.

"ఎలా ఆపుతాం సార్ ? మా దగ్గర ఆయుధాలు లేవు. వాళ్ల చేతుల్లో పిస్టల్స్ వున్నాయి," అన్నాడు శివన్.

చుట్ట పొగ వదుల్తూ వాలి ఆలోచిస్తున్నాడు. బెంగుళూరునుంచి రెండు బాటిల్స్‌ను వాళ్లు కారులో తెచ్చుకొంటున్నారా. ఆమాత్రం నేరానికి ఒక నిండు ప్రాణాన్ని బలితీసుకుంటారా ?

"వాళ్ల కారు నంబరు చూశారా ?"

"చీకట్లో మాకు కనపడలేదు, సార్."

"మీ దగ్గర టార్చిలైట్లు ఉండాలే!" అన్నాడు వాలి.

"వాళ్లు వాటిని లాక్కొన్నారు."

"ఇదంతా ఎన్నింటికి జరిగింది ?"

"పన్నెండు ప్రాంతంలో సార్."

"శివరామ్‌ని చంపినవాళ్లు మిమ్మల్ని ఎందుకు వదిలేశారు ?'' ప్రశ్నించాడు వాలి.

"మేం వాళ్లతో పోట్లాడలేదు, సార్. చేతులు పైకెత్తి నిలబడ్డాం,'' అన్నాడు గిరిధర్.

"తన డ్యూటీని నిర్వహిస్తూ ప్రాణాన్నిచ్చాడు శివరామ్. పోలీస్ డిపార్ట్ మెంటులో అతడి పేరు శాశ్వతంగా వుంటుంది. మీరు మీ డ్యూటీలు చెయ్య లేదు ?" అన్నాడు వాలి.

వాళ్లు మాట్లాడలేదు. తలలు వంచుకుని నిలబడ్డారు. శివన్ ఏడుస్తూ వాలి వంక చూశాడు. "మేం పిరికిపందలం కాము సార్. అయినా తెగించి వాళ్ళతో పోట్లాడితే ఒక శవానికి బదులు ఐదు శవాలు మీకు దొరికేవి!" అన్నాడతను.

ఆలోచిస్తూ వాలి గదిలో పచార్లు చేశాడు.

"కారులో రెండు విస్కీ బాటిల్సు తప్ప మరేమీ దొరకలేదా ?" అడిగాడు వాలి.

"లేదు సార్," అన్నాడు గిరిధర్.

అంతవరకూ మాట్లాడని కానిస్టేబుల్సువైపు అతడిచూపు మళ్లింది. ఒకడు వొణుకుతున్నాడు.

"గత రాత్రి చూసినవాళ్ల గుర్తుకొచ్చి వొణుకుతున్నట్లున్నావు ?" అన్నాడు వాలి.

"దీనదయాళ్ వయస్సులో పెద్దవాడు సార్. రాత్రి జరిగింది చూశాక అతడు షాక్ తిన్నట్లు ప్రవర్తిస్తున్నాడు," అన్నాడు శివన్.

కానిస్టేబుల్స్‌ను వెళ్లిపొమ్మన్నాడు వాలి. ఇన్‌స్పెక్టర్ సుకుమార్‌వైపు చూశాడతను.

"శవ పరీక్ష అయిందా ?"

"రాత్రి పన్నెండూ ఒంటిగంట మధ్య శివరామ్ మరణించి వుంటాడని డాక్టర్ రిపోర్టులో వుంది."

"చెక్‌పోస్టు యిక్కడి కెంత దూరంలో వుంది ?"

"ఆరు కిలోమీటర్ల దూరంలో."

"సుకుమార్ భాయ్. అక్కడకు వెళ్లి దర్యాప్తు చేద్దాం. హత్య జరిగిన ప్రదేశాన్ని మనం చూడాలి," అన్నాడు వాలి.

వాలి గదిలోంచి బయట కొచ్చాడు. పోలీస్ జీప్, వెనకనే ఎక్స్ వై జెడ్ కారు రోడ్డమ్మట దూసుకుపోయాయి.

చెక్‌పోస్టు ముందు కార్లు ఆపి అందరూ దిగారు. చెక్‌పోస్టు ఇన్‌ఛార్జి రామచంద్రన్‌తో వాలి మాట్లాడాడు.

"గత రాత్రి పన్నెండు ప్రాంతంలో యీ చెక్‌పోస్టు ద్వారా ఏయే కార్లు వెళ్లాయి ?" అడిగాడు వాలి.

"మొదట్లో ఒక అంబాసిడర్ కారు వెళ్లింది. ఆ తర్వాత ఫియట్ కారు వెళ్లింది. వెనువెంటనే రెండు లారీలు వెళ్లాయి," అన్నాడు రామచంద్రన్, రికార్డులు చూసి.

"వాటి నంబర్లు కావాలి," అన్నాడు వాలి.

రామచంద్రన్ చెప్పిన నంబర్లను గిరి డైరీలో రాసుకున్నాడు.

"మీరు వాటిని చెక్ చేశారా ?"

"కార్లను చెక్ చేశాం. వాటిలో మా కేమీ దొరకలేదు. ఆ కంపెనీ లారీలు తరచు వెళ్తూనే వుంటాయి."

"ఏ కంపెనీ అది ?"

"గోల్డెన్ లారీ సర్వీస్ వారి లారీలు."

ఆ కంపెనీ పేరును గిరి రాసుకున్నాడు.

"పన్నెండు తర్వాత మీకు పిస్టల్ కాల్పులు వినిపించాయా ?" అడిగాడు వాలి.

"రెండుసార్లు చప్పుళ్లు వినపడ్డాయి. లారీ టైర్లు బరస్టయి వుండొచ్చు అనుకున్నాం," అన్నాడు రామచంద్రన్.

వాలి కారువైపు నడిచాడు. ఎక్స్ వై జెడ్ కారు కదిలింది. వెనకనే పోలీస్ జీప్ వస్తోంది.

సుకుమార్ సంజ్ఞలను గుర్తించి గిరి కారును ఆపాడు. వాలి కిందకు దిగాడు. సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. చల్లటిగాలి వీస్తోంది. రోడ్డు పొడుగునా చెట్లు వున్నాయి. రోడ్డు సమీపంలో పొదలున్నాయి.

ఇన్స్పెక్టర్ సుకుమార్ గబగబా వాలి దగ్గర కొచ్చాడు.

"ఇక్కడే పోట్లాట జరిగింది, సార్." అన్నాడు సుకుమార్.

రోడ్డు వారగా ఒకచోట రక్తం మరకలు కనిపిస్తున్నాయి. ఎర్రచీమలు పుట్టలుగా అక్కడున్నాయి.

"శివరామ్ యిక్కడే పడిపోయి ఉండాలి," అన్నాడు వాలి.

ఆ స్థలాన్ని వాలి పరీక్షించాడు. రోడ్డువారగా వున్న నల్లమట్టిమీద టైర్ల గుర్తులున్నాయి. వాటిని జాగ్రత్తగా చూశాడు వాలి. ఒకచోట కొన్ని బీడీ పీకలు పడున్నాయి.

"సుకుమార్ భాయ్, ఫియట్ కారువెళ్ళిన సమీయంలో లారీలు కూడా వెళ్లుండాలి. కానిస్టేబుల్సు వాటిని గురించి ఏమీ చెప్పకపోడం విచిత్రంగా వుంది," అన్నాడు వాలి.

"ఈ దేశంలో మనం గుచ్చి గుచ్చి అడిగితేగాని ఎవ్వరూ ఏమీ చెప్పరు," అన్నాడు ఇన్స్పెక్టర్.

"అది కారణం కాకపోవచ్చు!" అన్నాడు వాలి క్లుప్తంగా.

"వాళ్లను అడిగితే నిజం తెలుస్తుంది," అన్నాడు గిరి.

గిరి కారును పోనిచ్చాడు. వెనకనే జీప్ వస్తోంది — పోలీసు స్టేషన్ ముందు వందలాది ప్రజలు గుమిగూడి వున్నారు. ప్రజలు క్యూలో వెళ్లి సబిన్స్పెక్టర్ శవాన్ని చూసిపోతున్నారు.

ఇన్స్పెక్టర్ సుకుమార్ గదిలోకి నడిచాడు వాలి. శవం ఉన్నచోటుకు వెళ్ళాడు గిరి.

కానిస్టేబుల్సు గదిలో కొచ్చారు.

"మీరు చెక్ చేసిన ఫియట్ కారు ఎటు వెళ్తోంది ?" అడిగాడు వాలి.

"మద్రాసువైపు వెళ్తోంది సార్," అన్నాడు శివన్.

"మీకు రెండు లారీలు కనిపించాయా ?"

శివన్ ఎందుకో గిరిధర్‌వంక చూశాడు.

"మేం కారును చెక్ చేస్తుండగా రెండు లారీలు వెళ్ళడం గమనించాను, సార్."

"వాటి నెందు కాపలేదు ?''

''శివరామ్‌గారు ఆపమనలేదు, సార్."

"మీకు అంబాసిడర్ కారు కనిపించిందా ?"

"కనిపించింది సార్. అందులో ఆడవాళ్లు వున్నారు. డ్రయివర్ మాత్రం ముసలాడు. దాన్ని ఆపి, చెక్ చేయకుండా శివరామ్‌గారు పోనిచ్చారు."

వాళ్ళను వెళ్ళమన్నాడు వాలి. వాళ్లు వెళ్ళాక సుకుమార్‌వంక చూశాడు.

''సుకుమార్ ఖాయ్, వాళ్ళు పూర్తిగా నిజం చెప్పడంలేదు. అందుకు ఏదో కారణం ఉంటుంది. రహస్యంగా వాళ్లను గమనిస్తూ వుండాలి !" అన్నాడు వాలి.

"అలాగే చేస్తాను, సార్.''

చుట్టపొగ పీల్చి వదుల్తూ వాలి బయటనున్న కారువైపు నడిచాడు. అతడి వంక ప్రజలు విచిత్రంగా చూస్తూ నిలబడ్డారు.

* * *

## 6

పడక కుర్చీలో కూర్చుని వాలి దినపత్రికను చూస్తున్నాడు. ఇన్‌స్పెక్టర్ పీటర్ హత్య ! ఇప్పుడు సబిన్‌స్పెక్టర్ శివరామ్ హత్య ప్రొహిబిషన్ ఎవరి కోసం ? ఈ హెడ్ లైన్లతో మొదటి పేజీలో పెద్దవ్యాసం ముద్రించబడింది.

ఒక ప్రఖ్యాత రచయిత రాసిన వ్యాసమది ! ఎన్ని ఆడ్డంకులు పెట్టినా తాగేవాడు తాగడం మానడు. తమ స్వేచ్ఛకు అడ్డుపడే చట్టాలను ప్రజలు హర్షించరు. మధ్యపాన నిషేధం మూలంగా బూట్‌లెగ్గర్స్ ఎక్కువమంది రూపొందారు. తక్కువకాలంలో ఎక్కువ డబ్బు సంపాదించడానికి లిక్కర్ స్మగ్లింగ్ అనేకమందికి బిజినెస్ అయింది.

అన్నిటికీ తెగించిన బూట్‌లెగ్గర్స్‌ను పట్టుకోడానికి ప్రయత్నించి, నీతి నిజాయితీ గల పోలీసు ఉద్యోగులు ప్రాణాలను బలి యిస్తున్నారు.



ప్రొహిబిషన్‌కి వ్యతిరేకంగా వాదిస్తూ నవలా రచయిత తన వ్యాసాన్ని వుద్రేకంతో ముగించాడు.

"ప్రజలకు ఉన్నవి లేకుండా చేయడం కాదు ప్రభుత్వ కర్తవ్యం! వారికి లేనివాటిని సమకూర్చాలి! ఈ విషయాన్ని ప్రభుత్వం గుర్తించాలి." హెచ్చరించాడు రచయిత.

టెలిఫోన్ మ్రోగింది. వాలి రిసీవర్ని అందుకున్నాడు.

"వాలి స్పీకింగ్," అన్నాడు.

"వాలిగారూ, కరుణాకరన్ హియర్. మీతో అర్జంటుగా మాట్లాడాలి," అన్నాడు చీఫ్ మినిస్టర్ అటువైపునుంచి.

"వెంటనే వస్తాను," అని వాలి రిసీవర్ని పెట్టేశాడు.

చీఫ్ మినిస్టర్ కరుణాకరన్‌కి ఎదురుగా వాలి కూర్చున్నాడు. పొడవాటి చుట్ట అతడి పళ్లమధ్య ఉంది. పొగ పీల్చి వదుల్తున్నాడు.

నవ్వుతూ అతడు చీఫ్ మినిస్టర్‌వైపు చూశాడు. పొట్టిగా, లావుగా ఉన్నా

దతను. తలమీద ఫెజ్ కాప్ ధరించాడు. పంచ, జుబ్బాలో వున్నాడతను. పట్టుదల మనిషి.

"వాలిగారూ, నెల్రకితం మీతో మాట్లాడి మీ సహకారాన్ని కోరాను. ఈ రాష్ట్రంలో ప్రొహిబిషన్ విజయవంతం కావాలని నా కోరిక. ఎందరో పోలీసు ఉద్యోగులు నిర్విరామంగా కృషి చేస్తున్నారు. కాని నేను అనుకున్న విధంగా ఫలితాలు రాలేదు. పట్నంలో అనేకచోట్ల మత్తుద్రవాలు అమ్ముతున్నారని నాకు వార్తలు వస్తున్నాయి. ఇదంతా చూస్తుంటే నాకు చాలా నిరుత్సాహంగా ఉంది. పోలీసు ఉద్యోగులు హత్య చేయబడ్డం ప్రొహిబిషన్ వ్యతిరేకులకు ఆయుధమై కూర్చుంది. మద్యపాన నిషేధాన్ని విమర్శిస్తూ వ్యాసాలు ప్రచురితమవుతున్నాయి. ఈ పరిస్థితుల్లో ఏం చెయ్యాలో తోచడంలేదు," అన్నాడు చీఫ్ మినిస్టర్.

"కరుణాకరన్ భాయ్! నువ్వు నా సహకారం కావాలన్నావని సరే అన్నాను. కాని ప్రొహిబిషన్ జయిస్తుందనే నమ్మకం నాకు లేదు. చట్టాల మూలంగా మనుషులలో వున్న అలవాట్లను మనం ఆపలేం. అమెరికాలో ప్రొహిబిషన్ పెట్టి చివరికి రద్దుచేయవలసి వచ్చింది. రష్యాలాటి కమ్యూనిస్టు దేశాల్లో ప్రొహిబిషన్ లేదు. ఇది ముట్టరాదని మనం గట్టిగా అంటే మనుషులు దాన్ని రహస్యంగా ముట్టుకోడానికి ప్రయత్నిస్తారు. మద్యపానం నిషేధించకుండా, మద్యం సేవించడంవలన వచ్చే నష్టాలను గురించి ప్రభుత్వం విశేషంగా ప్రచారం చేయడం శ్రేయస్కరం. అప్పుడు కొందరేనా మద్యాన్ని వదిలేస్తారు. బాహాటంగా మద్యం దొరక్కపోవడం వలన బూట్‌లెగ్గర్స్‌కు అవకాశం ఏర్పడింది. హెచ్చు ధరలకు అమ్మి వాళ్ళు బాగా డబ్బు చేసుకొంటున్నారు. మద్యపాన నిషేధం నిజం చెప్పాలంటే బూట్‌లెగ్గర్స్‌కు ఉపయోగపడ్తోంది," అన్నాడు వాలి.

కరుణాకరన్ వెంటనే జవాబివ్వలేదు. ఆలోచిస్తూ కళ్ళు మూసుకొన్నాడు.

"అయితే ప్రొహిబిషన్ రద్దు చేయమంటారా ?"

"అలా నేను చెప్పను. ప్రొహిబిషన్ విజయవంతం కాదని నా నమ్మకం. నేను ఆంధ్రదేశంలో యీ మధ్య తిరిగాను. అక్కడ ప్రొహిబిషన్ లేదు. కాని తప్పతాగి రోడ్లమీద పడి తిరిగేవాళ్లు నా కెక్కడా అగుపించలేదు," అన్నాడు వాలి.

"వాలిగారూ, తాగుడంటే నాకు చిన్నప్పటినుంచీ అసహ్యం. నా తండ్రి

తప్పతాగి వచ్చి అమ్మనీ, పిల్లల్నీ చావగొట్టేవాడు. తాగుడువలన నా తండ్రి అకాలంగా మరణించాడు. ఒక యువకుడు తప్పతాగి తన వదిన చెయ్యి పట్టుకున్నాడు. తాగుడు మైకంలో మనిషి చేసే అపచారాలకు హద్దులుండవు. చట్టాలతో నిర్బంధిస్తేగాని ఎవ్వరూ తాగడం మానరు. ప్రొహిబిషన్ మూలంగా అందరూ బాగుపడకపోయినా కొందరేనా బాగుపడొచ్చని నా అభిప్రాయం. గాంధీజీ దేశమంతటా ప్రొహిబిషన్ పెట్టాలన్నారు!"

వాలి గంభీరంగా నవ్వాడు.

"మనం వాదించడం దేనికి? నన్నెందుకు రమ్మన్నావో చెప్పు," అన్నాడు వాలి.

"మీరొక మాస్టర్‌ప్లాను తయారుచేయండి. ఈ రాష్ట్రంలో ఎక్కడా మత్తు ద్రవాలు లేకుండా చేయాలి. బూట్‌లెగ్గర్స్‌ను నాశనం చెయ్యాలి. ఈ రాష్ట్రంలో ప్రొహిబిషన్ నిజంగా విజయవంతమవ్వాలి," అన్నాడు చీఫ్ మినిస్టర్.

"పక్క రాష్ట్రాలనుంచి స్మగుల్ చేసి ఇక్కడకు మత్తుద్రవాలను తెచ్చేవారిని పట్టుకోడానికి నేను ప్రయత్నిస్తాను. ఇది నేను ఒంటరిగా చెయ్యలేను. పోలీసు సహకారం నాకు కావాలి," అన్నాడు వాలి.

"వాలిగారూ, ఈ రాష్ట్రంలోని పోలీసులు మీతో పూర్తిగా సహకరిస్తారు. మీరు తొందరగా ఏదో చెయ్యాలి. ఇటుపైన హత్యలు లేకుండా మీరు చూడాలి. ఇద్దరు పోలీసు ఉద్యోగులు పోయేసరికి ప్రజల్లో దుమారం లేచింది. పత్రికలు ప్రభుత్వాన్ని ఏకేస్తున్నాయి."

"డోంట్ బాదర్, చెయ్యవలసింది చేస్తాను," అన్నాడు వాలి.

"వాలిగారూ, ఈ రాష్ట్రంలో ప్రతిచోటా బ్రాందీబుడ్లు అమ్ముతున్నారని రూమర్లు నా కందాయి. అవెంతవరకు నిజమో కనుక్కోండి. ఇటుపైన మనం తరచుగా కల్సుకొని అన్నివిధాలా కట్టుదిట్టంచేసే మార్గాలను వెతకాలి," అన్నాడు కరుణాకరన్.

ఆతడితో కరచాలనంచేసి వాలి బయటకు నడిచాడు.

* * *

## 7

పడక కుర్చీలో పడుకుని విశ్రాంతి తీసుకొంటున్న వాలి బూట్ల చప్పుడు విని కళ్ళు తెరిచాడు.

నవ్వు ముఖంతో గిరి గదిలో కొచ్చాడు. ఎదురుగాఉన్న సోఫాలో కూర్చున్నాడు.

"గోల్డెన్ లారీ సర్వీస్ గురించి వివరాలు సేకరించాను. ఆ కంపెనీ స్థాపించి ఇరవై ఏళ్లయింది. సంవత్సరం క్రితం ఆ కంపెనీ చేతులు మారింది. పి. అనూరాధ అనే ఆమె ఆ కంపెనీని కొంది. ప్రస్తుతం ఆ కంపెనీని ఆమె నడుపుతోంది," అన్నాడు గిరి.

"అనూరాధ ఎవరో తెలుసుకున్నావా ?"

"ఆమె భర్త మోహనరాజు కాశ్మీర్ దివాన్‌గా వుండేవాడు. ఆయన రిటైరయినాక బెంగుళూరులో స్థిరపడిపోయాడు. ఆయన మరణించాక భార్య అనూరాధ యీ లారీ కంపెనీని కొంది. ఆమె మోహనరాజు నాల్గో భార్య. ఆమె ధనవంతురాలని విన్నాను," అన్నాడు గిరి.

"మోహనరాజు నన్ను కలుసుకున్నాడు. కాశ్మీర్‌లో నా కతను ఘనస్వాగతం యిచ్చాడు," అన్నాడు వాలి.

"ఆ ఫియట్ కారు మద్రాసులో వున్న చెట్టియార్ అండ్ కంపెనీది. ఆ కారును వాళ్ళు శ్యామ్‌సుందర్ అనే అతడికి అద్దె కిచ్చారు. పట్నం చూడ్డానికి వచ్చినవాళ్లకు ఆ కంపెనీ కార్లు అద్దె కిస్తూ వుంటుంది."

"శ్యాంసుందర్ అడ్రెస్ తెల్సుకున్నావా ?"

"తెల్సుకోడంతో వూరుకోలేదు, సార్. అతడి యింటికి వెళ్లాను ఆ అడ్రెస్ వున్న యింట్లో అడ్వకేటు రామయ్యర్ నివసిస్తున్నాడు."

నోట్లోని చుట్టను వాలి చేత్తో పట్టుకున్నాడు. గిరివైపు సూటిగా చూశాడు.

"ఫియట్ కారును వాళ్ళు చెట్టియార్ కంపెనీకి వాపసు చేశారా ?"

"వాపసు చేశారు. ఆ కారును ఎవరో అమెరికన్ అద్దెకు పట్టుకెళ్ళాడు," అన్నాడు గిరి.

"గిరీ! శ్యామ్‌సుందర్ కల్పితమైన పేరై వుండాలి. ఆ పేరు చెప్పి, ఏదో అడ్రెస్ యిచ్చి వాళ్ల కారును అద్దెకు తీసుకొన్నారు. పనవగానే కారును వాపసు చేసేశారు. మళ్ళీ కారును అద్దెకు తీసుకోడానికి వాళ్ళు ఆ కంపెనీకి రావొచ్చు. వాళ్ళు వస్తే వెంటనే మనకు ఫోన్ చెయ్యమని చెప్పావా ?" అన్నాడు వాలి.

"చెట్టియార్ అండ్ కంపెనీ మేనేజరు సలీమ్ హుషారైన యువకుడు. శ్యామ్‌సుందర్ పేరుచెప్పినతను మళ్ళా వస్తే నాకు వెంటనే ఫోన్ చేస్తానన్నాడు."

"గిరీ, గుడ్‌వర్క్," అన్నాడు వాలి.

* * *




ఏర్‌కండిషన్డ్ హాల్లో ఇరవైమంది పోలీసు ఉన్నతోద్యోగులు కూర్చొని వున్నారు. వాలి కొకవైపున ఐ.జి. ఆఫ్ పోలీస్ ఆకిలన్ ఉన్నాడు. మరో పక్క గిరి కూర్చున్నాడు.

గదిలో చల్లగా వుంది. ఏర్‌కండిషనింగ్ మిషన్ లీలగా ధ్వనిస్తోంది. డిటెక్టివ్ వాలి చుట్టపొగ వదుల్తూ టేబుల్‌చుట్టూ కుర్చీల్లో కూర్చున్నవాళ్లవైపు మందహాసంతో చూశాడు.

"మైడియర్ ఫ్రెండ్స్! ఈ రాష్ట్రంలో ప్రొహిబిషన్ విజయవంతం కావాలని మన ముఖ్యమంత్రి కోర్కె. ప్రొహిబిషన్ను అమలుపర్చడానికి కొన్ని వందలమంది పోలీసు ఉద్యోగులు నిర్విరామంగా కృషిచేస్తున్నారు. ఈ కృషి చాలదని అనేక నిదర్శనాలవలన మనకు వ్యక్తమవుతోంది," అని ఆగాడు వాలి.

ఆజానబాహుడైన వాలివైపు అందరూ చూస్తున్నారు.

"మద్రాస్‌పట్టణంలో ఎక్కడపడ్తే అక్కడ మత్తుద్రవాలు దొరుకుతున్నాయి. ప్రొహిబిషన్ లేనప్పుడు అవి వైన్‌షాపుల్లో దొరికేవి. ఇప్పుడు అనేకచోట్ల విస్కీ, బ్రాందీ రమ్ వగైరా లభిస్తున్నాయి. వాటి అమ్మకంలో డబ్బు వుండడంవలన నిరుద్యోగులు ఆ రంగంలో ప్రవేశించి రహస్యంగా వ్యవహరిస్తున్నారు. ప్రొహిబిషన్ జయకరంకావాలంటే మత్తుద్రవాలు ఈ రాష్ట్రంలోకి రాకుండా మనం చూడాలి. ప్రస్తుతం ఆంధ్ర, కర్ణాటక, కేరళ రాష్ట్రాలనుంచి

యిక్కడకు మత్తుద్రవాలను స్మగుల్ చేయొచ్చు. పాండిచెరీ నుంచి కూడా యిక్కడకు సరఫరా చేయొచ్చు. ఆ ప్రాంతాలనుండి ఈ రాష్ట్రంలోకి వచ్చే బస్సులను, లారీలను, కార్లను ప్రొహిబిషన్ డిపార్టుమెంట్ పోలీసులు చెక్ చేస్తున్నారు. అలా చెక్‌చేసే పోలీస్ బలగాలను మనం యింకా బల పర్చాలి! సబిన్‌స్పెక్టర్ శివరామ్ హత్య గురించి మీకు తెలుసు. వాళ్ల తోవకు అడ్డొచ్చినవాళ్లను బూట్‌లెగ్గర్స్ నిర్మూలించడానికి ప్రయత్నిస్తారు. జీప్‌లో వెళ్లిన నల్గురు పోలీసు వుద్యోగులు ఈ బూట్‌లెగ్గర్స్‌ను ఆపలేదు. ట్రంక్ రోడ్లమీద తిరిగే పోలీసు వుద్యోగులకు మనం సరైన ఆయుధాలను సమకూర్చాలి ప్రతి జీప్‌వెనకా ఒక వాన్ వుండాలి. వాన్‌లో యాభైమంది సాయుధపోలీసు ఉండాలి. పాకెట్ మిషన్‌గన్స్‌ను వాళ్లకు మనం సర్దుబాటు చెయ్యాలి!"

"వాలిగారూ, ఏదో యుద్ధం వచ్చినట్లు మీరు చెప్తున్నారు," అన్నాడు ఐ. జి. అకిలన్.

"అకిలన్ ఖాయ్, మనం పోలీసుల బలాన్ని పెంచకపోతే మరికొందరు శివరామ్‌లు అన్యాయంగా బలైపోతారు," అన్నాడు వాలి.

"అది నిజమే," అన్నాడు కమిషనర్ ధర్మరాజు.

"అంత బలంగా మన పోలీసు దళాలు వుంటే బూట్‌లెగ్గర్స్ వాళ్లను ఓడించి పారిపోలేరు," అన్నాడు వాలి.

"యూ ఆర్ రైట్" అన్నాడు అకిలన్.

"రాష్ట్రవ్యాప్తంగా స్మగుల్డ్ మత్తుద్రవాలను అమ్ముతున్నారు. చిన్న పాన్ షాపుల్లో మద్యం దొరుకుతోంది. అటువంటి షాపులను మనం సీల్‌చేసి మూసివేయాలి. దానితో షాపువాళ్ళు భయభక్తులతో ప్రవర్తిస్తారు."

"గుడ్ ఐడియా," అన్నాడు కమిషనర్.

"ఇల్లిసిట్ డిస్టిలేషన్ అనేకచోట్ల సాగుతోంది. అటువంటి ప్రదేశాలను రెయిడ్‌చేసి ఫెర్‌మెంటెడ్ వాష్‌ని ధ్వంసం చెయ్యాలి."

"అది చేస్తున్నాం," అన్నాడు ఐ. జి.

"అదింకా ఎక్కువగా చెయ్యాలి. వారాని కొకసారి వెళ్తే లాభించదు," అన్నాడు వాలి.

కాస్సేపు హాల్లో నిశ్శబ్దంగా వుంది. యూనిఫాంలలో వున్న నౌకర్లు కూల్ డ్రింక్స్‌ను అందరకూ అందించారు. కూల్‌డ్రింక్ తాగి వాలి మళ్ళీ చెప్పుకు పోయాడు.

"లిక్కర్ స్మగ్‌లింగ్ ఎలా సాగుతుంది ? రైళ్లలో పట్రావచ్చు, లారీలు, బస్సుల్లో తేవచ్చు. విమానాల్లో పట్రావచ్చు ఇతర రాష్ట్రాలనుండి యిక్కడి కొచ్చే ప్రతి లారీనీ, బస్సునూ, కారునూ మనం సోదా చెయ్యాలి. విమానం లోంచి దిగిన పాసింజర్ల పెట్టెలను, ఏర్ బాగ్స్‌ను తెరిచి చూడాలి," అన్నాడు వాలి.

"వాలిగారూ, మీరు చెప్పినదంతా చెయ్యాలంటే ప్రస్తుతం రాష్ట్రంలో వున్న పోలీసులు చాలరు. నాలుగు రెట్లు వాళ్ల నంబరు పెరగాలి,'' అన్నాడు ఐ. జి.

"అవసరాన్నిబట్టి మనం ఎక్కువమందిని ఉపయోగించాలి. సి. ఆర్. పి వాళ్ళను మనం ఉపయోగించవచ్చు, కేంద్ర ప్రభుత్వం అనుమతితో," అన్నాడు వాలి.

"యస్సార్, అలా చేయొచ్చు," అన్నాడు కమిషనర్.

"ప్రస్తుతం ఏ యుద్ధమూ లేదు. మన సైనికులను కూడా ఇందుకోసం నియమించవచ్చు."

రెండుగంటల తర్వాత హోటల్ అశోక్‌లో జరిగిన సమావేశం ముగిసింది. వాలి హుషారుగా తన గదికి చేరుకొని పడకకుర్చీలో వెనక్కి వాలాడు.

"వాలిగారూ, ఇదంతా చేసినా ప్రొహిబిషన్ విజయవంతం అవుతుందని మీరు నమ్ముతున్నారా ?" అడిగాడు గిరి.

వాలి గంభీరంగా నవ్వాడు.

"గిరీ, చెరువుచుట్టూ సైనికులను నిలబెడితే ప్రజలు అటువైపు వెళ్లరు. కాని చెరువులోని నీళ్ళను సైనికులు తాగే అవకాశం వుంది !" అన్నాడు వాలి నవ్వుతూ.

* * *

## 8

ఏర్‌కండిషండ్ హాల్లో నాలుగు ఫ్లోరసెంట్ లైట్లు ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి.

బుచ్చయ్య ఎదురుగా సోఫాల్లో నలుగురు మనుషులు కూర్చొని వున్నారు. అందరూ ఖరీదైన దుస్తుల్లో వున్నారు.

బుచ్చయ్య చప్పట్లు కొట్టాడు. ఇరవై ఏళ్ళ యువతి వయ్యారంగా నడుస్తూ అతడి ముందుకొచ్చింది. అత డామెకేసి నవ్వుతూ చూశాడు.

"మిస్ లీనా, డ్రింక్స్ ఆర్ వెల్‌కమ్!'' అన్నాడతను.

లీనా ఒక స్కాచ్ విస్కీ బాటిల్ని తెరిచింది. ఐదుగ్లాసుల్లో విస్కీ పోసి, కూల్ సోడా కలిపింది. ఆమె పక్కగదిలోకి వెళ్ళిపోయింది.

"కామ్రేడ్స్, లెటస్ డ్రింక్ టు సక్సెస్!" అన్నాడు బుచ్చయ్య.

"టు సక్సెస్!" అన్నారందరూ, గ్లాసులను ఎత్తి.

గ్లాసులోని విస్కీని సగంపైన తాగేసి బుచ్చయ్య తన సహచరులవైపు చూశాడు.

''కామ్రేడ్స్, ఈ వారంలో మనం మత్తుద్రవాలను ఈ రాష్ట్రంలోకి స్మగుల్ చెయ్యలేకపోయాం. ప్రొహిబిషన్ డిపార్టుమెంటు పోలీసులు ట్రంక్ రోడ్లను కాస్తున్నారు. నలుగురైదుగురైతే మనం వాళ్ళతో పోట్లాడవచ్చు. వాళ్ల సంఖ్య అమితంగా పెరిగింది. జీప్ వెనకనే వాన్ కూడా వుంటోంది. వాళ్లను ఎదిరించడం మనకు సాధ్యంకాదు. మనం కొత్తపద్ధతుల్లో స్మగుల్ చేయాలి," అన్నాడతను.

"డిటెక్టివ్ వాలి మూలంగా యిదంతా సాగుతోందని విన్నాను. ఆయన్ని సఫా చేస్తే మన కి అడ్డంకులు వుండవేమో!" అన్నాడు జాన్.

బుచ్చయ్య కోపంగా జాన్‌వంక చూశాడు. జాన్ లోలోపల భయపడ్డాడు. బుచ్చయ్య దేవాంతకుడు. ఏ క్షణంలో ఏంచేస్తాడో ఎవ్వరూ ఊహించలేరు.

"మిస్టర్ జాన్! యీ పరిస్థితుల్లో ఏం చెయ్యాలో మీకు నేను చెప్తాను. నేను చెప్పేది వినడానికి మిమ్మల్ని పిల్చాను. నాకు సలహా లివ్వడానికి కాదు!" అరిచాడు బుచ్చయ్య.

"అయాం సారీ, బాస్," అన్నాడు జాన్ గాభరాగా.

"వాలి సాధారణ వ్యక్తికాదు. అతడితో మనం ప్రత్యక్షంగా పోట్లాడటం మంచిదికాదు. అతడు పగబట్టి మనమీదకు దాడిచేస్తే మన సంస్థ నామ రూపాలు లేకుండా పోతుంది. ఏదేనా పెద్ద అడ్డంకు మనకు ఎదురైతే దానికి దూరంగా పోయి గమ్యం చేరుకోడం అన్నివిధాలా మంచిది."

"అదే మంచిపద్ధతి, బాస్," అన్నాడు మీనన్.

"పులికి దూరంగా వుండడం మంచిది," అన్నాడు మస్తాన్.

"గాలి కెదురువెళ్ళడంకంటే దాని మార్గంలో పోవడం సులువైన పని," అన్నాడు కామత్.

"షటప్ అండ్ హియర్ మి!" గద్దించాడు బుచ్చయ్య.




గ్లాసుల్లో జాన్ విస్కీ పోశాడు. మస్తాన్ సోడా కలిపాడు. నిషాతో నిండిన కళ్లతో బుచ్చయ్య వాళ్లవంక చూశాడు. అతని కళ్ళు ఎర్రగా వున్నాయి. మశూచికం మచ్చలు, పెద్ద కనుబొమ్మలు అతడి ముఖానికి వికృత రూపాన్ని చేకూర్చాయి.

"ఈ పట్నంలో అనేకచోట్ల రహస్యంగా బ్రాందీ, విస్కీ, రమ్ వగైరా అమ్ముతున్నారు. ఒకోసారి మఫ్టీ పోలీసులు కస్టమర్స్‌లా నటిస్తూ బుడ్డీలు కావాలని చివరికి మనవాళ్లను పట్టుకుంటున్నారు. ఇన్‌స్పెక్టర్ పీటర్ యిలాగే చేశాడు ఈ అవకాశం పోలీసులకు లేకుండా వుండేందుకు మన కస్టమర్స్‌కు ఒక రాగి వుంగరం యిస్తాం. ఇటుపైన ఆ వుంగరం వేలుకు వున్నవాళ్లకే డ్రింక్స్ సప్లయి చేయబడ్తాయి."

బుచ్చయ్య ఆగాడు. ఒక వుంగరాన్ని తీసి వాళ్ళకిచ్చాడు వుంగరంమీద పులిముఖం చెక్కబడింది.

"అనేక సైజుల్లో యీ వుంగరాలు తయారు చేయించాను. ప్రతి కస్టమరూ తనకు సరిపడే వుంగరాన్ని తీసుకోవచ్చు," అన్నాడు బుచ్చయ్య.

"ఈ పద్ధతి బాగుంది," అన్నాడు జాన్.

"వుంగరం లేకుండా ఎవరేనా కొత్తవాళ్ళు బుడ్డీ అడిగితే అటువంటి వ్యాపారం చేయడంలేదని మనవాళ్ళు జవాబిస్తారు."

"ఫైన్!" అన్నాడు మస్తాన్.

"ఇప్పుడు స్మగ్లింగ్ గురించి చెప్తాను. ఇటుపైన లారీల్లో మన సరుకు పట్టాలేం. గోల్డెన్ లారీ సర్వీస్‌లను చాలా జాగ్రత్తగా చెక్ చేస్తున్నారు. రైళ్ళలోకూడా చెక్కింగ్ ఎక్కువగా వుంది. ఇవాళ కారులో వెళ్తుంటే రోడ్డు వారగా గుడారాలు కట్టుకొని గుంపులుగా వున్న దేశదిమ్మర్లు నాకు కనిపించారు. కారు ఆపి వాళ్ళనే చూస్తూ కూర్చున్నాను. కొన్నిరోజు లిక్కడవుండి, పాత్రలూ పక్కలూ మూటగట్టుకొని వాళ్ళు మరో చోటకు పోతూ వుంటారు. వాళ్ళు పక్షుల్లా, జంతువుల్లా స్వేచ్ఛగా జీవిస్తూవుంటారు. ఇలాటి గుంపులు ఎన్నో వున్నాయి. వాళ్ళు యిటుపైన మన బుడ్డీలను స్మగ్లింగ్ చేస్తారు. చెక్‌పోస్టు నుంచి ముందువాళ్ళు వెళ్ళరు. రోడ్డమ్మట వాళ్ళు పోతుంటే ఎవ్వరూ వాళ్ళను అనుమానించరు. వాళ్లు సహజంగా మోసుకెళ్ళే మూటల్లో మనం ఎన్నో బాటిల్సు పెట్టొచ్చు?"

"బ్రిలియంట్ ఐడియా!" అన్నాడు కామత్.

"మరో విధానం. పుస్తకాలను గోనిపార్సిల్సులో మూడు నాలుగు కంపెనీల పేర మనం యిక్కడకు తెప్పిస్తాం. పైనా, క్రిందా, ప్రక్కల్నా పుస్తకాలు పెట్టి లోపల బుడ్డీలు అమర్చి గోనితో పాక్‌చేసి కుట్టేస్తారు. గోల్డెన్ లారీ సర్వీసు ద్వారా కాకుండా తదితర కంపెనీల లారీల్లో ఆ గోని పార్సిల్సు యిక్కడికి లక్షణంగా చేర్తాయి. మార్కెట్‌లో వేస్టుపేపర్ విలువకు దొరికే పాతపుస్తకాలను మనం యీ పనికి వుపయోగించవచ్చు," అన్నాడు బుచ్చయ్య.

"బాస్! యూ ఆరే జీనియస్ " అన్నాడు మస్తాన్.

"ఇలా కొత్త కొత్త పద్ధతుల్లో మనం మత్తు ద్రవాలను స్మగుల్ చేసి యిక్కడివాళ్లకు ఏ లోటూ లేకుండా చూడాలి. కామ్రేడ్స్, మనం చేసేది ఒక విధంగా వ్యాపారం. మరో వైపునుంచి చూస్తే ప్రజాసేవ! ప్రజలు ఎన్నుకున్న ప్రభుత్వాలు ప్రజలకు స్వేచ్ఛలేకుండా చేస్తున్నాయి. తినడం, తాగడం మనిషి జన్మహక్కులు. ఈ హక్కుల్ని ఏ ప్రభుత్వమూ రద్దుచేయలేదు. రద్దుచేయ డానికి ప్రయత్నిస్తే మనలాటివాళ్ళు రంగంలో ప్రవేశిస్తారు," అన్నాడు బుచ్చయ్య.

"వెల్ సెడ్ బాస్" అన్నాడు జాన్.

"తాగుడు మైకంలో చెడుగా ప్రవర్తించేవాళ్ళను శిక్షిస్తే నేను అభ్యంతరం చెప్పను. కాని యింట్లో కూర్చొని తాగేవాళ్ళకూడా అడ్డంకులు సృష్టించడం న్యాయసమ్మతంకాదు కామ్రేడ్స్, ప్రభుత్వం ప్రజలకు లేకుండా చేసిన

స్వేచ్ఛను పునరుద్ధరించడానికి మనం పాటుపడ్తున్నామన్న విషయం గుర్తుంచు కోండి. ఇలా కొంతకాలం సాగితే ప్రభుత్వం కళ్ళు తెరుస్తుంది. మనుషుల స్వేచ్ఛను అడ్డగించే పిచ్చి చట్టాలను ప్రవేశపెట్టారు!" అన్నాడు బుచ్చయ్య వుద్రేకంతో.

* * *

## 9

శరత్ బస్సులోంచి దిగాడు. పేవ్‌మెంటమ్మట మెల్లిగా అడుగు లేస్తున్నాడు. నలువైపులా లైట్లు వెల్గుతున్నాయి.

ఒకా పాన్ షాపు ముందు శరత్ ఆగాడు. చెయ్యిని పైకిఎత్తాడు. పులి ముఖం వున్న రాగి వుంగరం వంక షాపతను చూశాడు.

"మెక్‌డోవల్, అరబాటిల్," అన్నాడు శరత్.

అట్టపెట్టెను షాపతను శరత్ కిచ్చాడు. అతడు అరవై రూపాయలు చెల్లిం చాడు. అట్టపెట్టెను ప్లాస్టిక్ బాగ్‌లో పెట్టుకొని శరత్ గబగబా నడవసాగాడు.

వెనకనే వస్తున్న మనిషిని శరత్ చూడలేదు. అతడు రోడ్డు దాటబోతుండగా వెనకనుంచి ఎవరో అతని చెయ్యిని పట్టుకున్నారు.

శరత్ వెనక్కి తిరిగి చూశాడు. వులిక్కిపడ్డాడు. పొడగాటి మనిషి! బుర్ర మీసాలు! నోట్లో చుట్ట వెల్గుతోంది. అతడు ఫుల్ సూటుతో వున్నాడు.

"ఏం కావాలి సార్?" అన్నాడు శరత్ గాభరాగా.

"నీ బాగ్‌లోని అట్టపెట్టి!" అన్నాడు వాలి.

"నా బాగ్‌లో ఏ అట్టపెట్టీ లేదు," అన్నాడు శరత్.

"సరిగ్గా చూస్తే కనిపిస్తుంది!"

శరత్ చెయ్యి విడిలించుకోడానికి ప్రయత్నించాడు. సాధ్యం కాదని గ్రహిం చాడు. తనని పట్టుకున్న చెయ్యి స్టీల్ చెయ్యిలా వుంది!

బాగ్‌లోని అట్టపెట్టెను తీసి అతడు వాలి కిచ్చాడు. పెట్టెను తెరిచి లోప లున్న బ్రాందీ బాటిల్‌ను చూశాడు వాలి. అతడి చూపు శరత్‌వైపు మళ్ళింది.

శరత్ యువకుడు. అతడి వయస్సు 22 వుంటుంది.

"ఇది నీకేనా?" ప్రశ్నించాడు వాలి.

"కాదు సార్."

"ఎవరికి?"

"మా నాన్నగారికి."

"నీతో వచ్చి యింట్లో అడుగుతాను. నిజం చెప్పడం మంచిది," అన్నాడు వాలి.

"నాతో వస్తే రండి. నేను చెప్పింది నిజమే."

"ఈ రాష్ట్రంలో ప్రొహిబిషన్ అమల్లోవుంది. ఈ బాటిల్ నీ దగ్గరుంటే నీకు శిక్ష పడుతుంది."

శరత్ సూటిగా వాలివంక చూశాడు.

"నాన్నగారి వయస్సు యాభై దాటింది. చాలాకాలంనుంచి తాగడం ఆయనకు అలవాటు. ఆయన పెర్మిట్ యింతవరకూ రిన్యూ కాలేదు. ఎసెసెల్సీ పుస్తకంలో రాసిన వయస్సు పత్రం కావాలని అధికారులు అంటున్నారు. నాన్నగారు రిటైరయ్యే స్థితిలో వున్నారు. ఆయన ఎసెసెల్సీ బుక్కు ఎంత వెతికినా కనపడలేదు. ఆ స్థితిలో మరేం గత్యంతరంలేక నాన్నగారు ఎక్కువ ధరిచ్చి యిలా కొనుక్కొని తాగవలసి వస్తోంది. తండ్రి కోరికను తీర్చడం కొడుకు ధర్మం. ఆ పని చేయడంలో ప్రభుత్వం నన్ను శిక్షిస్తే శిక్ష విధించమంటాను," అన్నాడు శరత్.

క్షణకాలం వాలి మాట్లాడలేదు. పొగ వదుల్తూ నవ్వుతూ ఎదురుగా వున్న యువకుడివైపు చూశాడు. అతడి భుజంమీద తట్టాడు. అట్టపెట్టి అతడి కిచ్చేశాడు.

"అబ్బాయ్, వెళ్ళిరా!" అన్నాడు వాలి.

శరత్ రోడ్డుదాటి వెళ్ళిపోయాడు. వాలి వెనక్కితిరిగి వేగంగా నడిచాడు. రోడ్డువారగా వున్న పోలీసు జీప్‌లో ఎక్కాడు. జీప్ కదిలింది.

పాన్ షాపు ముందు జీప్ ఆగింది. వాలి షాపు ముందుకెళ్ళాడు.

"మెక్‌డోవల్, అరబాటిల్!" అన్నాడు వాలి.

షాపు యజమాని అతనివంక ఆశ్చర్యంగా చూశాడు.

"ఇది పాన్ షాపు, సార్, సారాకొట్టు కాదు," అన్నాడు.

"ఇప్పుడే ఒకతనికి అమ్మావు!"

"అది హెయిరాయిల్ సార్," అన్నాడతను.

వాలి సౌంజ్ఞ చేశాడు. ఇన్‌స్పెక్టర్ రంగన్, ముగ్గురు కానిస్టేబుల్సు షాపు ముందు కొచ్చారు.

షాపు సోదా చేశారు. కూల్‌బాక్స్ అని పేరు చెక్కివున్న పెట్టెలో ఐస్ లేదు. పది బ్రాందీ బుడ్డీలు వున్నాయి.

పోలీసులు షాపును మూసి తాళం వేశారు. షాపు యజమాన్ని జీప్ వెనక సీటుమీద కూర్చోబెట్టారు జీప్ కదిలింది.

* * *

పోలీసు లాకప్‌లో వున్న అతని ఎదురుగా వాలి నిలబడ్డాడు.

"నీ పేరు?" ప్రశ్నించాడు వాలి.

"పద్మరాజు సార్."

"ఈ బుడ్డీలమ్మితే నీ కెంత వస్తుంది?"

"బుడ్డికి అయిదు రూపాయలు వస్తుంది సార్."

"రోజూ ఎన్ని అమ్ముతున్నావు?"

"పది బుడ్డీలు కదుల్తాయి సార్."

"నువ్వీ పని చట్టానికి వ్యతిరేకంగా చేస్తున్నావని నీకు తెలుసా?"

"తెలుసు సార్. నాది పెద్ద సంసారం సార్. ఇందులో ఎక్కువ డబ్బొస్తుంది. అందుకని తెగించి దిగాను."

"నీకు ఆ బుడ్డీలు ఎవరిస్తారు?"

"శివయ్య యిస్తాడండీ."

"శివయ్య ఎక్కడుంటాడు?"

"అది నాకు తెలియదు సార్. అతడు షాపుకొచ్చి సరకు యిచ్చిపోతాడు."

"నువ్వు వెంటనే డబ్బు చెల్లించాలా?"

"బుడ్డికి అయిదు రూపాయలు తగ్గించుకొని డబ్బివ్వాలి సార్."

"అరబాటిల్ ఎంత కమ్ముతావు?"

"అరవై రూపాయలకు."

"ఒక్కోసారి యింకా ఎక్కువ వస్తుందేమో!"

"ఎప్పుడేనా వస్తుంది సార్. ఈ ధరే ఎక్కువని అంటున్నారు," అన్నాడతను.

వాలి ఆలోచిస్తూ గదిలో పచార్లు చేశాడు.

"నన్ను ఏంచేస్తారు, సార్?"

"పోలీసులు నీ మీద కేసు పెడ్తారు. నువ్వు జైలుకి వెళ్తావు. నీ కుటుంబానికి దూరమవుతావు!" అన్నాడు వాలి.

"సార్, మీ కాళ్ళట్టుకుంటాను. నన్ను వదిలిపెట్టండి," అన్నాడతను.

వాలి మౌనంగా వుండిపోయాడు.

"ఇటుపైన యీ మందు వ్యాపారం చెయ్యను, సార్."

వాలి అతడివైపు సూటిగా చూశాడు.

"మాతో సహకరిస్తే నిన్ను వదిలేస్తాం!"

"ఏం చెయ్యాలో చెప్పండి సార్."

"శివయ్య మాకు కావాలి. అతడు మునుపటిలా నీ షాపు కొస్తాడుగా?"

"వస్తాడు, సార్."

"నిన్ను వదిలేస్తా. ఎప్పటిలా నీ వ్యాపారం చేసుకో! నీ షాపు ప్రాంతంలో మా మనిషి వుంటాడు. శివయ్య వచ్చినప్పుడు మా మనిషికి సౌంజ్ఞ చేయి. శివయ్యను మా మనిషి పట్టుకుంటాడు," అన్నాడు వాలి.

"వాడు రౌడీ సార్. నే నతనిని పట్టిస్తే అటుపైన నా మీద పగ సాధిస్తాడు."

"పగ సాధించడానికి అతడు బయట వుండడు, లాకప్‌లో వుంటాడు. నీకు ప్రమాదం రాకుండా పోలీసులు చూస్తారు."

"అలాగే చేస్తాను సార్," అన్నాడు పద్మరాజు.

గదిలోంచి వాలి బయటకొచ్చాడు. గబగబా ఇన్‌స్పెక్టర్ రంగన్ గదిలోకి నడిచాడు.

"రంగన్ భాయ్, అతడిని వెంటనే వదిలేయండి!" అన్నాడు వాలి.

"సరకు అతడి షాపులో దొరికింది సార్. అతడిమీద కేసు పెట్టాలి," అన్నాడు రంగన్.

"మనకు కావలసింది యీ చిన్న చేపలు కాదు. ఇతడి వెనకనున్న పెద్ద చేపలు!" అన్నాడు వాలి.

"వెంటనే వదిలేస్తాను, సార్," అన్నాడు ఇన్‌స్పెక్టర్ రంగన్.

* * *

## 10

ఆంధ్రా సరిహద్దు దాటి లారీ వేగంగా ట్రంక్ రోడ్డమ్మట దూసుకుపోతోంది. సుమిత్రా రోడ్‌వేస్ అని లారీమీద పెద్ద అక్షరాల్లో రాసివుంది.

లారీ డ్రయివర్ స్పీడు తగ్గించాడు. పోలీస్ జీప్, వాన్ అతడికి కనిపించాయి. లారీ ముందుసీటుమీద యిద్దరు మాత్రం వున్నారు డ్రయివర్ లారీని ఆపి కిందకు దిగాడు.

సబిన్‌స్పెక్టర్ సెల్వరాజు లారీ పక్కకు వచ్చాడు. అరడజనుమంది సాయుధ పోలీసులు అతని పక్కనే వున్నారు.

"చెకిట్!" అన్నాడు సబిన్‌స్పెక్టర్.

కానిస్టేబుల్సు లారీలోకి ఎక్కారు. ఎన్నో గోనె పాకెట్లను తిప్పి చూశారు.




పుస్తకాల పార్సిల్సు! మద్రాసులో వున్న బుక్ కంపెనీ అడ్రెస్ ఎర్రసిరాతో గోనిమీద పెద్ద అక్షరాల్లో రాసివుంది.

కానిస్టేబుల్సు కిందకు దిగారు.

"లారీనిండా పుస్తకాల పాకెట్లు వున్నాయి సార్." అన్నాడొక కానిస్టేబులు.

"తెరిచి చూశారా!" అడిగాడు సబిన్‌స్పెక్టర్.

"ఒక పార్సిల్‌కి చిల్లు పడింది సార్. లోపలున్న పుస్తకం కనిపిస్తోంది," అన్నాడు కానిస్టేబుల్.

వెళ్ళొచ్చని సబిన్‌స్పెక్టర్ సెల్వరాజు డ్రయివర్‌కి చెప్పాడు. లారీ రోడ్డమ్మట వేగంగా వెళ్ళిపోయింది.

* * *

చీకటి పడింది. రోడ్డు లైట్లు వెల్గుతున్నాయి. పద్మరాజు షాపు ప్రాంతంలో గిరి పడిగాపులు కాస్తున్నాడు.

తను ఎదురుచూస్తున్న శివయ్య రాలేదు!

పోలీసులు రెయిడ్ చేసిన యీ షాపుకు శివయ్య రాడేమో అనిపించిందతనికి.

అతడు పేవ్‌మెంట్ మీద నిలబడి సిగరెట్ వెలిగించాడు. పొగ వదుల్తూ నలువైపులా చూశాడు. మల్లిపూల దండల్ని ఒక యువతి చకచకా అమ్మేస్తోంది. ఇళ్ళకుపోయే గుమస్తాలు ఒక మూర కొనుక్కొని వెళ్ళిపోతున్నారు.

షాపు ముందు స్కూటర్ ఆగింది. పొట్టిగా, లావుగా వున్నతను షాపు

ముందుకెళ్ళాడు. అతడొక బాగ్‌ను షాపతనికిచ్చాడు. షాపతను యిచ్చిన కవర్ను జేబులో పెట్టుకున్నాడు.

పద్మరాజు సౌంజ్ఞలను గిరి గుర్తించాడు. వేగంగా తన కారు దగ్గరకు కదిలాడు.

రోడ్డమ్మట శివయ్య స్కూటర్ దూసుకుపోయింది. దాని వెనకనే గిరి కారును పోనిచ్చాడు. శివయ్య ఎక్కడికెళ్తాడో తను తెల్సుకోవాలి!

మరో నాలుగు షాపులకు శివయ్య బాగ్‌లను యిచ్చి, కవర్లను తీసుకున్నాడు.

శివయ్య దగ్గర యింక బాగ్స్ లేవని గిరి కనిపెట్టాడు. అతడి జేబులో వున్న కవర్లను శివయ్య ఎవరికిస్తాడు?

శివయ్య స్కూటర్ వెళ్తోంది. కొంచెం దూరంలో గిరి దాన్ని వెంటాడు తున్నాడు.

ఒక రెస్టారెంటు ముందు శివయ్య స్కూటర్ని ఆపి దిగాడు. ఓసారి నలు వైపులా చూసి అతడు లోపలకు వెళ్ళాడు.

రెస్టారెంట్ ముందు కారాపి గిరి దిగాడు. ఏదో కారొచ్చి వెనకనే ఆగింది. అందులోంచి ఒక యువతి దిగింది. డ్రయివర్ కారు పక్కనే నిలబడ్డాడు.

ఆమెకేసి ఓరగాచూస్తూ గిరి సిగరెట్ వెలిగించాడు. ఆమె సన్నగా, పొడుగ్గా వుంది. ఎర్రటి చీర, అదేరంగు జాకెట్. చీరను బొడ్డుకిందకు కట్టుకుంది. ఆమె శరీరం బంగారంలా మెరుస్తోంది. ఆమె విశాలమైన కళ్ళలో జ్యోతులు ప్రకాశిస్తున్నాయి.

ఎర్రటి హేండ్‌బాగ్‌తో ఆమె రెస్టారెంటులోకి దూకింది. బయటినుంచి గిరి లోపలకు చూశాడు. శివయ్య ఎక్కడా కనబడలేదు!

తను వెంటాడుతున్నట్లు గ్రహించి శివయ్య పలాయనం చిత్తగించాడా? స్కూటర్ని వదిలి అతడు ఎందుకు పోతాడు?

గిరి రెస్టారెంటులోకి వెళ్లాడు. ఒక కుర్చీలో కూర్చున్నాడు. బేరర్ రాగానే వేడి టీ తెమ్మన్నాడు

అతడి కెదురుగా కాబిన్స్ వున్నాయి. శివయ్య ఆ కాబిన్‌లోకి వెళ్ళుండాలి! వేడి టీ వచ్చింది. టీ తాగి అతడు సిగరెట్ పీలుస్తూ కూర్చున్నాడు.

కాబిన్ స్ప్రింగ్‌డోర్ తెరుచుకొని శివయ్య బయటకు వచ్చాడు. అతడు తొందరగా రోడ్డువైపు నడిచాడు. బిల్లు చెల్లించి గిరి తన కారువైపు అడుగు లేశాడు.



కాబిన్‌లోంచి బయటకొచ్చిన యువతి గిరివంక విచిత్రంగా చూసింది. రెస్టారెంట్ మూలగా వున్న ఫోన్‌వైపు ఆమె కదిలింది

శివయ్య స్కూటర్‌మీద వెళ్తున్నాడు. గిరి కారులో అతడిని వెంబడిస్తున్నాడు. జనసంచారం ఎక్కువగా లేని వీధమ్మట స్కూటర్ వెళ్తోంది.

గిరి కారును పోనిస్తున్నాడు. వెనకనే ఏదో కారొస్తోందని అతడు గుర్తించాడు. తనని మరెవరో వెంటాడ్డం అసంభవం. ఆ కారు యిప్పుడే కనిపించింది.

గిరి తన చూపును ముందు వెళ్తొన్న శివయ్యమీద కేంద్రీకరించి కారును పోనిస్తున్నాడు.

అమాంతం చెవులు పగిలేంత ధ్వని బాంబు పేలినట్లు వినిపించింది. గిరి స్టీరింగ్ వీల్‌ని బలంగా పట్టుకున్నాడు. ఏదో చప్పుడు అతడికి వినిపిస్తోంది. గిరి తన కారును ఆపాడు. పక్కనుంచి వెనుక కారు శరవేగంగా దూసుకుపోయింది. కారు నంబరు అతడికి కనిపించలేదు.

గిరి కిందకు దిగాడు. దూసుకుపోతున్న కారు వెనుక లైట్లు అతడికి కనిపిస్తున్నాయి. ఆ కారు వైపు షూట్ చేయడం వ్యర్థమని అతడు గ్రహించాడు.

తనకారు వెనక టైర్ వైపు చూశాడు. బరస్టయి వుంది! వెనక కార్లో వాళ్ళు తన కారు టైర్ని షూట్ చేశారు!

ఆలోచిస్తూ గిరి క్షణకాలం కారు పక్కనే నిలబడ్డాడు. తను వెంటాడుతున్నట్లు శివయ్య గ్రహించి రెస్టారెంటులోంచి ఎవరికో ఫోన్‌చేసి వుంటాడు. తన కారు టైర్ని షూట్‌చేసి శివయ్య పారిపోయేందుకు వాళ్ళు సహాయపడ్డారు!

టైర్‌ను గిరి తొందరగా మార్చాడు. కారును పోనిచ్చి, టెలిఫోన్ బూత్ ముందు ఆపి దిగాడు. లోపలకు వెళ్ళి, రిసీవరెత్తి వాలి నంబరు తిప్పాడు.

హోటల్ అశోక్ టెలిఫోన్ ఆపరేటర్ కంఠం వినబడింది.

"మిస్ రెమీ, వాలిగారి గదికి కనెక్షన్ ఇయ్యి," అన్నాడతను.

వెంటనే కనెక్షన్ యివ్వబడింది. వాలి కంఠం అటువైపునుంచి వినబడింది.

"గిరిని సార్. నా ప్రయత్నం ఫలించలేదు," అన్నాడు గిరి.

జరిగినదంతా వివరంగా వాలికి చెప్పాడు.

"వెనక కార్లో వాళ్ళను నేను అనుమానించలేదు. అందువల్లంగా వాళ్లు తప్పించారు," అన్నాడతను నిరుత్సాహంగా.

"గిరి, వెంటనే పద్మరాజు షాపుకు వెళ్ళు! శివయ్య పారిపోగల్గాడు. పద్మరాజుకి ప్రమాదం రావచ్చు! నువ్వు జట్ స్పీడులో అక్కడికి కెళ్ళాలి. అతడికి ప్రమాదం వాటిల్లకుండా చూడాలి," అన్నాడు వాలి.

"వెంటనే వెళ్తాను," అన్నాడతను.

రిసీవర్ పెట్టేసి అతడు బూత్‌లోంచి బయటకు వచ్చాడు. కారులో కూర్చుని తలుపు మూశాడు. తన వాచీవైపు చూశాడు. టైమ్ ఎనిమిదిన్నర అయింది. కారును వేగంగా పద్మరాజు పాన్‌షాపువైపు పోనిచ్చాడు.

లైట్ సిగ్నల్స్ మూలంగా అతడు కొన్నిచోట్ల చాలాసేపు ఆగవలసి వచ్చింది. అత డా షాపు ముందుకు చేరుకొనేసరికి తొమ్మిది కావస్తోంది.

షాపులో ఫ్లోరసెంట్ లైటు వెల్గటం చూసి గిరి సంతోషించాడు. పద్మరాజుకు ఏ ప్రమాదమూ రాలేదు!

కారులోంచి దిగి అతడు షాపు ముందుకు వెళ్ళాడు.

షాపు లోపల పద్మరాజు లేడు. మరో వ్యక్తి కూర్చుని వున్నాడు.

"పద్మరాజు ఎక్కడ?" అని అడిగాడు గిరి.

"అతడు పనిమీద వెళ్ళాడు, సార్." షాపులో వున్నతను జవాబిచ్చాడు.

"ఒంటరిగా వెళ్ళాడా?"

"అతడి ఫ్రెండ్‌తో వెళ్ళాడు."

"ఎవరా ఫ్రెండ్?"

"శివయ్యతో వెళ్ళాడు సార్. వచ్చేస్తాడు!"

అతడి జవాబు విని గిరి వులిక్కిపడ్డాడు.

శివయ్య తొందరగా షాపుకి తిరిగొచ్చాడు. పద్మరాజును తనతో తీసుకెళ్ళాడు!

బల్లినోట్లో యిరుక్కున్న పురుగులా శివయ్య చేతుల్లో పద్మరాజు యిరుక్కుపోయాడు. గిరి మెదడులో విమానాలు దూసుకుపోతున్నాయి.

అతడు వేగంగా పరుగెత్తాడు. సమీపంలో వున్న బట్టల షాపులోకి దూరాడు. రిసీవరెత్తి వాలి నంబరు తిప్పాడు.

వాలి కంఠం అటువైపునుంచి వినపడింది. కాని అతడు నోరు తెరవలేకపోయాడు.

"గిరీ, పద్మరాజు ప్రమాదంలో వున్నాడా?" అడిగాడు వాలి.

"వాలిగారూ, నేనిక్కడకి చేరుకునే లోపల శివయ్య వచ్చి పద్మరాజును తనతో తీసుకుపోయాడు," అన్నాడతను.

"గిరీ, పద్మరాజు మనతో సహకరించాడు. నాకు దూరాలోచన లేకుండాపోయింది! పద్మరాజును బలిచ్చేశాను, గిరీ!" అర్చాడు వాలి.

"వాలిగారూ, తప్పు నాది, మీదికాదు!"

"తప్పెవరిదైనా, పద్మరాజును ప్రస్తుతం మనం కాపాడలేం. శివయ్య అతడిని ఎక్కడకు తీసుకెళ్ళాడో శివుడికి తెలియాలి," అన్నాడు వాలి.

క్షణకాలం గిరి అలాగే నిలబడ్డాడు.

"గిరీ! అతడి స్కూటర్ నంబర్ చూశావా?"

స్కూటర్ నంబర్ని చెప్పాడు గిరి.

"వైర్లెస్ ద్వారా అన్ని పెట్రోలు వాన్స్‌కి వార్త పంపమంటాను. పద్మరాజుకి ఆయుర్దాయం వుంటే ఎక్కడో శివయ్య స్కూటర్ పోలీసులకు దొరుకుతుంది," అన్నాడు వాలి.

"ఏదో తొందరగా చెయ్యండి! సేవ్ హిమ్!" అని గిరి రిసీవర్ని పెట్టేశాడు.

షాపు ప్రాంతంలో పచార్లు చేస్తూ వుండిపోయాడు గిరి. నిమిషాలు దొర్లి పోతున్నాయి. టైమ్ పది దాటింది. తనింకా యిక్కడ ఎంతసేపు వుండాలో!

రోడ్డు వారగా ఆగిన యక్స్ వై జెడ్ కారు దగ్గరకు అతను పరుగెత్తాడు. వాలి అతడి వైపు సీరియస్‌గా చూశాడు.

"గిరీ ఇక్కడ కాపలా అనవసరం. పద్మరాజు శవం పోలీసులకు దొరికింది. అక్కడకు వెళ్తూ యిలా వచ్చాను. నీ కార్లో నా వెనకనే రా," అన్నాడు వాలి.

యక్స్ వై జెడ్ కారు వెనకనే గిరి తన కారును పోనిచ్చాడు.

* * *

## 11

కూమ్ నది పక్క రోడ్డమ్మట కారును పోనిచ్చి జీప్ వెనకనే ఆపి దిగాడు.

ఇన్‌స్పెక్టర్ కేశవన్ గబగబా వచ్చి వాలికి నమస్కరించాడు. వాలి నలు వైపులా చూశాడు. ఒక వైపున కూమ్ నది, రెండో వైపున ఎత్తయిన ప్రహరీగోడ!

పోలీసులు ప్రజలను దూరంగా పొమ్మని హెచ్చరిస్తున్నారు. ఇన్‌స్పెక్టర్ కేశవన్‌తో వాలి ప్రహరీగోడ వరకు నడిచాడు. వెనకనుంచి గిరి పరుగెత్తు కొచ్చాడు.

గోడ వారగా పెట్రోమాక్స్ లైట్ వెల్గుతోంది. ఆ కాంతిలో కనిపించిన దృశ్యం ఎంత ఘోరంగా వుందో వర్ణించలేం!

గిరి గాభరాగా వాలి వెనక్కి జరిగాడు. నేలమీద పద్మరాజు అవయవాలు చిందరవందరగా పడున్నాయి.

తల ఒకచోట పడుంది. రెండు కాళ్ళూ వేర్వేరుగా నేలమీదున్నాయి. చేతులు క్రూరంగా ఖండించబడ్డాయి. చిన్న పేగులు మెలికలు తిరిగిన పాములా బయట కొచ్చాయి. అతడి కడుపు, ఛాతీనిండా పోట్లు.

అతడు ధరించిన లుంగీ నేలమీద పడుంది. దాన్ని తీసి చూశాడు వాలి. పెద్ద అక్షరాల్లో "ద్రోహి" అని రక్తంతో రాయబడింది.

నేలమీద రక్తం మడుగులు. మౌనంగా వాలి వెనక్కి తిరిగాడు. రోడ్డుదాటి కూమ్‌నది వైపు చూస్తూ నిలబడ్డాడు.

ఇన్‌స్పెక్టర్ కేశవన్, గిరి అతడి ప్రక్కకొచ్చారు.

"వాలిగారూ, పత్రికా విలేఖర్లు రాబోతున్నారు," అన్నాడు కేశవన్.

వాలి కేశవన్ వంక సీరియస్‌గా చూశాడు.

"కేశవన్ భాయ్, ప్రెస్ విలేఖర్లు యీ దృశ్యాన్ని చూడ్డం మంచిదికాదు. చిత్రవధ చేయబడిన పద్మరాజు అవయవాల ఫోటోలు పత్రికల్లో ముద్రిస్తే ఉప్పెనలా ప్రజల్లో ఉద్రేకాలు చెలరేగుతాయి. శవ భాగాలను వెంటనే హాస్పిటల్‌కి పంపడం మంచిది. నా అనుమతి లేకుండా ఎవ్వరూ శవం దగ్గరకు వెళ్ళకూడదు. ఏ పరిస్థితుల్లోనూ ప్రెస్ ఫోటోగ్రాఫర్లు కెమేరాలను క్లిక్ చేయకూడదు," అన్నాడు వాలి.

ఇన్‌స్పెక్టర్ కేశవన్ శవం దగ్గరకు పరుగెత్తాడు. గిరి పక్కనున్న వాలి చెయ్యి పట్టుకున్నాడు.

"శివయ్యను నేను వదిలేయకపోతే యీ ఘోరం జరిగుండేదికాదు," అన్నాడు గిరి బాధతో.

"గిరీ! బాధపడకు. మనం ఏదో చేసుంటే యిలా జరిగుండేది కాదని అనుకుంటాం. కాని నుదుట విధి రాసింది జరుగుతూనే వుంటుంది," అన్నాడు వాలి.

యాంబులెన్స్ వచ్చింది. ఐదు నిమిషాల్లో పద్మరాజు శవ భాగాలను లోపలకు చేర్చారు.

ఇన్‌స్పెక్టర్ కేశవన్ తొందరచేయడం వలన యాంబులెన్స్ వెంటనే వెళ్ళిపోయింది.

రక్తం మడుగులమీద యిసుక జల్లేశారు. కొన్ని క్షణాల క్రితం కనిపించిన ఘోర దృశ్యం మాయమైంది.

రెండు కార్లొచ్చి ఆగాయి. ప్రెస్ విలేఖర్లు, ఫోటోగ్రాఫర్లు కిందకు దూకారు. ఇన్‌స్పెక్టర్ కేశవన్‌ని వాళ్ళు చుట్టేశారు.

వాలి చుట్ట పీలుస్తూ వాళ్ళవైపు నడిచాడు. అందరి చూపులూ వాలిమీదకు మళ్ళాయి.

"వాలిగారూ, ఎంతో ఆశతో మేమిక్కడికొచ్చాం. చూడ్డానికి శవంకూడా లేకుండా పోయింది," అన్నాడొక విలేఖరి.

"మీరు చాలా ఆలస్యంగా వచ్చారు," అన్నాడు వాలి క్లుప్తంగా.

"హత్య చేయబడినతను ఎవరు? అతడిని ఎందుకు చంపారు?" అడిగాడు మరో విలేఖరి.

"హత్య చేయబడిన వ్యక్తిపేరు పద్మరాజు. అతడికొక పాన్‌షాపు వుంది.

ఈ హత్య ఎందుకు జరిగిందో మేం పరిశోధించి కనుక్కోవాలి," అన్నాడు వాలి.

"మా కెమేరాలకు పని లేకుండా పోయింది!" అన్నాడొక ప్రెస్ ఫోటో గ్రాఫర్.

"కనీసం మీ ఫోటోలు తీయనియ్యండి," అన్నాడు రెండో ఫోటోగ్రాఫర్.

"మేం వద్దనలేదు," అన్నాడు వాలి నవ్వుతూ.

వాలి, గిరి, ఇన్‌స్పెక్టర్ కేశవన్ ఫోటోలను హుషారుగా వాళ్ళు తీశారు. ఫోటోల తతంగం ముగిసింది.

"హంతకుడిని పట్టుకునేందుకు మీకు ఏ క్లూసేనా దొరికాయా ?" ప్రశ్నించా డొక విలేఖరి.

"కావలసినన్ని క్లూస్ దొరికాయి. త్వరలో హంతకుడు మా చేతుల్లో వుంటాడు. అది జరగ్గానే ప్రెస్ సమావేశం ఏర్పర్చి మీ కంతా చెప్తాం," అన్నాడు వాలి.

"థ్యాంక్స్ సార్. ప్రెస్ విలేఖర్లను అలా స్నేహభావంతో చూడాలి!" అన్నాడు విలేఖరి.

చల్లటి గాలి వీస్తోంది. ప్రెస్ విలేఖర్లు, ఫోటోగ్రాఫర్లు వారి కార్లలో వెళ్ళి పోయారు. వాలి, గిరి మెల్లిగా నడిచి కారు దగ్గరకు చేరుకున్నారు.

వాలి స్టీరింగ్ వీల్ వెనక కూర్చున్నాడు. బయట నిలబడిన యిన్‌స్పెక్టర్ వంక చూశాడు.

"కేశవన్ బాయ్! శివయ్యకోసం మనం వెతకాలి! అతడు దొరికితే అరిటి పండు ఒల్చినట్లు మనకంతా తెలుస్తుంది," అన్నాడు వాలి.

"అతడికోసం యీ మహాపట్నంలో ఎక్కడ వెతుకుతాం?" అడిగాడు యిన్‌స్పెక్టర్.

"శివయ్య వుపయోగించే స్కూటర్ ఎవరిదో కనుక్కోవాలి. దాని నంబరు గిరికి తెలుసు."

గిరి చెప్పిన నంబర్ని యిన్‌స్పెక్టర్ రాసుకున్నాడు. "కనుక్కొని మీకు ఫోన్‌చేసి చెప్తాను, సార్," అన్నాడు కేశవన్.

"గుడ్‌నైట్," అని వాలి కారును పోనిచ్చాడు.

వాలి కారు వెనకనే గిరి కారు కదిలింది.

* * *





# 12

పడక కుర్చీలో కూర్చున్న వాలి కెదురుగా గిరి కూర్చున్నాడు

"వాలిగారూ, ఇన్‌స్పెక్టర్ కేశవన్ ఫోన్ చేశాడు. శివయ్య వుపయోగించే స్కూటర్ సినీయాక్టర్ శివరావుది. శివరావు అడ్రెస్ రాసుకున్నాను," అన్నాడు గిరి.

తటాలున వాలి కుర్చీలోంచి లేచాడు. అద్దం ముందుకు వెళ్ళి బుగ్గమీసాలను నిమురుకున్నాడు.

"గిరీ, వెళ్దాం పద," అన్నాడు వాలి.

ఇద్దరూ హోటల్ గదిలోంచి బయటకు వచ్చారు. హోటల్‌ముందు హాల్లోంచి నడిచి యక్స్ వై జెడ్ కారు దగ్గరకు చేరుకున్నారు.

ముందుసీటుమీద వాలి మౌనంగా కూర్చున్నాడు. గిరి కారును పోనిచ్చాడు.

"ఎక్కడి కెళ్ళాలి?" అడిగాడు వాలి.

"శివరావు యిల్లు కె. కె నగర్‌లో వుంది. చాలా దూరం వెళ్ళాలి," అన్నాడు గిరి.

కె కె. నగర్‌లోని ఒక చిన్నయింటి ముందు కారును ఆపాడు గిరి.

"యీ యిల్లే," అన్నాడతను.

వాలి కిందకు దిగాడు. పిట్టగేటు తెరుచుకొని అతడు లోపలకు వెళ్ళాడు. గిరి అతడిని వెంబడించాడు.

ముందు తలుపు తెరిచివుంది. కాని ఎవ్వరూ లేరు. తలుపుమీద తట్టాడు వాలి పెరట్లో బట్టలు వుతుకుతున్న ఒక స్త్రీ గుమ్మం దగ్గరకొచ్చింది.

ఆమె దుస్తులు కొద్దిగా తడిసి వున్నాయి. ఆమె అంత అందంగా లేదు.

"అమ్మాయ్! శివరావు కావాలి," అన్నాడు వాలి.

"ఆయన నిద్రపోతున్నారు," అందామె.

"పది దాటింది, యింకా నిద్రపోతున్నాడా?" అన్నాడు వాలి ఆశ్చర్యంగా.

"తొందరగా లేవ రాయన," అందామె.

"అతడు ఏ గదిలో వున్నాడు?"

ఆమె ఎడంవైపున్న గదివైపు చూపించింది.

లోపలకు నడిచి, తలుపుతోసి వాలి గదిలోకి నడిచాడు. నేలమీద పరిచిన పరుపుమీద శివరావు గుర్రుపెడ్తూ నిద్రపోతున్నాడు.

గదిలోకొచ్చిన గిరి అతిడిని తట్టి లేపాడు. కళ్ళు నలుపుకుంటూ శివరావు లేచి కూర్చున్నాడు.

పరుపు పక్కనే ఒక బ్రాంది బాటిల్, గ్లాసు, నాలుగు సోడాబుడ్లు వున్నాయి. అన్నీ ఖాళీగా వున్నాయి.

శివరావు చూపు వాలిమీద కెళ్ళింది. ఉలిక్కిపడ్తూ అతను లేచి నిలబడి నమస్కరించాడు.

"ఇలా పరుపుమీద కూర్చోండి సార్, ఇంట్లో కుర్చీలన్నీ రిపేరుకెళ్ళాయి," అన్నాడతను.

"అబ్బాయ్, శివయ్య అనే అతడు నీ స్కూటర్ మీద తిరుగుతున్నాడు," అన్నాడు వాలి.

"కొంపతీసి ఏదేనా యాక్సిడెంట్ చేశాడా?" ప్రశ్నించాడు శివరావు.

శివరావు వసపిట్టలా వాగుతాడని వాలి గ్రహించాడు.

"శివయ్య అడ్రెస్ కావాలి," అన్నాడు వాలి.

వాడి అడ్రెస్ నాకు తెలియదు సార్. వాడే యిక్కడకు వస్తూ వుంటాడు."

"అతడికి నీ స్కూటర్ అద్దెకిచ్చావా?"

శివరావు సీరియస్‌గా వాలివంక చూశాడు.

"ఈ ప్రశ్నలన్నీ ఎందుకేస్తున్నారు సార్?"

"నీ జవాబులు వినడంకోసం," అన్నాడు వాలి.

"వాడికి నా స్కూటర్ అద్దెకివ్వలేదు. ఈ మధ్య నా మార్కెట్ చెడింది.

నాకు ఫిలిం బుకింగ్స్ లేవు ఎప్పుడో కొన్న స్కూటర్ యింట్లో పడివుండేది. పెట్రోలు కొనడానికికూడా నా దగ్గర డబ్బులేదు అందువలన అతడి కిచ్చాను," అన్నాడు శివరావు

"స్కూటరిచ్చినందుకు బ్రాందీ బాటిల్సు శివయ్య నీకు సప్లయి చేస్తున్నా డనుకుంటాను," అన్నాడు వాలి.

"మీకు నిజం తెల్సాక నేను ఒప్పుకోక తప్పదు. అతడు బ్రాందీ బుడ్ల రూపంలో నాకు యిస్తూవుంటాడు. కాని తాగలేని స్థితిలో వున్నాను, సార్. తాగటం మానలేను," అన్నాడతను.

"అంత బానిసత్వం మంచిదికాదు," అన్నాడు వాలి.

"పెద్దలు బాగా చెప్పారు. తాగుడు మానేస్తాను!"

"శివయ్య యిక్కడకు ఎప్పుడొస్తాడు?"

"రోజూ వస్తాడు. నేనున్నాలేకపోయినా హాఫ్ బాటిల్ యింట్లో యిచ్చి వెళ్ళిపోతాడు."

అతడివైపు వాలి నవ్వుతూ చూశాడు.

"అబ్బాయ్! మాతో సహకరిస్తే, నీకు ఫిలిం బుకింగ్స్ వచ్చేటట్లు నేను చూస్తాను," అన్నాడు వాలి.

"ఏం చెయ్యాలో చెప్పండి సార్!"

"శివయ్య మాకు కావాలి. ఇతడి పేరు గిరి. ఇతను నీతో యిక్కడ వుంటాడు. శివయ్య రాగానే అతడిని గిరికి పరిచయం చెయ్యి. మాకు నూరు బుడ్లీలు కావాలి. గిరి వెంటనే కాష్ చెల్లిస్తాడు," అన్నాడు వాలి.

"అలాగే సార్," అన్నాడు శివరావు.

"బుడ్డికి ఐదురూపాయల చొప్పున కనీసం ఆరు వందలు నీకు కమిషన్ వస్తుంది," అన్నాడు వాలి

"మీ దయ సార్! దేవుడిలా వచ్చారు ఇంటి అద్దె బాకీపడ్డాను. ఈ కమిషన్‌తో చెల్లించవచ్చు."

వాలి బయటకు నడిచాడు. గిరి అతడి వెనకనే వెళ్ళాడు. శివరావు మొహం కడుక్కోడానికి పెరట్లోకెళ్ళాడు.

"గిరీ, నేను యీ ప్రాంతంలోనే వుంటాను. శివయ్యను పిస్టల్‌తో భయపెట్టి యిక్కడుండమను! నేను వెంటనే యిక్కడికొస్తాను,'' అన్నాడు వాలి

"అలాగే సార్," అన్నాడు గిరి.

వాలి కార్లో కూర్చుని తలుపు మూశాడు. కారు కదిలింది. గిరి లోపలకు వెళ్ళాడు. మొహం తుడుచుకుంటూ శివుడిలా ప్రత్యక్షమయ్యాడు.

"ప్లీజ్ పరుపుమీద కూర్చోండి!" అన్నాడతను.

పరుపుమీద గిరి చతికిలబడ్డాడు.

"మీకు హాట్ కాఫీ వస్తోంది. నా భార్య కాఫీ బాగా చేస్తుంది," అన్నాడతను.

గుమ్మం బయటనుంచి ఓ స్త్రీ కంఠం వినపడింది. "కాఫీ పట్టుకెళ్ళండి," అందామె.

శివరావు పరుగెత్తుకెళ్ళి రెండు గ్లాసులతో లోపలకొచ్చి, ఒక గ్లాసును గిరి కిచ్చాడు.

"క్షమించండి. పాలను పిల్లి తాగేసిందట. మా ఆవిడ బ్లాక్ కాఫీ యిచ్చింది," అన్నాడతను.

నవ్వుతూ గిరి గ్లాసులోని బ్లాక్ కాఫీ రుచి చూశాడు.

"ఫైన్! పిల్లి పాలను తాగేసినందుకు మనం విచారించనవసరంలేదు," అన్నాడు గిరి నవ్వుతూ.

* * *

## 13

వినాయకుడి గుడి ప్రక్కనే కారాపి, సీటుమీద కూర్చుని వున్నాడు వాలి. గుడి చిన్నది. గేటు తెరిచివుంది. గుడి ఆవరణలో వున్న నూతి చుట్టూ చాలా మంది స్త్రీలు వున్నారు.

నీళ్ళు తోడుకుని, బిందెలను భుజాలమీద పెట్టుకొని స్త్రీలు యిళ్ళకు పోతున్నారు. కొత్తవాళ్ళు ఖాళీ బిందెలతో నూతి దగ్గరకు వెళ్తున్నారు.

వాళ్ళ కబుర్లు వింటూ, చుట్టపొగ వదుల్తూ వాలి మౌనంగా కూర్చున్నాడు. క్రాస్ స్ట్రీట్‌లో వున్న శివరావు యిల్లు అతడికి కనిపిస్తోంది.

ఈ సారి గిరి శివయ్యను వదలడు! ఉడుంలా పట్టుకుంటాడు. శివయ్య ద్వారా విషయాలు తెలుస్తాయి' వాలి ఆలోచిస్తున్నాడు.

టైమ్ ఒంటిగంట కావస్తోంది శివరావు, గిరి రమ్మీ ఆడుతున్నారు. బయట స్కూటర్ ఆగిన చప్పుడైంది.

"శివయ్య వచ్చుంటాడు," అన్నాడు శివరావు.

ఎవరో లోపలకు వస్తున్నారు. గిరి చెయ్యి జేబులోకెళ్ళి పిస్టల్ని పట్టుకొంది.



''రావయ్యా మహాత్మా, నీ కోసమే చూస్తున్నాం,'' అన్నాడు శివరావు గదిలోంచి.

గదిలోకొచ్చిన మనిషివైపు అతడు ఆశ్చర్యంగా చూశాడు. శివయ్య కాదు!

''స్కూటర్ని లోపల పెట్టాను సార్. కీ యిదిగో!'' అన్నాడతను.

శివరావు కీని అందుకున్నాడు.

''శివయ్య ఏడీ ?''

''ఈ స్కూటర్ని మీ కియ్యమన్నాడతను. ఏదో అర్జంట్ పనుందట. వెళ్ళిపోయాడు,'' అన్నాడతను.

బయట కారు ఆగింది. వాలి గబగబా గదిలోకొచ్చాడు.

"శివయ్య రాలేదు, సార్," అన్నాడు శివరావు.

స్కూటర్ తెచ్చిన మనిషివంక చూశాడు వాలి. కారు మెకానిక్‌లా వున్నాడతను. అతడు ధరించిన పాంటు, స్లాక్ నిండా గ్రీజ్ మరకలున్నాయి.

"నీ పేరు?" అడిగాడు వాలి.

"త్యాగరాజు, సార్. గ్రీన్ ఆటోవర్క్స్‌లో పనిచేస్తున్నాను."

"శివయ్య అడ్రెస్ తెలుసా?"

"తెలియదు, సార్," అన్నాడతను.

"ఈ స్కూటర్ నీ కెవరిచ్చారు?"

"మా కంపెనీకొచ్చాడు శివయ్య. ఈ స్కూటర్ని తీసుకెళ్ళి యిక్కడివ్వమన్నాడు."

"శివయ్య కంపెనీలో వున్నాడా?"

"టాక్సీలో వెళ్ళిపోయాడు, సార్."

వాలి అతడివంక సూటిగా చూశాడు.

"మాకు అర్జంటుగా నూరు బ్రాందీ బాటిల్స్ కావాలి! నువ్వు యిప్పించగలవా?" ప్రశ్నించాడు వాలి.

"దాన్ని గురించి నాకేమీ తెలియదు, సార్!" అన్నాడతను.

త్యాగరాజును వాలి వెళ్ళిపోనిచ్చాడు. అతడు రోడ్డమ్మట నడిచిపోతున్నాడు.

వాలి జాలిగా శివరావువంక చూశాడు.

"అబ్బాయ్! నీకు సహాయం చేయాలనుకున్నాను. కాని కథ అడ్డం తిరిగింది," అన్నాడు వాలి.

"ఏల్నాటి శని ఏల్తూవుంటే అలాగే వుంటుంది, సార్," అన్నాడు శివరావు.

వాలి, గిరి బయటకు కదిలారు. గిరి కారును మెల్లిగా పోనిస్తున్నాడు. దూరంలో నడుస్తున్న త్యాగరాజు రూపం అతడికి కనిపిస్తోంది.

"మనం యిక్కడున్నామని పసిగట్టి శివయ్య అతడిని పంపించి వుంటాడు. గో స్లో! త్యాగరాజు ఎక్కడో శివయ్యను కల్సుకోవచ్చు," అన్నాడు వాలి.

రోడ్డు పక్కనున్న గ్రీన్ ఆటోవర్క్స్ షెడ్‌లోకి త్యాగరాజు దూరాడు.

ఆ షెడ్ ముందు గిరి కారును ఆపి చూశాడు. అరడజనుమంది మెకానిక్‌లు కార్లను రిపేరు చేస్తున్నారు. శివయ్య ఎక్కడా పత్తాలేదు!

"గిరీ! మనం అనుకున్నట్లు జరగలేదు. శివయ్య మన ప్రాంతాలకు రాకుండా తప్పించుకున్నాడు. ఇటుపైన శివరావు స్కూటర్ని అతడు వాడకపోవచ్చు," అన్నాడు వాలి.

కారు కదిలింది. ఇరవై నిమిషాల్లో హోటల్ అశోక్ కాంపౌండ్‌లో ఆగింది.

వాలి తన గదివైపు వేగంగా వెళ్ళాడు. పడక కుర్చీలో కూర్చుని కళ్ళు మూసుకున్నాడు. ఎటు వెళ్ళినా పరిశోధన ముందుకు సాగడంలేదు. ప్రారంభించిన మెట్టుమీదే నిల్చిపోతోంది.

టెలిఫోన్ మ్రోగింది.

"హలో, వాలి హియర్," అన్నాడతను.

"ఇన్‌స్పెక్టర్ కేశవన్ సార్. శివరావుని కల్సుకున్నారా? శివయ్య ఆచూకీ తెలిసిందా?" అడిగాడతను.

"కేశవన్ భాయ్! ప్రస్తుతం ఎదురుగాలి వీస్తోంది. మరి కొన్నిరోజులు ఓపికపడ్తే పరిస్థితులు మార్తాయి. చేతిలోని ముద్ద నోట్లోకెళ్ళే అదృష్ట ముంటుంది," అన్నాడు వాలి మందహాసంతో.

* * *

## 14

బెంగుళూర్!

గంట క్రితం వాలి, గిరి విమానంలో బెంగుళూరు చేరుకున్నారు హోటల్ వెస్టెండ్‌లో గది తీసుకున్నారు.

బయటకెళ్ళిన గిరి హుషారుగా గదిలోకొచ్చాడు పడక కుర్చీలో కూర్చున్న వాలి అతడివంక నవ్వుతూ చూశాడు.

"గోల్డెన్ లారీ సర్వీస్ అనూరాధ యింట్లోనే వుంది. ఆమెతో మాట్లాడి మీ గురించి చెప్పాను. మనల్ని సరిగ్గా పదకొండింటికి రమ్మందామె," అన్నాడు గిరి.

హోటల్ మేనేజర్‌తో మాట్లాడి మనకొక కారు అరేంజి చేయమను," అన్నాడు వాలి.

గిరి బయటకెళ్ళాడు. వాలి టైమ్ చూశాడు పది కావస్తోంది.

అతడికి అనూరాధ మొహం లీలగా గుర్తుంది. మోహనరాజు రిటైరయినాక ఆమెను పెళ్ళాడాడు. ఒక పార్టీలో వాళ్ళిద్దర్ని చూశాడతను.

గిరి లోపలకొచ్చాడు.

"ఒక బ్యూక్ కారు మనకోసం రెడీగా వుంది," అన్నాడు గిరి

"మంచిది, అరగంట తర్వాత వెళ్దాం," అన్నాడు వాలి.

గిరి సోఫాలో కూర్చుని వాలివైపు సూటిగా చూశాడు.

"ఆమెను కల్సుకోడం వలన మనకేదేనా వుపయోగం వుంటుందంటారా?" అడిగాడతను.

"ప్రస్తుతం నేను చెప్పలేను. మొదటినుంచీ ఒక అనుమానం నన్ను పీక్కు తింటోంది. ఫియట్ కారులో దొరికిన రెండు బాటిల్సు కారణంగా వాళ్ళు సబిన్‌స్పెక్టర్ శివరామ్‌ని హత్యచేసి వుండరు. గోల్డెన్ లారీ సర్వీస్ వారి రెండు లారీలను అతడు చెక్ చేయించి వుంటాడు. వాటిలో ఏదో అతను చూసుండాలి ఫియట్ కారులో వచ్చినవాళ్ళు లారీలకు గార్డ్సు కావచ్చు! ఆ లారీ సర్వీస్‌ను అనూరాధ నడుపుతోంది!" అన్నాడు వాలి.

"ఆ లారీలను చెక్ చేసినట్లు, వాటిలో బుడ్డీలు వున్నట్లు కానిస్టేబుల్సు మనతో చెప్పలేదు," అన్నాడు గిరి.

వాలి విచిత్రంగా నవ్వాడు.

"వాళ్ళు మాటల్లో చెప్పలేదు. వాళ్ళు అదంతా కప్పిపుచ్చుతున్నారని నే ననుమానించాను. గిరీ, మన పరిశోధన ఒక వైపే వెళ్ళకూడదు. నలువైపులా తిరగాలి. ఒకవైపు వెళ్తే అడ్డుపడిన గోడ మరో వైపున లేకపోవచ్చు," అన్నాడు వాలి.

గిరి టైం చూసి సోఫాలోంచి లేచాడు. ఇద్దరూ గదిలోంచి బయటకు నడిచారు.

బ్యూక్ కారును గిరి పోనిస్తున్నాడు. సూర్యుడు ఆకాశంలో ప్రకాశిస్తున్నాడు. కాని అంత వేడిగాలేదు. చల్లటి గాలి వీస్తోంది.

ఎత్తుగా వున్న యినపగేటు మూసివుంది. వాలివంక ఓసారి చూసి వాచ్‌మన్ గేటును తెరిచాడు. గిరి కారును లోపలకు పోనిచ్చాడు.

చక్కటి సిమెంట్ రోడ్డు రోడ్డు కిరువైపులా పూలమొక్కలున్నాయి. రంగు రంగుల పూలవైపు వాలి ఆనందంతో చూశాడు. తెల్లటి మేడముందు పోర్టికోలో కారును ఆపి గిరి దిగాడు.

వాలి కింద అడుగు పెట్టాడు. తెల్లటి యూనిఫామ్‌లో వున్న నౌఖరు కారు దగ్గరకొచ్చి వాలికి శల్యూట్ చేశాడు




"రండిసార్," అన్నాడతను.

ముందు వరండా ఫ్లోరింగ్ తగధగ మెరుస్తోంది. విశాలమైన హాల్లోకి వెళ్ళాడు వాలి. వెనకనే వున్నాడు గిరి.

హాల్లో యాభై సోఫాలున్నాయి. కప్పునుంచి శాండిలియర్స్ వేళ్లాడుతున్నాయి. మొజాయిక్ ఫ్లోరింగ్ కళ్ళ కింపుగా వుంది.

"కూర్చోండి, సార్. అమ్మగారితో చెప్తాను." అని యూనిఫామ్‌లో వున్న నౌకరు లోపలకు వెళ్ళాడు.

ఎదురుగా వున్న గోడ మధ్యలో లైఫ్ సైజులో మోహనరాజు ఆయిల్ పెయింటింగ్ అమర్చబడి వుంది.

ఆ పెయింటింగ్ వైపు చుట్టపొగ వదుల్తూ చూశాడు వాలి. కళ్ళముందు మోహనరాజు నిలబడినట్లుంది!

చూడీదార్ పైజామా, పొడుగాటి షేర్వాణీ, తలపాగా, గుబురుగా పెరిగిన మీసాలు, పెద్ద కళ్ళు, కోల మొహం, కాళ్ళకు కాశ్మీర్ స్లిప్పర్స్ - ఆ పెయింటింగ్‌లో మోహనరాజు ఏ రాజ్యాన్నో ఏలే మహారాజులా కనిపిస్తున్నాడు.

హైహీల్డ్ స్లిప్పర్సు చప్పుడు వినపడింది. కాస్సేపట్లో అనూరాధ నవ్వుతూ హాల్లో కొచ్చింది. ఆమెను చూసి గిరి ఉలిక్కిపడ్డాడు !

ఆనాటి రాత్రి కార్లోంచి దిగి శివయ్య వున్న రెస్టారెంట్‌లోకి వెళ్ళిన స్త్రీ ఆమే!

ఆమె ఇద్దరికీ నమస్కరించింది. విచారవదనంతో వాలివంక చూసింది.

"ఆయన చనిపోయి మూడేళ్ళయింది. బతికుంటే మిమ్మల్ని చూసి ఆయన ఎంత సంతోషించేవారో!" అందామె.

"అమ్మాయ్! మోహనరాజు తన మిత్రులకు ప్రాణం యిచ్చేవాడు. కాశ్మీర్‌లోని డాల్ లేక్‌లా అతడి హృదయం చాలా విశాలమైంది," అన్నాడు వాలి.

యూనిఫామ్డ్ నౌఖరు ట్రే తో వచ్చాడు. వాలి పక్కనున్న టీపాయిమీద ట్రే వుంచి వెళ్ళిపోయాడు.

ట్రేవైపు ఆత్రంగా చూశాడు గిరి. ప్లమ్స్, యాపిల్ పళ్లు, ద్రాక్షపళ్ళు ట్రేలోఒకవైపు వున్నాయి రెండోవైపున తెల్లటి కెటిల్, రెండు కాఫీ కప్పులు, సాసర్లు వున్నాయి.

"పళ్లు తీసుకోండి!" అందామె.

ఇద్దరూ పళ్ళు తినసాగారు. తింటూ గిరి ఆమెకేసి చూశాడు. ఆమెవయస్సు ముప్పయి ఏళ్ళు దాటి వుండొచ్చు, కాని పైకి చిన్నదానిలా కనిపిస్తోంది. రెస్టారెంట్ ముందు తనను చూసిన విషయం ఆమెకు గుర్తులేకపోవచ్చు!

రెండుకప్పుల్లో గిరి వేడి కాఫీ పోశాడు. ఇద్దరూ కాఫీ త్రాగడం ముగించారు.

"అమ్మాయ్, గోల్డెన్ లారీ సర్వీస్‌ను నువ్వు నడుపుతున్నావని విన్నాను," అన్నాడు వాలి.

ఆమె కిలకిల నవ్వింది.

"వాలిగారూ, కూర్చుని తింటే కొండలు కూడా తరిగిపోతాయి నా భర్త చాలా ఆస్తిని నాకు వదిలి వెళ్ళిపోయారు. ఆయన డబ్బును అనేక వ్యాపారాల్లో పెట్టాను. అందులో గోల్డెన్ లారీ సర్వీస్ ఒకటి," అందామె.

"ఆ కంపెనీ విషయాలు నువ్వే స్వయంగా చూస్తూ వుంటావా ?"

"నాలాటి స్త్రీలు లారీ కంపెనీలను నడపడం కష్టతరమైన పని సార్. అదంతా బుచ్చయ్య చూసుకుంటాడు."

"బుచ్చయ్య ఎవరు ?"

"ఆ కంపెనీ జనరల్ మేనేజర్. నా చేత ఆ కంపెనీని అతడే కొనిపించాడు. అతడినే దానికి మేనేజర్‌గా నియమించాను."

"బుచ్చయ్య ఎక్కడుంటాడు ?"

"అతడు ఒకచోట వుండడు. బెంగుళూరు, మద్రాస్, హైద్రాబాద్‌ల మధ్య తిరుగుతూవుంటాడు."

"ప్రస్తుతం అతడెక్కడున్నాడు ?"

"మద్రాసులో," అందామె.

యూనిఫామ్‌లోవున్న నౌకరు దగ్గరగా వెళ్ళి ఆమె కేదో చెప్పాడు.

"క్షమించండి, ఇప్పుడే వస్తాను," అని ఆమె లోపలకు వెళ్ళిపోయింది.

''వాలిగారూ! శివయ్య రెస్టారెంట్‌లోకి వెళ్ళాక ఒక యువతి కార్లోంచి దిగి రెస్టారెంట్‌లోకి వెళ్ళిందని మీతో చెప్పాను, గుర్తుందా ?" అడిగాడు గిరి.

వాలి తలాడించాడు.

"ఆ యువతి ఈమేనా ?" అడిగాడు వాలి.

"మీరు ఎలా ఊహించారు ?" అడిగాడు గిరి.

వాలి కిలకిల నవ్వాడు.

"గిరీ, ఆమె గదిలోకి రాగానే నువ్వు తృళ్ళిపడ్డావు !" అన్నాడు వాలి.

అనూరాధ హాల్లోకి తిరిగొచ్చి సోఫాలో కూర్చుంది. వాలి ఆమెవంక చూశాడు.

"అమ్మాయ్, మీ లారీలను మత్తుద్రవాలను స్మగుల్ చేసేందుకు ఉపయోగిస్తున్నారని పుకార్లు వున్నాయి,'' అని వాలి ఆమె ముఖంవైపు చూశాడు.

ఆమె కనురెప్పలను చిట్లించింది. బిగుసుకుపోయిన ఆమె ముఖంలో మెరుపులా చిరునవ్వు నాట్యమాడింది.

''వాలిగారూ, స్మగ్లర్స్ మా లారీ లేమిటి, ఏది కనిపిస్తే అందులోనే రహస్యంగా సరఫరా చేస్తారు. ట్రెయిన్లలో ఎంతో సరకు పంపబడుతోందని ఎవరో అంటే విన్నాను,'' అందామె.

''నీ కంపెనీ పూర్తిగా బుచ్చయ్య చేతులమీద నడుస్తోందా ?" అడిగాడు అతను.

"అలాగే అనుకోవాలి. నేను మామూలు విషయాల్లో జోక్యం చేసుకోను. ఖర్చులూ, లాభాలూ చూస్తూవుంటాను.''

''బుచ్చయ్య ఎటువంటివాడు ?"

"మంచివాడే. నన్ను మోసం చేయడానికి యింతవరకూ ప్రయత్నించలేదు. నాలాటి ఒంటరిదాన్ని మోసంచేయాలని ఎందరో స్నేహం నటిస్తారు. బుచ్చయ్య అటువంటివాడు కాదు.''

"అతడితో నీ కెలా పరిచయమైంది ?"

"అతడు మోహనరాజుగారికి తెలుసు. అప్పుడప్పుడు వచ్చి ఆయనతో మాట్లాడిపోయేవాడు. ఆ స్నేహం నా భర్తపోయినా నిల్చింది," అందామె.

''అమ్మాయి, నువ్వు తరచు మద్రాస్ వెళ్తూంటావా ?''

"గతవారంలో వెళ్ళివచ్చాను, అందామె.

''గత వారంలోనే గిరి ఆమెను రెస్టారెంట్ ముందు చూశాడు. అనూరాధ నిజం చెప్పింది! నిజం వాళ్ళకు తెలుసునని గ్రహించి ఆమె నిజం చెప్పిందేమో!

వాలి మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి.

"అమ్మాయ్, ఒకనాటి రాత్రి నేనూ, గిరీ నిన్ను మద్రాసులో చూశాం. నువ్వొక రెస్టారెంట్‌లోకి వెళ్ళావు. కాబిన్ లోపలి కెళ్ళి కూర్చున్నావు. నీకంటే ముందు అదే కాబిన్‌లోకి శివయ్య వెళ్ళాడు!" అన్నాడు వాలి.

ఆమె కోపంగా వాలివైపు చూసింది.

"మీ మాటలు విచిత్రంగా వున్నాయి. శివయ్య ఎవరో నే నెరగను,'' అందామె.

అమాంతంగా వాలి సోఫాలోంచి లేచి ఆమె ముందు కెళ్ళాడు. అనూరాధ పెదిమలు వణుకుతున్నాయి !

''అమ్మాయ్, శివయ్యను వెంటాడుతూ మేం ఆ రెస్టారెంట్‌కి వచ్చాం. శివయ్య నీకు తెలియని మనిషయితే నువ్వు వెంటనే బయటకు వచ్చేసేదానివి, కాని నువ్వు రాలేదు,'' అన్నాడు వాలి.

ఆమె జవాబివ్వలేదు. వాలివంక భయంతో చూస్తూ వుండిపోయింది.

''అమ్మాయ్ శివయ్య మద్రాసులో హత్యలు చేశాడు. అతడు పోలీసుల చేతుల్లో వున్నాడు. అతడితో మాట్లాడాక నే నిక్కడికి వచ్చాను,'? అని వాలి అబద్ధమాడాడు.

ఆమె తటాలున సోఫాలోంచి లేవబోయింది. వాలి చేత్తో ఆమె భుజంమీద నొక్కాడు.

... ఆ రెస్టారెంట్‌లో శివయ్య ఆనాటి రాత్రి నీకు డబ్బిచ్చాడు. అవునా ?''

"ఇచ్చాడు,'' అందామె.

''ఎంత ?"

"నేను లెక్కపెట్టలేదు. నోట్లున్న కవర్లను బుచ్చయ్య కిచ్చేశాను."

"నువ్వు బుచయ్య బాస్‌వి ! శివయ్యను కల్సుకొని ఆ డబ్బు తీసుకోవలసిన ఖర్మ నీ కెందుకు పట్టింది ?" అర్చాడు వాలి.



"వాలిగారూ! ఆ రెస్టారెంట్‌కి వెళ్లి డబ్బు తెచ్చి తన కివ్వమన్నాడు బుచ్చయ్య. అతడు దుర్మార్గుడు. అతడిని ఎదిరించే ధైర్యం నాకు లేదు. అతడు నన్ను బానిసగా చేసి ఆడిస్తున్నాడు!" అందామె.

"అతడి పార్ట్నర్‌గా నువ్వు అదంతా చేసుండాలి!"

ఆమె వాలివంక కన్నీళ్ళతో చూసింది.

"వాలిగారూ, గతంలోకి వెళ్తేగాని మీకు నా పరిస్థితి అర్థంకాదు. నేను మావయ్య ఇంట్లో పెరిగాను. బలాత్కారంగా నన్నొక మూగివాడికిచ్చి పెళ్లి చేసేశాడు. సంవత్సరంపాటు నా భర్తతో జీవించి, విసుగెత్తి మద్రాసుకు పారిపోయాను మద్రాసు చేరాక హమీద్ అనే వ్యక్తితో నాకు స్నేహమైంది. అతడితో వుండేదాన్ని.

"ఒకనాడు ఏదో పార్టీకి హమీద్ నన్ను తీసుకెళ్లాడు. అక్కడ మోహనరాజుగార్ని కలుసుకున్నాను. ఆయన నన్ను తనతో బెంగుళూరు రమ్మన్నారు. హమీద్‌ని వదిలేసి బెంగుళూరు వెళ్ళాను. మోహనరాజుగారు కోటీశ్వరులు. ఆయన ముసలివాడై పోయాడు. కాని ఆయనలో స్త్రీ వ్యామోహం చావలేదు. అప్పటిలో లోకం నాకు డబ్బురూపంలోనే కనిపించేది!

"నే నాయన్ని రిజిస్టర్ మేరేజి చేసుకున్నాను. నా జీవితం సుఖంగా సాగి పోతోంది. ఆ సమయంలో నన్ను వెతుక్కుంటూ బుచ్చయ్య ప్రత్యక్ష మయ్యాడు. అతడు నన్ను బ్లాక్‌మెయిల్ చేయడం ప్రారంభించాడు" అని అందామె.

"అతడు ఎందుకు బ్లాక్‌మెయిల్ చేశాడు?"

"నా మొదటి భర్త బ్రతికున్నాడు. నేను డైవర్స్ చేయలేదు. అందువలన మోహనరాజుగారితో జరిగిన నా పెళ్ళి చట్టప్రకారం రద్దు అవుతుందన్నాడు. ఆయన ఆస్తి నాకు రాదన్నాడు. తనకు డబ్బు చెల్లిస్తూవుంటే నా మొదటి భర్త గురించి ఎవ్వరికీ చెప్పనన్నాడు. డబ్బిచ్చి అతడి నోరు మూశాను. రోజులు గడిచినకొద్దీ బుచ్చయ్య ఆశలు పెరిగాయి. డబ్బుతో అతడికి తృప్తి లేకుండా పోయింది. అతడి చూపు నామీద పడింది. అతడికి లొంగిపోవలసి వచ్చింది. ఇంతలో మోహనరాజుగారు మరణించారు. ఆయన ఆస్తి నా చేతి కొచ్చింది. బుచ్చయ్య నన్ను బానిసగా చేసి ఆడిస్తున్నాడు. వాలిగారూ, అతడి నుంచి నాకు విముక్తి లభించేటట్లు చూడండి! ఇటుపైనేనా స్వేచ్ఛగా నేను జీవించే అవకాశాన్ని కల్పించండి," అందామె.

ఆమె కళ్ళమ్మట నీళ్ళు కార్తున్నాయి. సానుభూతితో గిరి ఆమె ప్రక్కకు కదిలాడు. జేబురుమాలును ఆమెకిచ్చాడు.

వాలి ఆమెకేసి సూటిగా చూశాడు.

"అమ్మాయ్! మానవుల్లో వున్నత విలువలు క్షీణించినపుడు, దురాశ పెరిగి నపుడు నీలాగే బాధపడవలసి వస్తుంది," అన్నాడు వాలి.

"అదంతా ఇప్పుడు తెల్సుకున్నాను సార్, కాని బుచ్చయ్య సాలెగూడు లోంచి బయటపడలేకపోతున్నాను."

"సాలెగూళ్ళు నేలకూలవలసిన సమయం రాక తప్పదు," అన్నాడు వాలి క్లుప్తంగా.

క్షణకాలం వాలి ఆమె ముందు పచార్లు చేశాడు. ఆగి ఆమెకేసి సీరియస్‌గా చూశాడు.

"ఏదీ దాచకుండా నా కంతా చెప్పావా?"

"అంతా చెప్పాను సార్. నన్ను కాపాడమని మిమ్మల్ని వేడుకుంటున్నాను," అందామె.

"నీకు ప్రమాదం రావచ్చని భయపడ్తున్నావా?"

"ఇదంతా మీకు చెప్పాక బుచ్చయ్యే నన్ను వదలడు. తన కసి తీర్చు కుంటాడు," అంది అనూరాధ.

"నీకు బాడీగార్డుగా వుండేందుకు ఒక వ్యక్తిని యిక్కడకు వెంటనే పంపిస్తాను," అని వాలి హాల్లోంచి బయటకు నడిచాడు.

గిరి నవ్వుతూ ఆమెకు బై బై చెప్పాడు.

"కొంతకాలంపాటు నా బాడీగార్డుగా మీరుండకూడదూ?" అందామె.

కారు హారన్ మ్రోగింది బయటనుంచి. గిరి హాల్లోంచి కారు దగ్గరకు పరుగెత్తి, ముందు సీటుమీద కూర్చుని తలుపు మూశాడు. వాలి కారును పోనిచ్చాడు.

* * *

## 15

గోల్డెన్ లారీసర్వీస్ ఆఫీసు కాంపౌండులో కారాపి గిరి, వాలి దిగారు. అరడజను లారీలు కాంపౌండులో వున్నాయి.

ముందు హాల్లోకి వెళ్ళాడు వాలి. యాభైమంది గుమస్తాలు వాళ్ళ పనుల్లో నిమగ్నులై వున్నారు. పక్కనున్న బుకింగ్ ఆఫీసునుంచి కేకలు వినిపిస్తున్నాయి.

రిసెప్షన్ బోర్డున్న టేబుల్ ముందుకు నడిచాడు వాలి. ఒక ఆంగ్లో ఇండియన్ యువతి అతడివైపు నవ్వుతూ చూసింది.

"బుచ్చయ్యతో మాట్లాడాలి," అన్నాడు వాలి.

"ఆయన నిన్న బొంబే వెళ్ళారు," అందామె.

"బొంబేలో అతడెక్కడుంటాడు?"

"చెప్పలేను సార్. ఏ హోటల్లోనో వుంటారు," అందామె.

వాలి బయటకు నడిచాడు. ఆంధ్రానుంచి వచ్చిన లారీలోంచి పెట్టెలను, పార్శిల్సును కిందకు దింపుతున్నారు. గిరి అక్కడ నిలబడి పార్శిల్సును చూస్తున్నాడు. వాలి అతడి ప్రక్కకు నడిచాడు.

"ఈ లారీలో ఒక పుస్తకాల కంపెనీకి వంద పార్శిల్సు వచ్చాయి," అన్నాడు గిరి.

"పుస్తకాల అమ్మకం అంతగా పెరిగుంటుంది," అని వాలి పార్శిల్సు వైపు చూశాడు

గోనిలో పుస్తకాలు అమర్చి కుట్టేశారు. బాలాజీ బుక్ డిస్ట్రిబ్యూటర్, మద్రాస్-1 అని ఎర్ర సిరాతో గోనెమీద రాసివుంది.

"ఒక పార్శిల్‌ని విప్పిచూడు!" అన్నాడు వాలి.

గిరి పనిలోకి దిగాడు. కుట్లను కత్తితో కోసేశాడు. ఒక గుమస్తా దగ్గరకు పరుగెత్తుకొచ్చాడు.

"ఏమిటి సార్ చేస్తున్నారు?" అర్చాడు గుమస్తా.

"ప్రోహిబిషన్ డిపార్ట్‌మెంట్! చెక్ చేస్తున్నాం," అన్నాడు వాలి.

గుమస్తా లోపలకు పరుగెత్తాడు.

గిరి పైనున్న పుస్తకాలవైపు చూశాడు.

"పుస్తకాలు సార్," అన్నాడతను.

"పై పుస్తకాలు తీసి చూడు," అన్నాడు వాలి

భయంకరమైన చప్పుళ్ళు నలువైపులనుంచీ వెలువడ్డాయి. పుస్తకాల కింద నున్న బుడ్డీలను వాలి చూశాడు. నలువైపులనుంచీ పొగ కప్పేస్తోంది!

గిరి కళ్ళు మూసుకున్నాడు.

"బయటకు పరుగెత్తు! మళ్ళా వద్దాం!" అన్నాడు వాలి.

వాలి, గిరి గేటుదాటి దూరంగా పోయారు. వాళ్ళ కళ్ళమ్మట నీళ్ళు కార్తున్నాయి. లారీ సర్వీస్ కాంపౌండు నలువైపులా పొగ ఆవరించింది.

"టియర్‌గాస్ షెల్స్!" అన్నాడు వాలి.

పొగ మధ్యనుంచి ఒక లారీ వాళ్ళవైపు దూసుకొస్తోంది. గిరి చెయ్యి పట్టుకొని వాలి రోడ్డుకు దూరంగా జరిగాడు.

లారీలో ఎంతమందో నిలబడి వున్నారు. పిస్టల్ చప్పుళ్లు ధన్ ధన్ మారు మ్రోగాయి.

వాలి, గిరి నూతి పక్కన నేలమీద అమాంతంగా పడ్డారు వాళ్ళపైనుంచి బులెట్లు దూసుకుపోయాయి.

లారీ రోడ్డమ్మట వేగంగా వెళ్ళిపోయింది. వాలి లేచి నిలబడ్డాడు. లారీ వెళ్ళిన వేపు చూశాడు. లారీ నంబరు సరిగ్గా కనబడలేదు.

కాంపౌండ్‌లో పొగ సన్నగిల్లింది. వాలి కాంపౌండ్‌లోకి వెళ్ళాడు. యక్స్.వై.జెడ్. కారులో కూర్చున్నాడు. కారును గేటుదాటి పోనిచ్చాడు.

గబగబా వచ్చి గిరి కారులో ఎక్కాడు. వాలి కారును పోనిచ్చాడు.

"గిరీ, వాళ్ళు అన్నింటికీ తెగించి బ్రాందీ బుడ్డీలను యిక్కడకు పట్టు కొస్తున్నారు. మరికొంత బందోబస్తుతో మనం వాళ్ళ ఆఫీసుమీదకు దాడి చెయ్యాలి," అన్నాడు వాలి.

మరో గంటలో లారీ ఆఫీసు కాంపౌండ్‌లో రెండు పోలీసువాన్లు వున్నాయి. నూటయాభై మంది సాయుధ పోలీసులు ఆఫీసు భవనాన్ని చుట్టేశారు.

వాలి కోపంగా లోపలకు వెళ్ళాడు. అతడి వెనక ఇన్‌స్పెక్టర్ కేశవన్, గిరి నడుస్తున్నారు.

ఎలుగుబంటిలా వున్న జాన్ వాళ్ళకు ఎదురయ్యాడు.

"ఇదంతా ఏమిటి సార్!" అడిగాడతను.

"ఈ బిల్డింగ్‌ను సోదా చెయ్యాలి," అన్నాడు వాలి.

"చేసుకోండి." అని జాన్ పక్కకు తప్పుకున్నాడు

ఆరుగంటలపాటు సోదా సాగింది. ప్రతి కర్రపెట్టెనూ, పార్శిల్‌నూ, పాకెట్‌నూ పోలీసులు తెరిచి చూశారు. ఎక్కడా మత్తు ద్రవాలున్న బుడ్డీలు కనిపించలేదు!

"మనం చూసిన బ్రాందీ బుడ్డీలు ఏమైనాయి?" అన్నాడు గిరి.

"గిరీ! అంతా మేజిక్! మనం చూసినదంతా మాయమైపోయింది! మనవైపు షూట్ చేస్తూ ఆ లారీలో వాళ్ళు ఆ గోనిపార్శిల్స్‌ను పట్టుకుపోయి వుంటారు," అన్నాడు వాలి.

"వాలిగారూ, ఈ ఆఫీసులోని వాళ్ళను అరెస్టుచేసి, యీ ఆఫీసును మూయించి సీల్ చేస్తాను," అన్నాడు యిన్‌స్పెక్టర్ కేశవన్.

వాలి అతడివైపు నవ్వుతూ చూశాడు.

"కేశవన్ భాయ్, తొందరపడకు. మనం ఓడిపోయాం. వాళ్ళు జయించారు. ఈ భావం వాళ్ళలో తలెత్తడం మంచిది. మనల్ని కించపర్చామన్న అహంకారం వాళ్ళను ఆఖరున ఓడిస్తుంది," అన్నాడు వాలి.

జాన్ వాళ్ళ ముందుకొచ్చాడు.

"మాది పేరుపొందిన లారీ సర్వీసు, సార్. మమ్మల్ని అనుమానించి, మీరు రెయిడ్ చేయడం ఆశ్చర్యంగా వుంది," అన్నాడతను.

"వుయ్యార్ సారీ! అసత్యవార్తలు మాకు అందాయి. ఇప్పుడు నిజం తెల్సింది," అన్నాడు వాలి.

టియర్‌గ్యాస్ షెల్స్ గురించీ, లారీలోని వాళ్ళు షూట్‌చేయడం గురించీ వాలి ఏమీ అడక్కపోవడం జాన్ని ఆశ్చర్యపర్చింది!

"నివురు గప్పిన నిప్పులాంటివాడు వాలి," అనుకొన్నాడు జాన్.

* * *

## 16

చీకటి పడింది. రోడ్డు దీపాలు వెల్గుతున్నాయి. లారీ ఆఫీసు ముందు పేవ్‌మెంటుమీద గిరి పచార్లు చేస్తున్నాడు.

అతడికి కనుచూపుమేర దూరంలో యక్స్. వై. జెడ్. కారు పక్కనే వాలి నిలబడి వున్నాడు. చల్లటి గాలి వీస్తోంది. అప్పుడప్పుడు వాలి దూరంలో వున్న గిరివైపు చూస్తున్నాడు.

తటాలున ఒక అంబాసిడర్ కారు లారీ ఆఫీసు కాంపౌండ్‌లోంచి బయట కొచ్చింది. జాన్ ముఖాన్ని అతడు గుర్తుపట్టాడు. జాన్ డ్రయివర్ పక్కనే కూర్చుని వున్నాడు. వెనుకసీటుమీద కూర్చున్నతడివైపు గిరి చూశాడు. వికృతమైన మొహం! బుచ్చయ్య అతడే అయి వుండాలి!

పాకెట్ టార్చి ఆన్‌చేసి గిరి వాలి వైపు తిప్పాడు. ఆ కాంతిని గమనించి వాలి తన కారును పోనిచ్చాడు. అంబాసిడర్ వెనకనే గిరి తన కారును నడుపుతున్నాడు.

రియర్‌వ్యూ స్పెషల్ మిర్రర్‌లోకి చూశాడు వాలి. తన వెనక మూడు కార్లు వస్తున్నాయి. వాటి మధ్యనున్న అంబాసిడర్‌ను గిరి వెంటాడుతున్నాడని వాలి గ్రహించాడు.

వాలి స్పీడు తగ్గించాడు. వెనుకనున్న కారు ముందుకుపోయింది. ఇప్పుడు అంబాసిడర్ అతడి కారు వెనకనే వుంది!

రోడ్డు జంక్షన్‌లో రెడ్‌లైటు చూసి వాలి కారును ఆపాడు.

అంబాసిడర్ మెల్లిగా కదుల్తోంది.

"బాస్, ముందున్నది వాలిగారి కారు," అన్నాడు ముందు కూర్చున్న జాన్.

"ఆయన మన్ని వెంటాడ్డంలేదు. కారు ముందున వుందిగా!" అన్నాడు బుచ్చయ్య.

"ఎడంవైపు రోడ్డుకు తిరిగి పోదాం," అన్నాడు జాన్.

"ఆల్‌రైట్," అన్నాడు బుచ్చయ్య.

ఎడంవైపుకు వెళ్ళే కార్లకు సిగ్నల్ ఇవ్వబడింది. అంబాసిడర్ వేగంగా కదిలింది. వాలి కారును దాటి ఎడంవైపుకు తిరిగింది. ఆ కారును వాలి వెంబడించాడు.

వెనకనుంచి కారు హారన్ వినపడింది. గిరి కారు ముందుకు దూసుకుపోయి అంబాసిడర్ ముందుకు చేరుకుంది.

ముందు వెళ్తున్న అంబాసిడర్ కారువైపు సూటిగా చూశాడు వాలి. ఒక




బటన్ నొక్కాడు. బోనెట్ మీదున్న గన్ మూడు అంగుళాలు పైకి లేచింది.

వాలి మరో బటన్ని రెండుసార్లు నొక్కాడు. భయంకరమైన చప్పుళ్ళు గాలిలో ధ్వనించాయి. అంబాసిడర్ కారు కొంచెం దూరం వెళ్ళి ఆగిపోయింది

తన కార్లోంచి వాలి బయటకు దూకాడు. అంబాసిడర్ కారువైపు పరుగెత్తాడు. కార్లోంచి దిగిన మనుషులవైపు మూడుసార్లు షూట్ చేశాడు

వెనకసీటుమీదనుంచి దిగినతను కారు పక్కనే పడ్డాడు. వాలి అతడివైపు వెళ్లాడు. నేలమీద పడున్న వ్యక్తి వాలి వైపు షూట్ చేశాడు

వాలి అమాంతంగా పక్కకు జరిగాడు గాలిలో ఎగిరి అతడిమీదకు దూకాడు.

గిరి అక్కడకు పరుగెత్తుకొచ్చాడు. నేలమీద పడున్న వ్యక్తి చేతిలోని పిస్టల్ రెండుసార్లు పేలింది. వాలి అతడివైపు మరోసారి షూట్ చేశాడు. అతడి చేతిలోని పిస్టల్ దూరంగా ఎగిరిపడింది.

అతడిని లేవదీశాడు వాలి వికృత గా వున్న అతడి ముఖంలోకి చూశాడు అతడి కుడిచేతినుంచి రక్తం కార్తోంది

"తరిమ్మావాళ్ళు పారిపోయారు!" అన్నాడు గిరి.

భయంకరంగా పిస్టల్ పేలింది. వాలి ముందున్న వికృతమనిషి నేలమీద కూలిపోయాడు.

రోడ్డు లైటు కాంతిలో అతడిని పరీక్షగా చూశాడు వాలి. బులెట్ అతడి వీపులోంచి లోపలకు దూసుకువెళ్ళింది. అతడు మూలుగుతున్నాడు. రక్తం విశేషంగా కార్తోంది!

నేలమీదకు వంగి అతడివైపు చూశాడు వాలి.

''నీ పేరు?'' అడిగాడు వాలి.

''బుచ్చయ్య,'' అన్నాడతను.

''ఏదేనా చెప్పాలా?''

''నన్ను ఆమె చంపించింది! నా భార్య! అనూరాధ!'' అని అతడు కళ్లు మూశాడు

గిరి నలువైపులా తతిమ్మావాళ్ళకోసం వెతికి తిరిగొచ్చాడు

''వాళ్ళు ఎక్కడా లేరు సార్,'' అన్నాడు గిరి.

అంబాసిడర్ డిక్కీ తెరిచి చూశాడు వాలి. లోపల డీల్‌వుడ్ పెట్టెలున్నాయి పై చెక్కను చేత్తో లాగి, లోపలున్న బ్రాందీబుడ్డీలను వాలి పరిశీలించాడు.

''గిరీ! ఇన్‌స్పెక్టర్ కేశవన్‌కి ఫోన్‌చేసి వెంటనే యిక్కడకు రమ్మను,'' అన్నాడు వాలి.

గిరి రోడ్డమ్మట నడిచి వెళ్ళిపోయాడు. పదినిముషాల తర్వాత అతడు తిరిగొచ్చాడు. చాలామంది ఆ ప్రాంతంలో గుమిగూడారు

పోలీస్ జీప్ వచ్చి రోడ్డువారగా ఆగింది. ఇన్‌స్పెక్టర్ కేశవన్, నలుగురు కానిస్టేబుల్స్ కిందకు దూకారు.

ఇన్‌స్పెక్టర్ గబగబా వాలి ముందుకు నడిచాడు

''కేశవన్ భాయ్! ఇతడు మరణించాడు. పేరు బుచ్చయ్య!'' అన్నాడు వాలి.

''మీరు వెతుకుతున్నది ఇతడికోసమేగా?'' అడిగాడు కేశవన్

''ఇదంతా యితడే చేయిస్తున్నాడని అనుకున్నాను. ఇతడికి బాస్ మరెవరో వున్నారని ఇప్పుడే తెల్సుకున్నాను,'' అన్నాడు వాలి

వాలి పెద్ద అంగల్లో తనకారువైపు నడిచాడు. ''నాకు పనుంది వస్తాను'' అని వాలి కారును పోనిచ్చాడు. వాలి కారువెనకనే గిరి కారు దూసుకుపోయింది.

*   *   *

## 17

హోటల్ పారడైజ్ కాంపౌండ్‌లో వాలి కారాపి దిగాడు. గిరి అతడివైపు పరుగెత్తుకొచ్చాడు.

వాలి మౌనంగా ముందు హాల్లోకి వెళ్ళాడు. రిసెప్షన్ కౌంటరు ముందు కెళ్ళి, ఏదో కనుక్కొని, అతడు లిఫ్ట్‌వైపు నడిచాడు.

ఇద్దరూ లిఫ్ట్‌లో ఎనిమిదో అంతస్తుకు చేరుకున్నారు. అందంగావున్న రూఫ్ గార్డెన్‌వైపు వాలి హుషారుగా చూశాడు చల్లటి గాలి కెరటాలు చర్మాన్ని తాకుతున్నాయి.

రూఫ్ గార్డెన్ కుడివైపున నాలుగు గదులున్నాయి. మూసివున్న తలుపు ముందు వాలి ఆగాడు. లైట్లు వెలగడంలేదు. చుట్టూ ప్రశాంతంగా వుంది. వాలి తలుపుమీద వేళ్ళతో తట్టాడు. జవాబు లేదు. మళ్ళీ తట్టాడు – తలుపు తెరవబడింది.

తలుపు తెరిచిన అనూరాధ లోపలకు పరుగెత్తింది విశాలమైన హాల్లో ఫ్లోరసెంట్ దీపాలు వెలుగుతున్నాయి.

వాలి, గిరి లోపలకు వెళ్ళారు.

టీపాయి మీద సిరంజి వుంది. మోర్ఫిన్ వైయాల్స్ పక్కనే వున్నాయి. ఒక వయాల్ పగిలివుంది.

ఆమెకేసి వాలి సూటిగా చూశాడు.

"అమ్మాయ్! నువ్వు డ్రగ్ ఎడిక్ట్‌వని నే ననుకోలేదు," అన్నాడు వాలి.

ఆమె అతడివైపు చూసి పకపక నవ్వింది.

"నే నిక్కడ వున్నానని మీరెలా అనుకున్నారు ?" అందామె

"నీ బాడీగార్డుగా నేను నియమించిన వ్యక్తి ఎప్పటికప్పుడు వార్తలు నా కందిస్తున్నాడు," అన్నాడు వాలి.

"డర్టీ స్నీక్ శేఖర్!" అందామె.

శరీరంలోకి ఇంజక్ట్ చేసుకున్న మోర్ఫిన్ ప్రభావం మూలంగా ఆమె గెంతుతోంది, కిలకిల నవ్వుతోంది.

"హోటల్ పారడైజ్ నీదని నాకు తెలుసు! నీ మొదటిభర్త మూగివాడు కాదు, అతడు బుచ్చయ్యని నాకు తెలుసు! అతడితో ఎక్కువగా మాట్లాడే అవకాశం లేకుండా నీ మనిషి బుచ్చయ్యను షూట్ చేసి చంపాడు!"

ఆమె ఆశ్చర్యపోలేదు గబగబా టీపాయ్ దగ్గర కెళ్ళి సిరంజిని అందుకోబోయింది. వాలి ఆమె చెయ్యిని పట్టుకున్నాడు.

"లీవ్ మి!" అర్చిందామె.

ఆమెను తీసుకెళ్ళి సోఫాలో కూర్చోబెట్టాడు.

అబద్ధాలు చెప్పి నా అనుమానాన్ని బుచ్చయ్య మీదకు పంపావు ! ఇదంతా చేయించేది నువ్వని యిప్పుడు తెలిసింది!"

ఆమె వాలివంక హేళనగా చూసింది.

"ఏం తెలిసింది మీకు ?"

"నువ్వొక రాక్షసివి. నీకు ధనదాహం ఎక్కువ. పెళ్ళాడిన బుచ్చయ్యను వదిలి పారిపోయావు. డబ్బుకోసం మోహనరాజుని పెళ్ళాడావు. బుచ్చయ్య నిన్ను వెతుక్కుంటూ నీ ఇంటికొచ్చాడు. అతడిని బానిసగా చేసి, సంపూర్ణంగా పాడుచేశావు తను చెడ్డ కోతి అందర్నీ చెరిపిందనే సామెత నిజమని నిరూపించావు! మత్తుద్రవాలను తమిళనాడు రాష్ట్రానికి స్మగుల్ చేయిస్తున్నావు! అందుకోసం గోల్డెన్ లారీ సర్వీస్‌ను కొన్నావు! నీ రెండో భర్త మోహనరాజును నువ్వే చంపి వుండొచ్చు!" గర్జించాడు వాలి.

"నా భర్తను బుచ్చయ్య చంపాడు, నేను కాదు!" అందామె

"నీ ప్రేరేపణవలన, నువ్వు ప్రోత్సహించడం మూలంగా అతడు హతమార్చి వుండొచ్చు. అసలు హంతకురాలవు నువ్వే !''

ఆమె మాట్లాడలేదు వాలి వెనక్కి తిరిగాడు.

"గిరీ, ఇన్‌స్పెక్టర్ కేశవన్ని యిక్కడకు రమ్మను" అన్నాడు వాలి.

గదిలోవున్న ఫోన్‌వైపు నడిచాడు గిరి. ఆమె హఠాత్తుగా లేచింది. వాలి ఆమెకేసి చూశాడు.

"బాత్‌రూమ్‌కోకి వెళ్తాను,'' అందామె.

వాలి ఆమెను సోదా చేశాడు రహస్యంగా ఆమె దాచుకున్న పిస్తల్ని తీసి, జేబులో పడేసుకున్నాడు.

"ఇప్పుడు వెళ్ళు'' అన్నాడు వాలి

''యూ ఆర్ డేంజరస్ మేన్!" అందామె.

"మంచివాళ్ళకు నానుంచి ప్రమాదం లేదు. నీలాటి చెడ్డవాళ్ళకు నేను సింహస్వప్నంగా పరిణమిస్తాను," అన్నాడు వాలి గంభీరంగా.

* * *

## 18

పడక కుర్చీలో కూర్చున్న వాలి ఎదురుగావున్న ఐ.జి. అకిలన్‌వైపు చూశాడు

"వాలిగారూ! అనూరాధ పోలీస్ లాకప్‌లో వుంది. హోటల్ పారడైజ్‌లో లైసెన్స్ లేకుండా నడుపుతూన్న బార్‌రూమ్‌ని సీల్ చేశాం. హోటల్ బేస్‌మెంటులో కొన్ని గదులున్నాయి. ఆ గదులనిండా విస్కీ, బ్రాందీ, రమ్, బీర్ బాటిల్సు వున్నాయి. ఆ స్టాకు ఖరీదు లక్షల్లో వుంటుంది. ఆమె సహచరులైన జాన్, మస్తాన్, మీనన్, కామత్‌లను అరెస్టు చేశాం. పెద్దపెట్టున ఈ రాష్ట్రంలోకి మత్తుద్రవాలను స్మగుల్‌చేసే సంస్థ పూర్తిగా ధ్వంసమైంది. ఇటుపైన ఇక్కడ ప్రొహిబిషన్ విజయవంతమవుతుందని నా నమ్మకం," అన్నాడు ఐ. జి.

వాలి తీయగా నవ్వాడు.

"ఆటలన్ ఖాయ్! మీ పోలీస్ ఉద్యోగులు నాతో అన్నివిధాలా సహకరించారు. వాళ్ళకు నా ధన్యవాదాలు," అన్నాడు వాలి.

గిరి హుషారుగా గదిలో కొచ్చాడు.

"వాలిగారూ, గది బయట ప్రెస్ విలేఖర్లు, ఫోటోగ్రాఫర్లు గుమిగూడారు. టెలివిజన్ యూనిట్ కూడా సిద్ధంగా వుంది," అన్నాడు గిరి.

నవ్వుతూ వాలి కుర్చీలోంచి లేచాడు. నోట్లోవున్న చుట్ట వెలుగుతోంది. పొగ గాలిలో పైకి లేస్తోంది.

"ఈ జీవితంలో విలేఖర్లు, ఫోటోగ్రాఫర్లు వదిలేటట్లులేరు;" అన్నాడు వాలి మందహాసంతో.

టెలిఫోన్ మ్రోగింది. వాలి రిసీవర్ని అందుకున్నాడు.

"వాలి హియర్" అన్నాడు.

"వాలిగారూ! కరుణాకరన్ మాట్లాడుతూంట. ఇప్పుడే నాకు రిపోర్ట్ వచ్చింది. చాలా పెద్ద బూట్‌లెగ్గింగ్ సంస్థను పూర్తిగా నాశనం చేసినందుకు మిమ్మల్ని అభినందిస్తున్నాను," అన్నాడతను.

"కరుణాకరన్ ఖాయ్! నాతో అనేకులు యిందుకోసం పాటుపడ్డారు నీ అభినందనలు వాళ్ళందరికీ ఆనందాన్ని యిస్తాయి," అన్నాడు వాలి.

"రేపు రాత్రి తాజ్ కోరమెండల్లో డిన్నర్ పార్టీ మీకూ, మీ అసిస్టెంట్ గిరికీ ఆరేంజి చేస్తున్నాను. పురప్రముఖు లందరూ ఆ పార్టీకి రానున్నారు. మీరు ఎనిమిదింటికల్లా అక్కడ వుండాలి."

"సరిగ్గా ఎనిమిదింటికి అక్కడుంటాను. ఎవరి వాచీలైనా ఎనిమిది దాటినట్లు చూపిస్తే వాళ్ళు టైము దిద్దుకోవాలి," అన్నాడు వాలి మందహాసంతో.

— — —

# వడిగాడు వాన సిరా



## చెళ్లూరి సీతా రాజేశ్వరరావు

(గత సంచిక తరువాయి)

అరవై నిండినా ఇంకా సమస్యల వలయంలో వున్నాడు. ఈ సాలెగూడు నుంచి తప్పించుకుని పారిపోయే అదృష్టం తనకి లేదు.

వాసుదేవరావులా అందివచ్చిన కొడుకున్నాడుతనకి కాని తను ప్రాక్టీసు ట్రాన్స్‌ఫర్ చేయలేదు. మా వయ్యాలి తప్పు.

శ్రీపతి రోగిష్టివాడు. వాడికి మూర్ఛల జబ్బు ఉంది. వాడి అనారోగ్యం తనకి పజిలయింది ఎంత ఖర్చు పెట్టినా రోగం తగ్గడంలేదు. ఒక్క కొడుకయినందుకు ఏ ముచ్చటా తీరలేదు తనకి వాడివల్ల.

ఫంక్షనకి వెళ్ళబుద్ధికాలేదు. కాని ఆ రోజు దివారమయింది. ముఖ్యమైన కేసు ఉందని చెప్పడానికి లేదు.

కారణాలు వెతుకుతున్నాడు.

శనివారం సాయంత్రం దూరపు బంధువు పోయినట్లు ఉత్తరం వచ్చింది.

ఆదివారం ఉదయం భార్యతో బయలుదేరాడు. తనంతట తాను అంత ముఖ్యంకాని పరామర్శకి భర్త బయలు దేరడం కామేశ్వరమ్మకి ఆశ్చర్యంగా వుంది.

పరామర్శ ముగించుకుని సాయంత్రం ఇంటికి తిరిగివస్తూండగా మధ్యలో కారు ఆగిపోయింది. డ్రయివర్ అరగంట తంటాలుపడి "లాభంలేదండీ ...... మెకానిక్‌ని పిలిపించాలి," అన్నాడు.

"వెళ్ళి తీసుకురా."

పోలయ్య లారీ ఆపి ఎక్కాడు.

సాయంత్ర మయింది. ఎండ పూర్తిగా తగ్గిపోయింది. పతంజలి, కామేశ్వరమ్మ దగ్గర్లోవున్న పాక హోటల్లో కూర్చున్నారు.

హోటల్ చిన్నదైనా శుభ్రంగా వుంది. నాలుగువైపులా సినిమా బొమ్మలు అంటించారు. ప్రొప్రయిటర్ శారుడబ్బాలా ఉన్నాడు. పతంజలి వద్దంటున్నా వినకుండా బ్రూ కలుపుకు వచ్చాడు. పతంజలితో రాజకీయాలు ప్రారంభించాడు.

ఇదంతా కామేశ్వరమ్మకి విసుగ్గా ఉంది.

"షావుకారూ టీ చెయ్యవోయ్." ఓ యాభై ఏళ్ళ ఆసామీ లోపలికి వచ్చాడు.

"అత్యవసరపరిస్థితిని ఎత్తివేయ కూడదంటాను" షావుకారు గట్టిగా బల్లగుద్దాడు. పతంజలి ప్రోత్సాహంగా మాట్లాడటంతో విజృంభించాడు.

"షావుకారూ !" వచ్చిన ఆసామీ విసుక్కున్నాడు

"మంచి బిగిలో ఉన్నప్పుడు వచ్చా వయ్యా పంతులూ......" షావుకారు గ్లాసులో పంచదార వేసి లోపలి కెళ్ళాడు.

వచ్చిన వ్యక్తిని చూపెడుతూ "సుబ్బారాయుడిలా లేడండీ ?" అంది కామేశ్వరమ్మ.

"నేను చూడేలేదు...సుబ్బారాయుడే"

పతంజలి పిలిచేలోపుగా అతడే దగ్గరికి వచ్చాడు. "మీరా బాబుగారూ... బాగున్నారా అమ్మా ?"

"ఏమిటలా అయిపోయావ్ సుబ్బయ్యా ?" కామేశ్వరమ్మ అడిగింది.

"రోజులు బాగాలేవమ్మా...ఏదో బ్రతికేస్తున్నాను." వెర్రిగా నవ్వాడు.

సుబ్బారాయుడు యిరవై యేళ్ళ పాటు పతంజలి దగ్గర గుమస్తాగా పని చేశాడు. కొడుక్కి ఉద్యోగం రాగానే మానేసి వెళ్ళిపోయాడు.

గ్యాస్ పొయ్యి యాక్సిడెంటులో కోడలు మరణించింది. ఆ షాక్‌తో కొడుకు పిచ్చివాడయ్యాడు. ఆ పిచ్చి లోనే నూతిలోకి దుమికి మరణించాడు.

సుబ్బారాయుడి జీవితం చీకటి గుహ అయిపోయింది. ఈ దండ

యాత్రలవల్ల అతడి ఆరోగ్యం దెబ్బ తింది. ఏనుగులాంటి మనిషి పీను గయ్యాడు

జరిగినదంతా తెల్సుకుని కామేశ్వ రమ్మ విచారించింది. "తట్టుకోవాలి సుబ్బయ్యా ... పిరికిగా పారిపో కూడదు."

సుబ్బారాయుడు యింటికి రమ్మని కోరాడు.

"కారు వదలి రావడం ఎలా ?" అన్నాడు పతంజలి. వెళ్ళడానికి అతడికి ఇష్టంలేదు. క్రింది స్థాయి మనుషులతో సన్నిహితంగా వుండటం అతడికిష్ట ముండదు

"మీ కారు నేను చూస్తానండయ్య గారూ," అన్నాడు షావుకారు

"నడవండి ... అత నంతగా చెబు తూంటే." కామేశ్వరమ్మ లేచింది. ఆ యిరుకు హోటల్లో కూర్చోవడం మెకి నచ్చ లేదు. పతంజలి అయిష్టంగా లేచాడు

మెయిన్‌రోడ్ దిగి ఎదురుగా వున్న సందులోకి దారితీశాడు సుబ్బారాయుడు. రోడ్డ తా కూలీలతో సందడిగా వుంది. కొత్తగా రోడ్డు వేస్తున్నారు. రోలర్ తిరుగుతోంది కామేశ్వరమ్మ స్థూలం మనిషి. ఈ రోడ్డుమీద నడవటం ప్రయాసగానే వుంది.

"జాగ్రత్తమ్మా ..." సుబ్బా రాయుడు హెచ్చరిస్తున్నాడు.

కోవెల ప్రక్కనున్న పాతయింటికి దారితీశాడు సుబ్బారాయుడు. నీరెండలు ఆ యింటిమీద పడి మెరుస్తున్నాయి. కోవెలనుంచి గంటలు వినవస్తున్నాయి.

ఆ యిల్లు ఏ క్షణమయినా పడిపోయే టట్లు వుంది. మట్టి అరుగులనిండా దూలాలు, డొక్కలు వున్నాయి. గోడలు నల్లబడి వున్నాయి.

ఇంటి ముందు ఒత్తుగా గడ్డి మొలిచి వుంది.

"జయా!" సుబ్బారాయుడు తలుపు కొట్టాడు.

ఇందులో ఎలా కాపురం చేస్తున్నారా అనిపించింది పతంజలికి.

ఇరవైయేళ్ళ అమ్మాయి తలుపు తీసింది. కొత్తవాళ్ళని పోల్చుకోడానికి ప్రయత్నించింది. సుబ్బారాయుడు పెరట్లో జామచెట్టు క్రింద మంచం వాల్చాడు.

"కాఫీ పెట్టమ్మా..." కూతుర్ని ఆదేశించాడు.

కామేశ్వరమ్మ వారిస్తూ "ఇప్పుడు కాఫీ ఎందుకయ్యా...అలాంటి ప్రయ త్నాలు చెయ్యకు జయా" అంది.

"మా యింటికి వచ్చి ఏమీ తీసు కోరా ఏమిటి? ... కారు బాగయ్యేసరికి ఏ టయిమవుతుందో...కనీసం భోజన మైనా చేసి వెళ్ళాలి."

"ఆ పిల్లని శ్రమపెట్టడం ఎందు కయ్యా" అన్నాడు పతంజలి. సంసారం




పరిస్థితి చూడగానే తెలుస్తోంది. ఇటు వంటి దశలో మర్యాద కోసం అతిథుల్ని భరించడం మాటలా!

"శ్రమేముందండి..." కూతుర్ని వండమన్నట్లుచూశాడుసుబ్బారాయుడు.

కామేశ్వరమ్మకూడా జయతోలోపలికి వెళ్ళింది.

పతంజలి మంచంమీద మోచేతుల మీద పడుకని "మరిప్పుడేం చేస్తున్నావ్? అమ్మాయి పెళ్ళి చెయ్యలేదా?" అని అడిగాడు.

సుబ్బారాయుడు మంచం దగ్గరగా తులసమ్మ గట్టుమీద కూర్చున్నాడు. ప్లీడరుగారు తన యోగక్షేమాలు అడగటం అతడికి సంతోషం వేసింది. "ఏం చెయ్యమంటారు చెప్పండి? గట్టిగా పనిచేస్తే మంచం ఎక్కవలసి వస్తోంది ఇంటిదగ్గరే కూర్చుని నాలుగు ప్రయివేట్లు చెప్పుకుంటున్నాను. వూరు మంచిది కనుక ఏదో జరిగిపోతున్నది. ఇక జయ పెళ్ళంటారా? అది నా చేతుల్లోలేదు. రూపాయలుపోసి దానికి మొగుడ్ని కొనలేను."

పతంజలి మాట్లాడలేదు. ఇంకా వాగిస్తే జయ పెళ్ళికి సాయం చెయ్యమంటాడేమోనని భయపడ్డాడు. పతంజలి డబ్బు దగ్గర చాలా లోభి. దరిద్రం నుంచి పైకి వెళ్ళాడేమో దరిద్రమంటే భయం.

తాతాఖానీ జరుగుతుండగా భోజనానికి పిలుపు వచ్చింది.

జయ వంట అద్భుతమని పతంజలి మెచ్చుకున్నాడు

భోజనాలవగానే పతంజలి బయలుదేరదామన్నాడు. డ్రయివరు వచ్చాడో

లేదో నని చూసివస్తానన్నాడు సుబ్బారాయుడు.

జయ భోజనానికి కూర్చోగానే కామేశ్వరమ్మ భర్త దగ్గరకి వచ్చింది. పతంజలి పాత దీపావళి యువ చదువుతున్నాడు.

"జయని చూడగానే ఏమనిపిస్తోంది?" భర్తని అడిగింది.

"సుబ్బారాయుడి కూతురని పిస్తోంది" పతంజలి జవాబిచ్చాడు.

"నాకు మాత్రం కోడలు చేసుకోవాలనిపిస్తోంది ఎంత అణకువ, ఎంత నెమ్మది. ముత్యంలాంటి పిల్ల."

"చాలా ఆశ వుందే?"

"సుబ్బారాయుణ్ని అడగండి. కాదనడు."

"శ్రీపతికి పిల్లనిస్తాడా? వాడి రోగం సంగతి తెలియదా?"

"అన్నీ మీరే మాట్లాడతారు." కామేశ్వరమ్మ విసుక్కుంది. మన స్థాయిలో ఎవరూ యివ్వకపోవచ్చు. సుబ్బారాయుడులాంటి దరిద్రుడు కళ్ళు మూసుకుని యిస్తాడు పెళ్ళయితే కోడలు వచ్చినవేళ వాడు మనిషే అవుతాడేమో."

చివరి మాటల్లో తల్లి ఆశ స్పష్టంగా వినిపించింది.

విద్య పెళ్ళయినప్పట్నుంచి శ్రీపతి పెళ్ళి విషయం పతంజల్లో మెదులుతోంది. కాని సంబంధం వెతకడానికి సిగ్గుగా వుంది.

పెళ్ళయితే శ్రీపతి రోగం తగ్గవచ్చునని కొంతమంది డాక్టర్లు చెప్పారు. ఆ ఆశ తనకి వుంది. అడిగితే సుబ్బారాయుడేమంటాడో?

"ఆ ముచ్చటా తీర్చుకుందాం."

కామేశ్వరమ్మ ముఖంలో ఆనందం తొంగిచూసింది.

"సుబ్బారాయుడికి ఏదయినా ఆశ చూపించండి."

"అవన్నీ నువ్వు చెప్పాలా?"

ఆడపిల్ల పెళ్ళి నిప్పుల గుండంతో మధ్యతరగతి మనిషి పోల్చుకుంటున్నపుడు వీలైనంత తొందరగా ఆ బాధ నుంచి విముక్తి కావాలని కోరుకుంటాడు.

పైవాళ్ళు అంతస్థు నిలబెట్టుకోవడానికి, మధ్యవాడు మిథ్యా గౌరవాన్ని కాపాడుకోడానికి, క్రిందివాడు ఆకల్ని తప్పించుకోడానికి నిత్యం కాలంతో కుస్తీ పడుతూంటారు.

పతంజలి చెప్పగానే సుబ్బారాయుడు ఎగిరి గంతేశాడు "అంత అదృష్టమా మాకు" అన్నాడు. అడవిలో దారితప్పి తిరుగుతూండగా తారురోడ్డు కనిపించిన వాడిలా సంబరపడ్డాడు.

"అదృష్టం మాది." పతంజలి కొన్ని డిగ్రీలు క్రిందకి దిగిపోయాడు. కొడుకు అనారోగ్యం అహాన్ని కరిగించి వేసింది.

"..............."

"శ్రీపతి రోగిష్టివాడని నీకు తెల్సుగా

రాయుడూ... పెళ్ళయితే దారిలో పడ తాడని ఆశ. ఇందులో బలవంతం ఏమీ లేదు. అనక ఏం జరిగినా నువ్వు బాధపడకూడదు." కామేశ్వరమ్మ హెచ్చరించింది.

"అబ్బాయి బాగుపడతాడమ్మా." సుబ్బారాయుడు జోస్యం చెప్పాడు.

"అమ్మాయిని కూడా కనుక్కో." పతంజలి చెప్పాడు.

"దాని ముఖం దాన్ని అడిగే దేముందండీ?"

"అడిగి చూడవయ్యా" కామేశ్వ రమ్మకి యింకా సంశయం తొలగి పోలేదు. శ్రీపతి రోగిష్టివాడని కాదంటుందేమో!

కూతుర్ని కేకేశాడు సుబ్బారాయుడు తలవని తలంపుగా కూతురు పెళ్ళి కుదరడం అతడికి ఆనందంగా వుంది. ఏ వంకా లేకపోతే పతంజలి కోరి తనతో వియ్యమొందుతాడా? అసలు తను పెళ్ళిచేసే స్థితిలో వున్నాడా? అసలే తను రోగిష్టివాడు. తను దాటి పోతే జయ బ్రతుకు ఏమవుతుంది? ఎవరాదరిస్తారు? మంచికో చెడ్డకో పెళ్ళి జరిగిపోతే చాలు. తన భారం వదులు తుంది. ఇక దాని అదృష్టమెలావుంటే అలా జరుగుతుంది.

జయ వచ్చింది ఎవరూ అడక్కుం డానే ఆమెకి తెల్సిపోయింది. వీరి సంభాషణ వంటింటిలోకి వినిపిస్తోంది. కామేశ్వరమ్మ అడగ్గానే నేలచూస్తూ నించుంది.

"అదో వెర్రి మాలోకమండి. యింత అదృష్టం వస్తూంటే ఏం చెబుతుంది?"

చివరికి యిష్టమేనని తల ఆడించింది. పల్లెటూరులో చదువులకి నాగరికతకి దూరంగా వుండే మధ్యతరగతి ఆడపిల్ల అంతకంటే ఏం చెబుతుంది.

కామేశ్వరమ్మ బాధంతా తొలగి పోయింది. మెడలోనుంచి గొలుసు తీసి కోడలి మెడలో వేసింది.

పతంజలి దంపతులు సంతోషంగా ప్రయాణమయ్యారు.

"లగ్నం చూసి రాస్తాను. మీ రిద్దరూ బయలుదేరి వచ్చెయ్యండి. కారు పంపిస్తాను. పెళ్ళి గురించి మీరేం ఖర్చుపెట్టవద్దు." పతంజలి కారెక్కి చెప్పాడు.

మర్నాడు ప్రొద్దుట కాఫీ సమయంలో చెప్పింది శ్రీపతితో.

"నాకు పెళ్ళెందుకమ్మా?"

"అదేమిట్రా!"

"నా రోగానికి ఆ పిల్లకూడ బాధ పడాలా?"

"చాల్లే ... నయమవుతుంది. నాకు నమ్మకంగా వుంది."

"మన ఆశకోసం మరి ఒకర్ని బలి చేస్తావన్నమాట."

"ఈ పెళ్ళికి ఆ పిల్ల అంగీక రించింది."

"దరిద్రం అలా చేయించి వుంటుంది."

"నా కిష్టం లేదమ్మా."

"మమ్మల్ని యిలాగే ఏడిపిస్తావు మాట."

శ్రీపతి తల్లి కన్నీరు చూసి కరిగి పోయాడు.

నెలరోజుల్లో పెళ్ళి జరిగిపోయింది.

పెళ్ళి 'సమస్య'గా భావించే రెండు పక్షాలవారు నిట్టూర్పు విడిచారు. తేలిక పడ్డారు. బరువు దింపుకున్న శ్రామికుడిలా ఆనంది చారు.

పెళ్ళి జరిగిన సాయంత్రం భార్యతో తోటలో కూర్చున్నాడు శ్రీపతి. చల్లటి గాలి వీస్తున్నది. సంధ్య వెలుగులతో తోట అందంగా వుంది.

గులాబీరంగు జరీ అంచు పట్టు చీరలో జయ ముగ్గులుపెట్టిన తులసి కోటలా వుంది. పెళ్ళి అలంకరణతో ఆమె లావణ్యం భాద్రపద మాసం నదిలా నిండుగా వుంది.

జయ నడుం చుట్టూ చేతులువేసి దగ్గరకి లాక్కున్నాడు. మెత్తటి ఆమె వక్షం లోగిలి శ్రీపతి ముద్దుపెట్టు కున్నాడు.

"ఎవరయినా చూస్తారు..." జయ సిగ్గుపడి దూరంగా జరిగింది.

"చూడకపోతే ఫర్లేదా?"

జయ మందహాసం చేసింది.

పెళ్ళయినా శ్రీపతికి సందేహం పోలేదు. జయ తనని యిష్టపడి వేసు కుందా? ఎవరయినా బలవంతం చేశారా?

"ఈ పెళ్ళికి నువ్వెందుకు అంగీక రించావ్ జయా?"

జయ విత్తాకు పడింది.

"చెప్పు." ఆమె చేతుల గలగలలు వింటూ అడిగాడు.

"మీ రెందుకు అంగీకరించారు ?" జయ ఎదురు ప్రశ్నించింది.

"నన్ను బలవంతం చేశారు."

"పరిస్థితి నన్ను బలవంతం చేసింది."

"నాకున్న జబ్బు నీకు తెల్సా ?" బేలగా, భయంగా అడిగాడు.

"మీరు భయపడకండి. తగ్గిపోతుంది. అతడి పక్షం రాస్తూ ధైర్యం చెప్పింది. నిన్నటిదాకా యిద్దరూ అపరిచితులైనా, వివాహబంధం నేడు బాంధవ్యాన్ని కలిపింది. జీవితాంతం ఒకరికోసం మరొకరు, ఒకరివలన మరొకరు, ఒకరినుండి మరొకరు చీకటి వెలుగులు పంచుకోవాలి

"నీకు నమ్మకముందా ?"

జయ తలూపింది.

"శ్రీపతి ఆమె ఒడిలో తలపెట్టు కొని విశ్రాంతిగా పడుకున్నాడు.

రోజులు గడిచిపోతున్నాయి.

పెళ్ళి జరిగిన తర్వాత ఆ వ్యక్తులలో కలిగిన మార్పు :

కామేశ్వరి : వేసవి మధ్యాహ్నం

చల్లటి పానీయం త్రాగినట్లయింది. ఇన్నాళ్ళూ కొడుకు ఆరోగ్యానికి బాధ పడుతూ సేవలుచేస్తూ వచ్చింది. జయ రావడం అమెకి కాస్త రిలీఫ్‌గా వుంది. శ్రీపతి కొడుకుకంటె జయ భర్తగా కనిపిస్తున్నాడు మానసికంగా ఆ భావం రావడం ఆరాటాన్ని తగ్గించింది.

పతంజలి : జయ మనస్ఫూర్తిగా శ్రీపతికి సేవచేయడం తృప్తి నిచ్చింది. కేవలం డబ్బుకి ఆశపడిన పిల్ల తమ కుటుంబంలో కల్లోలం రేపకుండా వుంటుందా అని ముందర భయపడ్డాడు జయ ఇంట్లో పిల్లలా కలిసిపోయింది.

సుబ్బారాయుడు : "అమ్మాయి కింకా పెళ్ళి చెయ్యవూ ?" అన్న ప్రశ్న నుంచి తప్పుకున్నాడు. ప్రయత్నం లేకుండా మంచి సంబంధం కుదిరింది. ఇది జయ అదృష్టం. పతంజలి తమతో వుండమని బలవంత పెట్టినా బాగోదని తనింటికి వెళ్ళిపోయాడు. అయినా ఇదివరకులా రోజు గడుస్తుందా అనిబాధ పడక్కర్లేదు. వస్తుతారీక్కి పతంజలి దగ్గరనుంచి రెండువందలు మనియార్డరు వస్తుంది.

శ్రీపతి : చిన్నప్పటినుంచీ అనారోగ్యంవల్ల తల్లో, తండ్రో, చెల్లెలో కాపలా వుండటంవల్ల ఖైదీననే భావం మొలకెత్తింది. ఏ మార్పూలేని రోజులు. బాధలు, మందులు, డాక్టర్లతో విసిగి పోయాడు. జయ రాకతో రోహిణిలో పగిలిన భూమికి తొలకరివానలా వుంది. ఈ కొత్త మలుపు శ్రీపతికి సుఖంగా వుంది.

జయ : ఆకలి కేకల్నుంచి అంతస్థు ఎక్కింది కామేశ్వరమ్మ కోడలయింది. ప్రాథమిక సమస్యలకి యిక సెలవు. డబ్బు, నగలు అనుభవంలోకి వచ్చాయి. 'సుఖపడ్డాను' అనుకుంది పెళ్ళిరోజున. 'సుఖపడాలి' అనుకుంది మర్నాడు. 'ఇది సుఖమా ?' అని వెలవెలపోయింది తర్వాత. అందని సుఖాలని మరచిపోయి అందినవాటితో తృప్తిపడటం నేర్చు కుంది.

నలుగురికి మేలు జరిగే పనిలో నైతికంగా తప్పున్నా 'త్యాగం' ముసుగులో ఒప్పుగా చలామణీ అయి పోతుంది. స్వార్థాల నివృత్తి సరిసమా నంగా వుండే మమకారాలు మరింత వికసిస్తాయి.

పున్నమిరోజు.

జగమంతా వెన్నెలతో తడిసి పోతున్నది. ప్రకృతి చందమామ కాంతుల్లో వింతగా మెరిసిపోతున్నది. శ్రీపతి డాబామీద ఫోంబెడ్ మీద పడుకుని వెండిజరీలా మెరిసిపోతున్న గోదావరి అందాలని గమనిస్తున్నాడు.

"ఇదిగో మందు తీసుకోండి." జయ తట్టి పిలిచింది.

శ్రీపతి తృళ్ళిపడ్డాడు.

జయ మందుగ్లాసు నోటిదగ్గర పెట్టింది.

భార్య జడలోని మల్లెల సువాసన పీలుస్తూ "ఎప్పుడూ మందేనా ?" అన్నాడు.

"త్రాగాల్సిందే..." జయ ప్రక్కన కూర్చుని మందు నోట్లో పోసింది.

"ఈ చేదుమందు త్రాగినందుకు తియ్యటి ముద్దు యివ్వాల్సిందే."

"లంచాల్ని రద్దుచేశాం."

"లాభంలేదు." శ్రీపతి ఆమెని మీదకి లాక్కున్నాడు. వెన్నెలలోని ఏకాంతం కోరికల్ని రెచ్చగొడుతోంది. మెత్తటి జయ స్పర్శ అనుభూతి రేపుతోంది శ్రీపతిలో.

జయ విడిపించుకుని కుర్చీలో కూర్చుంది. ఆపిల్ తీసి ముక్కలు చేస్తూ "రోజుకి రెండు పళ్ళు తినమన్నాడు డాక్టరు. మీరు ఒక్కటి గూడ తినడంలేదు" అంది నిష్ఠూరంగా.

"నేను పుట్టినప్పట్నుంచి వాటిని తింటూనే వున్నాను." శ్రీపతి ఆమెకేసి వంగాడు.

"మీరు బుద్ధిగా కూర్చోకపోతే క్రిందకి వెళ్ళిపోతాను."

"ప్లీజ్ జయా..." ఆమె చేతిలోని చాకు అందుకున్నాడు. స్టీలు చాకు పదును వెన్నెలలో మెరిసిపోతున్నది. ఈ చాకుని దూరంగా చూసి సంతోషించవల్సిందే. ముద్దుపెట్టుకుందే మూతి తెగుతుంది. శ్రీపతి భారంగా నిట్టూర్పు విడిచాడు.

"ఎన్నాళ్ళు జయా......"

సమాధానం ఆమె కేం తెలుసు ?

కాలం చెప్పాల్సిందే.

"ప్రొద్దుపోయింది, పడుకోండి."

మమతాబద్ధమైన ఆజ్ఞ ధిక్కరించలేక పోయాడు. జయ దుప్పటి కప్పింది నిండుగా. జయ లాలింపుతో అతడికి నిద్ర ముంచుకువచ్చింది.

జయ ఒంటరిగా మిగిలిపోయింది. వెన్నెలక్రింద. వెన్నెలలోని ఏకాంతంలో తియ్యగా కరిగిపోవల్సిన కాలం బరువుగా నడుస్తోంది.

చేదు మాత్రలా వుంది.

జయకి నిద్రపట్టలేదు.

భర్తకేసి చూసింది. అతడు గాఢంగా నిద్రపోతున్నాడు. జయ మనసునిండా అశాంతి వెన్నెలకి పరవశించిన యవ్వనం అలజడి చేస్తోంది. జడలోనుంచి రాలిన పూల దండని విసుగ్గా కాలితో నలిపేసింది.

పిట్టగోడ దగ్గరికి వెళ్ళి నిలబడింది.

ఊరు నిశ్శబ్దంలో నిద్రపోతోంది. ఎక్కడ్నుంచో బ్యాండు వాయిద్యం వినిపిస్తోంది. వెన్నెలరాత్రిలో ఆ వాయిద్యం మధుర తరంగాలు లేపుతోంది.

దాహం వేస్తోంది తనకి. కాని దగ్గరలోఉన్నవి ఉప్పునీళ్ళు. అన్వేషించే

స్వాతంత్ర్యాన్ని సాంఘిక శక్తులు అడ్డగిస్తున్నాయి వివాహ బంధం చుట్టూరా పంజరంలా వుంది. ప్రాప్తించినదే పంచామృత మనుకోవాలి. నిశ్శబ్దమైన వాతావరణంలో తను ఏకాకినన్న భావం కలిగింది. శిధిలమైన కోటలో ఒంటరిగా నిల్చున్న భ్రాంతి. అర్ధరాత్రి ఒంటరిగా అడవిలోవున్న భయం.

అడవికాచిన వెన్నెల తన జీవితం.

శ్రీపతి కెవ్వున అరిచాడు. జయ దగ్గరకి పరుగెత్తింది. శ్రీపతికి ఫిట్ వచ్చింది. జయ క్రిందకివెళ్ళి పతంజలిని, కామేశ్వరమ్మని పిలుచుకువచ్చింది.

ఇల్లంతా హడావిడి

డాక్టరు వచ్చాడు. మందులు గుప్పించాడు. శ్రీపతికి తెలివి వచ్చింది. కాని అది తాత్కాలికం మళ్ళీ వుధృతంగా ఫిట్ వచ్చింది.

ఆ రాత్రి అందరికీ శివరాత్రి అయింది.

కామేశ్వరమ్మ దడతో భయపడిపోయింది.

పెళ్ళివల్ల రోగం ఎక్కువయిందా ?

తెల్లవారిన తర్వాత శ్రీపతికి రిలీఫ్ యిచ్చింది. కాఫీ త్రాగి లేచి కూర్చున్నాడు. అందరి మనసులు శాంతించాయి.

డాక్టరు మళ్ళీ వస్తానని బయలుదేరాడు.

కామేశ్వరమ్మ, పతంజలి ఆయన వెంట బయటికి వచ్చారు చిన్నప్పటి నుంచి ఆయనే శ్రీపతికి వైద్యం చేస్తున్నాడు. ఆయన హస్తవాసిమీద కామేశ్వరమ్మకి నమ్మకముంది.

"ఏం భయంలేదు కదూ......?" కామేశ్వరమ్మ ఆత్రంగా అడిగింది.

"మందులు వేసి ఆపుతామమ్మా. కాని అది పద్ధతి కాదు. ప్రకృతి వైద్యం వల్ల పూర్తిగా నయమవుతుంది. ఈ మధ్య యిద్దరికి అలాగే తగ్గింది."

కామేశ్వరమ్మలో ఆశాదీపం వెలిగింది. "అన్నిటికీ మీదే భారం డాక్టరుగారూ "

"ఏం భయం లేదమ్మా. పతంజలి గారూ ......... తొమ్మిది గంటలకు వచ్చినప్పుడు మీకు ఆ డాక్టరు ఎడ్రస్ ఇస్తాను. ముందర వెళ్ళి తెలుసుకురండి. తర్వాత అబ్బాయిని తీసుకెళదాం."

"అదీ చూద్దాం."

డాక్టరు వెళ్ళాక కామేశ్వరమ్మ దిగాలుగా కూర్చుండిపోయింది. రాత్రి హడావిడితో కొడుకు అందదేమోనన్న భయం పట్టుకుంది. ఆందోళనతో ముఖం నల్లబడిపోయింది.

"సరి సరి...నువ్వు కూడా యిలాగయితే ఎలా ? జయ వసారాలో ఏడుస్తూ కూర్చొంది. ఆ పిల్లకి కాస్త ధైర్యం చెప్పు." భార్యని మందలించాడు పతంజలి.

పతంజలి ఆరోజే వెళ్ళి ప్రకృతి వైద్యం గురించి తెలుసుకువచ్చాడు.

"తగ్గుతుందన్నారా ?" ఆరాటంగా కామేశ్వరమ్మ అడిగింది.

"ఆ కనీసం మూడునెలలు అక్కడ ఉండాలిట. వెంటనే తీసుకురమ్మన్నారు "

తర్వాత శ్రీపతితో ఎవరు వెళ్లాలన్నది ప్రశ్నయింది. కామేశ్వరమ్మ తను వెళతానంది. జయ తానే వెళతానంది.

"మీ అత్తయ్య వెళుతుందిలేమ్మా. నీ వక్కడ సమర్థించలేవు."

పతంజలి మాటతో జయ ఆగిపోయింది.

మర్నాడు మధ్యాహ్నం ప్రయాణం. పతంజలి ప్రయాణం ఏర్పాట్లు చేశాడు. జయ రావడంలేదని తెలిసి శ్రీపతి ఖిన్నుడయ్యాడు

మూడునెలలు జయకి దూరంగా వుండటమా ? జయని కూడా తీసుకు రమ్మని తల్లితో చెప్పాడు.

"అప్పుడే పెళ్ళాం బెల్లం అయిందిరా ?" కామేశ్వరమ్మ నవ్వింది.

శ్రీపతి సిగ్గుతో జయ దగ్గరికి పారిపోయాడు.

"నువ్వు రావూ జయా ?" బట్టలు సర్దుతున్న ఆమెవైపు వెనకగా వెళ్ళి భుజాలు పట్టి మార్దవంగా అడిగాడు.

జయ బాధని దిగమింగుకుంటూ నవ్వింది. "మీరు నా మాట వింటారూ ?"

"ఎందుకు విననను ... సరస్వతీదేవి తోడు......"

జయ బిగ్గరగా నవ్వింది.

"నీ కసలు రావాలనిలేదు." కోపం నటించాడు.

"మామయ్యగారి ఆజ్ఞ అది. ముందర మీ అమ్మగారిని రానివ్వండి. తర్వాత నేను వస్తాను."

"నిజం ?"

"రెండ్రోజులకైనా ఉత్తరం రాస్తూండాలి సుమా."

జయ అంగీకరించింది.

బయటి నుంచి పతంజలి కేక వినిపించింది.

రెండు నెలలు గడిచిపోయాయి. శ్రీపతి ఆరోగ్యం క్రమంగా బాగుపడుతోంది. వారానికి రెండుసార్లు పతంజలి వెళ్ళి చూసివచ్చేవాడు. జయ కూడా నాలుగయిదుసార్లు వెళ్ళింది.

"వాడు వచ్చేదాకా మీ నాన్నగారి దగ్గరికి వెళితే వెళ్ళమ్మా."

పతంజలి చెప్పినా జయ ఇష్టపడలేదు. శ్రీపతి ఇంటికి రాకుండా ఆమెకి ఎక్కడికీ వెళ్ళాలనిలేదు. భర్త అనారోగ్యం సంగతి మాత్రం తండ్రికి తెలియపరిచింది.

సుబ్బారాయుడు చూసి వెళ్ళాడు.

పతంజలికి 'కోర్టు' పని ద్వారా ఎప్పుడూ బిజీగానే ఉంటాడు. పుస్తకాలు, రేడియో జయకి కాలక్షేప సాధనా



అయినాయి. నాలుగుగోడల మధ్య ఒంటరిగా కాలక్షేపం చెయ్యడంవిసుగ్గానే వుంది. ఏదయినా సాంస్కృతిక కార్యక్రమాల్లో పాల్గొందామంటే అదేమంత ఎదిగిన పట్టణం కాదు.

ఈ పరిస్థితిలో వచ్చాడు మన్మథరావు, సుబ్బమ్మ కొడుకు. అతడు మిలట్రీలో పనిచేస్తున్నాడు. సెలవుమీద వచ్చాడు.

మన్మథరావు మంచి వక్త. ఎదుటి వార్ని కదలనివ్వకుండా మాట్లాడగలడు

జయ కాస్త రిలీఫ్‌గా వుంది.

శ్రీపతిని ఇంటికి తీసుకురావడానికి పతంజలి వెళ్ళాడు

రెండురోజులయినాపతంజలి రాలేదు.

భర్తకి ఏమయిందో ...... జయకి ఆందోళన

"మీరత్త బంగారు మనిషిలా వున్నారు శ్రీపతిగారికేం కాదు. మీరు

అనవసరంగా భయపడకండి. ప్లీడరుగారు ఏంపనిమీద తిరుగుతున్నారో?" మన్మధ రావు ధైర్యం చెప్పాడు.

"అంతే నంటారా ?"

"ఇంకా సంశయమా ?"

"పోనీ ప్లీడరుగారు వైర్ యివ్వచ్చు కదా ?"

"ఆయన కేసుల్లో పడితే మనం గుర్తుండమండీ."

ఆ రాత్రి భో జ నా లయ్యా క మన్మధరావు హాల్లో కూర్చుని వీణ వాయిస్తున్నాడు. జయ ఆసక్తిగా వింటోంది

కాస్సేపు కూర్చుని నల్లమందు వేసుకుని సుబ్బమ్మ నిద్రకి లేచింది.

అర్ధరాత్రయింది.

"మీరు చాల బాగా వాయిస్తారు." జయ మెచ్చుకుంది.

"మునగచెట్టు ఎక్కించకండి"

జయ కోరికమీద మరో గంట వాయించాడు.

ఒంటిగంటయింది.

కరెంటు పోయింది.

"మీరు పడుకోండి...నే వస్తాను." మన్మధరావు లేచాడు.

"దీపాలు రానివ్వండి ... వెళుదురు గాని." జయ కొవ్వొత్తి వెలిగించింది. ఆ చిరుచీకటి ఆమెకి భయంగా వుంది.

మన్మధరావు వేరేవిధంగా అర్ధం చేసుకున్నాడు. ఆడది అంతకంటె ఏం చెబుతుంది ? ఈ రకం వేటలో తను ఎంతమందిని చూడలేదు ?

జయ దగ్గరగా సోఫాలో కూర్చు న్నాడు. మీదకి వంగి పెదాలు కొరికాడు. ఆమె నివ్వెరపోయింది. లేవబోయింది. మన్మధరావు కౌగిలి బిగించాడు.

"వదలండి...ఏం పనిది..." జయ పెనుగులాడింది.

మన్మధరావు అసహ్యంగా నవ్వాడు. "ఏం పనో చెబుదామనే."

జయ కేకలు వేసింది. పనివాళ్ళు సినిమాకి పోయారు. సుబ్బమ్మకి మెలకువరాదు. మన్మధరావుది పైచెయ్యి అయింది.

చీర లాగేశాడు కసిగా.

"ప్లీజ్, నన్ను వదలండి." సంప్ర దాయం యొక్క తిరుగుబాటిది.

"ఎందుకు చెబుతున్నానో వినరేం?" యవ్వనంయొక్క తొందరపాటిది.

మన్మధరావు ఆవేశంలో ఏమీ లెక్క చేయలేదు. ఆమెని పూర్తిగా ఆక్రమిం చాడు. ముద్దులతో ఆమె శరీరాన్ని నింపేశాడు.

ఇక జయ ప్రతిఘటించలేక పోయింది.

శరీరం కో రి క ల కో సం కలవరిస్తూంది.

రోగి పాలే కోరాడు. వైద్యుడూ పాలే యిచ్చాడు.

ఇంతలో దీపాలు వెలిగాయి. దీపాలతో పతంజలి లోపలికి వచ్చాడు. ఆ స్థితిలో వారిద్దరినీ చూడగానే స్తంభించిపోయాడు.

"జ.........యా"

మన్మథరావు పారిపోయాడు. జయ ఏడుస్తూ వుంది. పతంజలి ఏమీ అనలేదు కేక లెయ్యలేదు.

సీరియస్‌గా పచార్లు చెయ్యసాగాడు.

ఆ మౌనం జయని మరింత క్రోసి పడేస్తోంది.

పతంజలి మేడపైకి వెళుతూ "కుక్కని సింహాసనం ఎక్కించినంత మాత్రాన దాని వెధవగుణం ఎక్కడికి పోతుంది ?" అని మాత్రం అన్నాడు.

జయ మూగబోయింది.

* * *

జరిగినది వెంటనే కొడుక్కి ఉత్తరం రాశాడు. పోస్టు చేశాడు.

పతంజలి ఆలోచనల్నుంచి తేరుకున్నాడు. వర్షం వెలిసింది. ఎండ వచ్చింది. వానమీద ఎండ బంగారంలా మెరిసిపోతున్నది. పతంజలి ఉత్తరాన్ని జేబులో పెట్టుకున్నాడు.

వాచీ ఐదు చూపిస్తోంది. తోటలోకి నడిచాడు. వానకి నేలంతా తేమగా వుంది. వర్షబిందువులు ఎండలో మెరుస్తున్నాయి. గాలికి చెట్లు జల్లుగా చినుకులు రాలుస్తున్నాయి

పతంజలి కాలక్షేపంగా తిరుగుతున్నాడు. కాని మనస్సు తీవ్రంగా ఆలోచిస్తున్నది. కర్తవ్యం ఎదురుగా వుంది. తను ఒక నిర్ణయం తీసుకునే సమయం ఆసన్నమయింది.

అటా ? ఇటా ? అని ఒకర్ని సలహా అడిగే పరిస్థితి కాదు. పూర్వాపరాలు ఆలోచించుకుని తనే నిర్ణయానికి రావాలి. తనే న్యాయాధిపతి న్యాయమూర్తి. సాక్షి.

దైవకృపవల్ల శ్రీపతి మనిషి అయ్యాడు. ఆరోగ్యవంతుడయ్యాడు. ఇక వాడు నిశ్చింతగా జీవితాన్ని అనుభవించగలడు. సంసారాన్ని నడిపించగలడు

బాధ్యతలనుంచి తను రిటైర్ కావచ్చు

ఈ పరిస్థితిలో సర్వస్వం జయేనని భావిస్తూ ఆమెమీద మమతల హరివిల్లు నిర్మించుకున్న శ్రీపతి నిజం తెలుసుకుంటే గిలగిలలాడిపోతాడు. జయ తప్పుచేసింది. వయసు దాన్ని చేయించి వుండవచ్చును. కాని వంశ గౌరవానికి మచ్చ వచ్చింది. ఆమె తప్పుకి తను ఏకైక సాక్షి.

జయ తప్పు వాడికి తెలిస్తే ???

మొదటి దృశ్యం :

శ్రీపతి వచ్చి పదిరోజులయింది. కామేశ్వరమ్మ కొడుకు - కోడలుచేత సత్యనారాయణ వ్రతం చేయించింది. చుట్టాలు, స్నేహితులు వచ్చి శుభాకాంక్ష

లందించారు. ఇంత జరుగుతున్నా పతంజలికో ఆనందంలేదు. దూరపు చుట్టంలా మసిలాడు. తనకేం బాధ్యత లేనట్లు నిర్లిప్తంగా కూర్చున్నాడు.

భర్త మరబొమ్మలా తిరగడం కామేశ్వరమ్మ గ్రహించింది.

"ఏమిటలా వున్నారు ?" నిగ్గతీసి అడిగింది.

"ఏంలేదు."

ముభావంగా ఊరుకున్నాడు. కామేశ్వరమ్మకి చెబితే తన బాధ సగం తీరుతుంది. కాని ఆమె ఆవేశపరురాలు. ఏం జరుగుతుందో ?

రోజులు గడుస్తున్నా భర్తలో మార్పు రాకపోవడం కామేశ్వరమ్మకి ఆందోళన రేపింది శ్రీపతి రోగం తగ్గి ఇంటికి వచ్చినందుకు ఎంత హడావిడి చేస్తారో ననుకుంది. ఇంటిదగ్గర చాల సీరియస్‌గా వుంటున్నారు. యాంత్రికంగా కోర్టుకి పోయివస్తున్నారు.

విషయాన్నిరాబట్టాలని ప్రయత్నించి విఫలురాలైంది.

"ఏమయిందే మీ మామగారికి ?" కోడల్ని అడిగింది.

జయ కూడ మూగనోము పట్టింది.

ఇంట్లో మార్పు శ్రీపతి పై ప్రభావాన్ని చూపించింది.

ఓరోజు రాత్రి భోజనాలయ్యాక పేపరుకోసం శ్రీపతి తండ్రి గదిలోకి వెళ్ళాడు. పతంజలి ఒక్కడూ విస్కీ త్రాగుతున్నాడు. శ్రీపతికి అది తెలిసినవిషయమే కనుక పేపరు తీసుకుని వెళ్ళబోతూండగా" కమాన్ మై బాయ్" అని కేకవేశాడు.

శ్రీపతి దగ్గరగా పోయి కూర్చున్నాడు. సిగరెట్ వెలిగిస్తూ "నీ భార్య ఎలా వుంటోంది ?" సూటిగా అడిగాడు.

"చాల డల్‌గా వుంటుంది."

"అంటే భయపడుతోంది మాట"

"దేనికి ?"

పతంజలి చెప్పెయ్యడానికి నిశ్చయించుకున్నాడు. ఆ రహస్యాన్ని ఇక తను దాచలేడు. తనవల్లకాదు. శ్రీపతిని మోసం చెయ్యలేడు.

జయ చేసిన తప్పు తెలియజేశాడు.

"అబద్ధం" శ్రీపతి గట్టిగా అరిచాడు.

"కాదు నిజం."

"దాన్నే అడుగు ... మన్మథరావుని అడుగు........"

శ్రీపతి పరుగు తీశాడు.

కాస్సేపట్లో కామేశ్వరమ్మ కంగారుగా అక్కడికి వచ్చింది. "దాన్ని చంపేస్తున్నాడండోయ్ ?"

పతంజలి భార్యతో కొడుకు గదిలోకి వెళ్ళాడు.

శ్రీపతి హంటర్‌తో భార్యని కొడుతున్నాడు. జయ శరీరం రక్తసిక్తమై పోయింది. పతంజలి విడిపించాడు.

"ఏం జరిగిందంటే మాట్లాడవేం?" కామేశ్వరమ్మ గద్దించింది.

"ఇంటిని సానికొంప చేసింది."

తెల్లారేసరికి జయ శరీరం నూతిలో తేలింది. సంసారం రోడ్డు ఎక్కింది. ఈ షాక్‌తో శ్రీపతి పిచ్చివాడయ్యాడు.

రెండో దృశ్యం:

"పిల్చారా?" జయ మెల్లగా లోపలికి వచ్చింది.

పతంజలి పదార్లు చేస్తున్నాడు. జయను చూసి "శ్రీవతీ మీ అత్తయ్యా రేపుదయం వస్తున్నారు," అని చెప్పాడు.

జయ తల పైకెత్తలేదు పతంజలితో మాట్లాడడానికే భయంగా వుంది.

"మాట్లాడవేం?"

"రేపు నేను వెళ్ళిపోతాను. ఈ పాపిష్టి ముఖాన్ని వారికి చూపించలేను." జయ ఏడుస్తోంది వెక్కి వెక్కి.

"నీ నిర్ణయం నాకు అర్థంకావడం లేదు. ఇది నీ యిల్లు. ఇక్కడ్నుంచి పారిపోతానంటావేమిటి? గమ్యం లేకుండా బయలుదేరితే అగమ్యమవుతుంది బ్రతుకు ఏ పరిస్థితిలో ఆ తప్పు జరిగిందో నాకు తెలియదు కాని నీ సహకారం మాత్రం వుంది"

జయ మాట్లాడలేదు ఆదంతా పీడ కలలా కనిపిస్తోంది. మన్మధరావుని ఆగమనడమే తను చేసిన తప్పు. అది యింత అనర్థానికి దారితీసింది. మన్మధరావు తనని దోపిడీ చెయ్యబోయాడు.

"శ్రీపతి నిన్ను ఎంత ప్రేమిస్తున్నాడో నాకు తెల్సు. వాడు నీతోచే జీవితమన కుంటున్నాడు పునర్జీవుడై వచ్చేవేళ నువ్వు లేకుండా పోతే వాడి భవిష్యత్తు శూన్యమైపోతుంది."

"ఆ పరిస్థితి ఎలా ఏర్పడిందో చెప్పలేను....కాని నా మనస్సులో మీ కుటుంబానికి కళంకం తెచ్చే తలంపు లేదు." ఏడుపు ఆపి స్థిరంగా అంది.

పతంజల్లో ఆ మాటలు మార్మోగాయి

విద్య తప్పు చేసింది. అశోక్‌తో పబ్లిగ్గా లాడ్జికు తిరిగింది. దాన్ని మరుగుపరచి పెళ్ళి చేశారు. అదే తప్పు జయ చేసింది.

తను క్షమించి తీరాలి.

"జరిగింది మరిచిపో జయా! దాన్ని పునరావృతం కానీయకు. ఇది నా ప్రార్థన ఈ కుటుంబానికి నీ ద్వారా వెలుగు రావాలి. ఈ రహస్యం మనిద్దరి మధ్య వుండిపోతుంది"

"అంత అదృష్టమా?"

"ఇది అవకాశం. నిలుపుకుంటే అదృష్టమవుతుంది."

జయ వంగి పాదాభివందనం చేసింది. "ఏ మాట నిలబెడతానని ప్రమాణం చేస్తున్నాను."

"మనస్సాక్షిగా చెప్పు చాలు. శ్రీపతికి నీ మీద వుండే అభిమానానికి రాణి పడుతున్నాను ఒక తప్పు చేస్తే జీవి

కాంతం శిక్ష అనుభవించకూడదని నీ కీ అవకాశం యిస్తున్నాను. నీ మీద పెంచుకున్న విశ్వాసం వమ్ము కాకూడదు...వెళ్ళు...''

తెల్లవారేసరికి కామేశ్వరమ్మ, శ్రీపతి టాక్సీ దిగారు. జయ పారాణి నీళ్ళతో ఎదురు వచ్చింది. మందార రంగు పట్టు చీరలో ఉషాసుందరిలా కన్పించింది జయ. భార్యని చాటుగా పిల్చి ముద్దు పెట్టుకున్నాడు.

''వదలండి...మీ అమ్మగారు...''

''నీ గురించి ఆలోచించని క్షణం లేదు జయా...'' ఆమెని మరింతగా హత్తుకున్నాడు.

జయ, శ్రీపతి ఆనందంగా వుండటం కామేశ్వరమ్మకి ఏనుగు నెక్కినట్లయింది. ఇక శ్రీపతి జీవితం తమకి సమస్య కాదు.

''జయ వచ్చినవేళ మంచిదండీ. అబ్బాయి మనిషయ్యాడు.''

''అవును కామేశ్వరీ!''

* * *

తిరిగి వర్షపు జల్లు ప్రారంభమైంది. పతంజలి తోటనుంచి యింట్లోకి పరుగు తీసాడు, హాల్లో జయ...విద్య కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. పతంజలి వార్ని పలకరించకుండా మేడ ఎక్కాడు.

రెండు దృశ్యాలలో తానేది ఎన్ను కోవాలి? కుంచె తన చేతిలో వుంది. తన యిష్టమైన బొమ్మను గీసుకోవచ్చు.

మొదటి దృశ్యం రావాలంటే ఉత్తరం పోస్టు చెయ్యాలి. అది ట్రాజడీకే దారి తీస్తుంది.

రెండవ దృశ్యం ఏర్పడాలంటే ఉత్తరం చింపివేయాలి

అలా చేస్తే కుటుంబంలో శాంతి, సంతోషం కనిపిస్తాయి.

పతంజలి చుట్ట నోట్లో పెట్టుకుని లైటర్‌తో వెలిగించాడు.

చివర్న ఉత్తరాన్ని అంటించాడు.

ఇప్పుడతని మనస్సు ప్రశాంతంగా వుంది.

పతంజలి మేడ దిగివచ్చాడు క్రిందకి.

(సమాప్తం)






పూల్వైన్ తెచ్చిన ఆఫీసు పేపర్లు చూసి, సంతకాలు పెట్టాడు మోహన్‌బాబు. మళ్ళీ తనను డిస్టర్బ్ చెయ్యవద్దని, అతనిని పంపాడు.

అంతలో వుయ్యాలలో వున్న పాప లేచి, యేడ్చింది. వెంటనే లేచి, పాపను చేతుల్లోకి తీసుకొని, అక్కడే వున్న పాలబాటిల్‌తో పాపకు పాలు పట్టాడు. పాలు కడుపునిండా తాగి, కేరింతలు కొడుతూ, నవ్వుతూన్న పాపముఖంలోకి దీక్షగా చూశాడు.

పాప ముమ్మూర్తులా తల్లిని పుణికి పుచ్చుకుంది. ఆ కళ్ళు, ముక్కు, నోరు అంతా రాధ పోలికే! వుయ్యాలలో

నవ్వుతూన్న పాపను, లోపలి గదిలో గోడకు వ్రేలాడుతున్న రాధ ఫోటోను మార్చి-మార్చి చూసాడు మోహన్‌బాబు. పాప కోసినవ్వులు, సెలయేటి గల గలలవంటి రాధ నవ్వులా తోచింది. కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి. ఉయ్యాల ను గట్టిగా వూపి, దూరంగా వెళ్ళి సోఫాలో కూర్చున్నాడు. బయటలాన్‌లో విరబూసిన గులాబీలవంక తదేకంగా చూస్తున్నాడు.

*　　*　　*

గులాబీ పువ్వంటే తనకెంతో యిష్టం. ప్రతిరోజూ తోట గులాబీలను స్వయంగా కోసి, మనసైన మగువలకి, మక్కువతో అలంకరించి, మధుపాయిలా అనుభవించేవాడు. చేతినిండా డబ్బుంది. బట్టల మిల్లులో షేరుంది. చక్కటి బంగళా. తల్లిదండ్రులు విమాన ప్రమాదంలో మరణించాక, బ్రహ్మచారియైన మేనమామ అండదండలతో పెరిగాడు. ఇద్దరు చెల్లెళ్లు కాలేజీలో చదువుకుంటు న్నారు.

యవ్వనపు హరివిల్లులోని రకరకాల రంగులను రంజు రంజుగా అనుభవిస్తు న్నాడు. వోసారి మేనమామ పెద్ద చెల్లికి, మంచి సంబంధం తెచ్చాడు. కానీ, అక్కర్లేదని వెళ్ళారు. వారు పిల్ల నచ్చక; కట్నం చాలక కాదు! పిల్ల అన్న బులాయికోరు; అతనికి తాగుడూ, తిరుగుడూ వుందని!

ఆ మాటలకు మొదటిసారి బాధ పడ్డాడు. తన ప్రవర్తన-చెల్లెళ్ళ విష యంలో అంతటి దుష్ఫలితాల నిస్తుందని తానెన్నడూ వూహించలేదు!

తర్వాత చాల సంబంధాలు వచ్చి, ఆ ఒక్క కారణంచేతే తిరిగిపోయాయి. చివరికి చెల్లి తనకు పెళ్ళి వద్దంది.

అంతలో మేనమామ మరో మార్గం ఆలోచించి, మొదట తనకు పెళ్ళి చేస్తా నన్నాడు. అప్పుడూ అదే ఫలితం. యెవ్వరూ తనకు పిల్లనివ్వడానికి యిష్ట పడలేదు.

ఇవన్నీ చూసి, తానే వో నిర్ణయానికి వచ్చాడు. చదువు-అందం వున్న వో బీదింటి పిల్లను చూడమని, యిదికూడా కుదరకపోతే, తానిక జన్మలో పెళ్ళి చేసుకోనని మామయ్యకు చెప్పాడు.

తత్ఫలితంగా బీదింటి పిల్ల అయిన అందాలరాణి రాధతో తనకు పెళ్ళి జరిగింది. రాధ తన మామగారికి మొదటి భార్య కూతురు! ఆమెను యెలాగైనా వదుల్చుకోవాలని, రాధ మారుడుతల్లి తనకు రాధనివ్వటానికి అంగీకరించింది.

రాధ కాపురానికొచ్చిన కొత్తలో తాను కుదురుగా వున్నాడు. తర్వాత మళ్ళీ పాత పాఠమే! తాగడం, బయట అమ్మాయిలతో తిరగడం! ఒక్కొక్క సారి రెండు మూడు రోజులు కూడా యింటి ముఖం చూసేవాడుకాదు.

ఒకరోజు సాయంత్రం ఆఫీసునుండి

రాగానే డ్రెస్ చేసుకొని, కార్లో బయ ల్దేరబోయాడు. రాధ, 'ఒక్క క్షణం కూర్చుని టిఫిన్ తీసుకు వెళ్ళమంది' అలాగేనని కూర్చున్నాడు తాను.

రాధ వో ప్లేటులో చికెన్‌ఫ్రై, వో గ్లాసుతో మంచినీళ్ళు, మరో ఖాళీగ్లాసు తెచ్చి, అతని ముందుంచింది. బీరువా తెరిచి, వో బ్రాండీ బాటిల్ తీసి, సీలు తీసి, గ్లాసులో వొంపింది. అది చూసి విస్తుపోయాడు తాను.

"తీసుకోండి! వీటికోసమేగా మీరు బయటికెళ్తున్నారు? అవిక్కడే వుంటే, మీ కా శ్రమ తప్పుతుందిగా? ప్లీజ్! తాగండి!" అంటూ స్వయంగా బ్రాందీ గ్లాసుని తన నోటి కందించింది. నిర్విణ్ణుడై బ్రాందీ సిప్ చేశాడు.

మరో రోజు మేడమీది గదిని శోభ నపు అలంకరణలతో తీర్చి దిద్దింది. తనను పైకి తీసుకెళ్ళి అంతా చూపింది. తన యిష్టానికి యెదురే లేదని, కనుక, కోర్కెలను తీర్చుకోడానికి బయటికెళ్ళి నలుగురికి చులకనవ్వవద్దని, మనసుకు నచ్చిన యువతిని, రహస్యంగా యిక్కడికే రప్పించుకొని, అనుభవించ మని కోరింది. ఆ మాటలకు మరోసారి స్తంభించిపోయాడు. ఇది నిజమా? కలా?

రాధ తనకు అర్థంకావటంలేదు! 'సాధారణంగా స్త్రీలు భర్తని తాగుడు మాన్పటానికి ప్రయత్నిస్తారు. పరస్త్రీ ముఖం చూడటం సహించరు! మరి, యిదేవిటి? రాధ యిలా చేస్తూంది? రాధ మనిషేనా? మానవాతీత శక్తా?'

మరోసారి ఆఫీసునుంచి వస్తూ, యింటికి రాకుండా, ప్రియురాలి యింటికి వెళ్ళాడు బాగా తాగాడు. ప్రియురాలి మాటలు వింటూ, ఆమె కోర్కెలు తీర్చడానికి పర్సులోని డబ్బంతా యిచ్చి, ఆమె అందించిన బ్రాందీ-వగైరాలు మితిమీరి తాగాడు. ఫలితంగా, నిబ్బరించుకోలేక, ఆ గది లోనే పెద్ద వాంతి చేసుకొన్నాడు. ఆమె తనను చీదరించుకుంది. ఇప్పటికీ ఆ సంఘటన తనకు బాగా గుర్తు. చీద రించుకొని, విసుక్కొని, పనిమనిషి చేత, తనను రిక్షాలో యెక్కించి, యింటికి పంపింది.

రిక్షా కాంపౌండ్‌లోకి రావడం చూసిన రాధ ఆత్రంగా యెదురొచ్చి తన స్థితికి కన్నీరు పెట్టుకొని, గదిలోకి చేర్పించింది. బెడ్‌మీద తూలిపోయి, మళ్ళీ రెండుసార్లు పెద్ద పెద్ద వాంతులు చేసుకున్నాడు. అది చూసి యేడ్చింది రాధ. ఆమె చీరె చెంగుతో తన మూతి, ఒళ్ళు, చేతులు తుడిచింది. మంచినీళ్ళు తాగించి, పరుండబెట్టింది.

వెంటనే గదిని క్లీన్ చేసింది. మేన మామ చెప్పాడట. మజ్జిగలో నిమ్మకాయ రసం పిండి, తాగించింది.

తెల్లవారిన తర్వాత లేచి, జరిగిన దానికి బాధపడి, సిగ్గుపడుతూ, మళ్ళీ

ప్రియురాలి యింటికి టాక్సీలో వెళ్ళి రాత్రి తాను విడిచిన తన కారు తీసుకొని వచ్చారు.

రాధ మళ్ళీ అడిగింది. గదిని అలంకరించడంలో కొరత జరిగితే క్షమించమంది. యేంచేయాలో చెప్పమంది. ప్రియురాలి అడ్రస్ చెబితే తానే స్వయంగా వెళ్ళి తీసుకొస్తానంది.

ఇంత జరిగాక, యే ముఖంతో ప్రియురాలి ముఖం చూడడం? యేమని తాగుడు త్రాగడం? తన జీవనవిధానంలో వో గొప్ప మార్పు, తన జీవన ప్రమాణంలో వూహించని వో మలుపు వచ్చింది.

ఒక శుభోదయాన స్నానం ముగించి, భార్యని గుడికి వెళ్దాం రమ్మన్నాడు. ఆమె ఆశ్చర్యపోతుందనుకున్నాడు. కానీ, అలా జరుగలేదు! ఆమె సంబరపడింది. 'పుట్టించిన దేవుడు, తప్పుదారి పట్టిన మనుషుల్ని తప్పక మంచి దారికి మళ్ళిస్తాడని నేను నమ్మాను! దాన్ని ఋజువుచేశాడు. వెళ్దాం రండి!' అంది, పూలసజ్జతో సిద్ధమై. 'యెంత నమ్మకం రాధకి?'

తాను రాధతో గుడికి వెళ్ళిన మూడు నెల్లకి, పెద్ద చెల్లెలికి, చిన్న చెల్లెలికి రెండు మంచి సంబంధాలు కుదిరాయి. వారు పెళ్ళి చేసుకొని, అత్తవారిళ్ళకు వెళ్ళాక తాను తండ్రి కాబోయే సంగతి రహస్యంగా చెప్పింది రాధ! ఆ రోజు యెంతటి ఆనందం అనుభవించాడు తాను!

తాను విశ్వసించి, తలపెట్టిన ప్రతి కార్యము నిర్విఘ్నంగా, విజయం సాధించి, తన జీవితానికి వో అర్థాన్ని, ఆనందాన్ని కల్పించింది రాధ.

అంతటి గొప్ప వ్యక్తి, తనను తండ్రిని చేయడానికి, తల్లివంటి మరో ఆణిముత్యాన్ని తనకు ప్రసాదించటానికి దివ్య వరం పొందితే, చివరికి ఆ వరం ఫలించి, తనను వంటరివాణ్ణిచేసి, రాధ మరణించింది! రాధ నమ్మకాలను నిజం చేసిన ఆ దేవుడే రాధను తననుంచి వేరుచేశాడు!

'యేమిటీ న్యాయం? రాధలేని యీ చీకటిబ్రతుకు తానెలా బ్రతకడం? రాధ ప్రసాధించిన యీ పసిగుడ్డును తానెలా పెంచడం? మోహన్‌బాబు కన్నులనుండి రెండు అశ్రుధారలు, చెంపలమీదుగా జారిపోయాయి.

రాధ చనిపోయిన అదను చూచి ఆమె మారుడుతల్లి, తన కూతుర్ని, భర్తని మోహన్‌బాబు వద్దకు పంపింది. మోహన్‌బాబు మారిపోయాడు గనుక, యిప్పుడు తన స్వంతకూతుర్ని యివ్వాలని ఆమె వుబలాటం!

పసిపిల్లను చూడటానికి మనిషి కావాలి గనుక, రాధ చెల్లి సీతను మళ్ళీ పెళ్ళిచేసుకోమన్నాడు మామగారు.




'సీతకంటే, రాధ కూతుర్ని మరెవ్వరూ స్వంతబిడ్డలా సాకరు' అని చెప్పాడు.

'బిడ్డని సాకడానికయితే మంచిదే; కానీ, రాధ స్థానాన్ని సీత కెలా యివ్వడం?' అంగీకరించలేకపోయాడు మోహన్‌బాబు

మామగారు వోర్పు వహించాడు. నిదానంగా ఆలోచించుకోమన్నాడు. తానొక నిర్ణయానికి వచ్చేవరకు, సీత, తను అక్కడే వుంటామన్నాడు.

సంవత్సరం కావస్తూంది. కానీ, తను రాధను మర్చిపోలేక పోతున్నాడు. అనుదినం, అనుక్షణం రాధ తన కళ్ళ ముందే మెదులుతుంది. పైగా పాప రూపంలో ముమ్మూర్తులా ప్రత్యక్ష మైంది. ఆ జ్ఞాపకాలతో సతమత మవుతూ, సరిగ్గా ఆఫీసుకు కూడా వెళ్ళ లేకపోతున్నాడు. ముఖ్యమైన పేపర్లను యింటివద్దే చూస్తున్నాడు. మామగారు ఆఫీసుకువెళ్ళి తన పన్లు కొన్నిటిని చూస్తున్నాడు.

* * *

ఈ జీవితం యింతేనా? రాధ లేని బాధని యిలా భరించాల్సిందేనా? ...' బాధగా లేచాడు మోహన్‌బాబు.

వుయ్యాలలో వున్న పాపవంక చూసాడు. నాలుక చీక్కుంటూ నిశ్చింతగా నిద్రపోతూంది. మధ్య మధ్య నవ్వుతుంది. ఒక్కోసారి యేడుపు ముఖం పెడుతూంది.

'నవ్వులు ముగిసి, యేడుపు మిగిలింది-నా బ్రతుక్కి' అనుకుంటూ, బరువుగా నిట్టూర్చి బయటికి సాగాడు.

అదే సమయానికి మామగారు కార్లో వచ్చాడు యెవరో ఆఫీసర్లు యిన్‌స్పెక్షన్‌కి వచ్చారని, అర్జంటుగా వో సారి ఆఫీసుకు రమ్మనమని అడిగాడు.

ఆలోచించి, కారెక్కాడు మోహన్

బాబు. మామగారు వెళ్ళి, సీతను తలుపు వేసుకొనమని, బయల్దేరాడు.

*   *   *

ఈ సంవత్సర కాలంలో సీత ఆ యింటి పరిస్థితులను క్షుణ్ణంగా తెలుసుకుంది. చనిపోయిన 'రాధ' అక్కయ్యకు ఆ యింట్లో యెంతటి ఉన్నతస్థానం వుందీ, ఆమె బావగారి హృదయాలయంలో ఆరాధ్యదేవతగా యెలా నిలిచిపోయిందీ గ్రహించింది.

తల్లిలేని పాపను, లోటులేకుండా పెంచగల శక్తిని ప్రసాదించమని, వేయి దేవుళ్ళను రోజూ ప్రార్థిస్తూంది. తనకు మనోధైర్యాన్ని, సామర్థ్యాన్ని ప్రసాదించి తాను మిగిల్చిన పనులుచేసే శక్తిని అనుగ్రహించమని రాధని కోరుతూంది.

వుయ్యాలలోని పాప లేచింది. తన వునికిని తెలపడానికన్నట్టు, యేడ్చింది. సీత వడివడిగా వెళ్ళి, పాపను భుజాన వేసుకుంది. ఇటూ అటూ తిప్పింది. జోకొట్టింది. లాలి పాడింది కొంచెం సేపు ఒళ్ళో పడుకోబెట్టుకొని బొమ్మలతో ఆడించింది.

అంతలో బయట యెవరో తలుపు కొట్టారు. కాల్‌బెల్ నొక్కారు. 'వచ్చే-వచ్చే' అంటూ, పాపని వుయ్యాలలో పరుండబెట్టి, తలుపు తీసింది. యెవరో అపరిచిత వ్యక్తి. ముప్పై యేళ్ళుంటాయి. చెదిరిన క్రాపు. ఇన్‌షర్టు వేసుకున్నాడు. చేతిలో యేదో పాకెట్ వుంది. కళ్ళు మాత్రం యెర్రగా, ఆందోళన కలిగించేలా వున్నాయి.

"మోహన్‌బాబుగారి ఇల్లు యిదే కదండీ?..." కంఠం కాస్త కరుకుగా వుంది.

"అవును! కానీ-ఆయనింట్లో లేరు!"

"అలాగా? ... అన్నట్టు, మోహన్‌బాబంటే రాధ భర్తే కదూ!"

"అవును! ఆయనతో మాట్లాడాలంటే మీరు ఆఫీసుకే వెళ్ళొచ్చు!"

"అక్కర్లేదు! ముందు నువ్వు లోపలికి నడు!" అంటూ జేబునుండి వో కత్తి తీసి, అకస్మాత్తుగా సీతకు గురిపెట్టి, లోపలికి అడుగువేశాడు. ఆమె నిర్విణ్ణురాలై లోనికి నడిచింది.

అతను గడపదాటి తలుపు బిగించాడు.

"నాక్కావలసిందే యీ అదును!... యెక్కడ?...ఆ వంచకి యెక్కడ? ఆ మోసగత్తె యెక్కడ? నన్ను చేసిన మోసానికి ఆ పాతకిని ముక్కలు ముక్కలు చేసి, యిదిగో యీ కాశ్మీరు సిల్కు చీరె కప్పిగాని పోను! త్వరగా చూపి చు దాన్ని!" వుద్రేకంలో పళ్ళు పటపటా కొరికి, యెడమచేతిలోని పాకెట్‌ను చూపాడు.

"యెవరు? మీ కెవరు కావాలి?" వొణుకుతూ అంది సీత

"షటప్! తెలీనట్టు నటించి, ఆలస్యం

చెయ్యాలనుకుంటే, నీ ప్రాణాలు తీస్తాను! కాలేజీలో చదువుకునే రోజుల్లో నన్నే పెళ్ళిచేసుకుంటానని చెప్పి, మిలటరీలో చేరినట్టు తెలవగానే, యింకో కడ్ని చేసుకుంటుందా ఆ వంచకి? నాతోటే బ్రతుకు! నాతోనే సంసారం! నాతోనే స్వర్గం! అని నన్ను మభ్యపెట్టి నేను మిలటరీకి పోగానే దాని దారి అది వెతుక్కుంటుందా ఆ రాక్షసి? కాశ్మీరు సిల్కుచీరె కావాలని రాసిన ఆ నీచు రాలు, నేను వచ్చేవరకు ఆగలేక పోయిందా ? కలవాడిని కట్టుకుని కులుకుతుందా? యెక్కడ ఆ రాధ? దాని గుండెల్లో యీ చాకు దింపి, ఆ వేడిరక్తం చూస్తేగాని, నాకు శాంతి లేదు! కమాన్! చూపించు!" బిగ్గరగా అన్నాడు.

అంతా విని నిశ్చేష్టురాలైంది సీత! యేమిటీ అభాండం? అక్క యితనిని వంచించిందా? ... రాధక్కనా యిత ననేది?

"యేమిటా నిలువుగుడ్లు?" సీత చెయ్యి పట్టుకుని లాగాడు.

"యూ బ్లడీ! రాధని చూపిస్తావా, నిన్ను చంపమంటావా?"

సీత కెవ్వుమని, చేతిని లాక్కుంది. "యేమిటీ దౌర్జన్యం? మా రాధక్క అలాంటిదికాదు! నువ్వు పొరబడు తున్నావు! నువ్వు అనే రాధ యింకెవరో? మా అక్క కానేకాదు! ఆమె దేవత! ఈ యింటికి యిలవేల్పు!" భయంలో ఆమె కంఠం రుద్ధమైంది.

సీత అరుపుకి వుయ్యాలలోని పాప వులిక్కిపడి, యేడ్చింది.

ఆ మనిషి క్షణంలో వుయ్యాల వద్దకు వెళ్ళాడు. పాపను చూసాడు.

"ఆఁ?...అదే...అవే కళ్ళు...అదే ముక్కు...అదే నోరు! నో డౌట్! ఇవి రాధ పోలికలే! నాకు తెలుసు. యిది రాధ బిడ్డే!...యేయ్! మర్యాదగా నాకు రాధని చూపిస్తావా? లేదా? లేదంటే, ముందు దీన్ని నరికేస్తా! చెప్పు!" అంటూ కత్తిని బలంగా పైకెత్తాడు.

"అమ్మో! వద్దు!" అంటూ, అతని ముందు కురికింది సీత!" ఆ పాపనేం చెయ్యొద్దు! నీకు రాధేగా కావాల్సింది! రా చూపిస్తా." అని, అతని చెయ్యి పట్టుకొని, పక్కనున్న గదికి లాక్కెళ్ళింది.

"అదుగో మా రాధక్క? వెళ్ళి, చంపు! చిత్రవధ చెయ్యి!" అని చేతుల్లో ముఖం దాచుకొని, యేడ్చింది సీత.

ఆ గదిలో గోడకు వేలాడుతున్న రాధ ఫోటో చూచి, అవాక్కయ్యాడు అతను. చేతిలోని కత్తి, పాకెట్టు జారిపోయాయి. "రాధా!" అని బిగ్గరగా అరిచి, చేతులతో తలమీద కొట్టుకుంటూ జుట్టు పీక్కుంటూ యేడ్చాడు.

"రాధా! నాకు కాకుండాపోయావన్న బాధతో వచ్చాను రాధా! మళ్ళీ నాకు

అందకుండా, కనిపించకుండా పోయావా రాధా ? నే నెలా జీవించాలి రాధా ?" రోధించాడు

తనకీ, రాధకీ వున్న ప్రేమ వృత్తాంతమంతా బయటపెట్టాడు. అప్పుడుగానీ, సీతకు గతం గుర్తుకు రాలేదు.

రాధకి వారం వారం మిలిటరీ కాంపు నించి, వో యిన్‌లాండ్‌లెటర్ వచ్చేది. కానీ, అమ్మ ఆ వుత్తరాన్ని చదివి, చించిపారేసేది ! తానేవిటని అడిగితే నోర్మూసుకొని, అవతలికి పొమ్మనేది! అప్పుడే బావగారి సంబంధం వస్తే, క్షణాల్లో కుదిర్చి, వారంలోపలే పెళ్ళి చేసేసింది! 'తాగుబోతు, తిరుగుబోతు అయినా పర్వాలేదు ! ముందు యీ పీడ మన కొదిలితే చాలు' అని అనడానికి యిదికూడా వో కారణమన్న మాట !

"చంపి, రక్తం కళ్ళచూస్తానన్న మగాడివి, ఆడదానిలా రోధిస్తావే ? చంపు! వూరుకుంటావే ?" సీత రెట్టించింది.

"అయ్యో! నా రాధ నాకు లేకుండా పోయిందమ్మా! నన్నసమర్థుడిని చేసి వెళ్ళిపోయిందమ్మా! ఇంకా నా బ్రతు కెందుకు ? నే బ్రతికెందుకు ? యుద్ధంలో చావకుండా తిరిగొచ్చింది యిందుకా ? వద్దు! రాధలేని బ్రతుకొద్దు! నే నిప్పుడే చచ్చిపోతా ! నా రాధ దగ్గరి కెళ్ళిపోతా !" అని, కిందపడ్డ కత్తిని అందుకోబోయాడు.

ఆమె వెంటనే ఆ కత్తిని అతని కందకుండా చేసింది.

"వద్దు ! ఆ పని మాత్రం యిక్కడ చెయ్యొద్దు ! నీకు దణ్ణం పెడతా ! నిజంగా నీకు మా రాధక్కమీద అంత ప్రేముంటే, వో సాయం చేసిపెట్టు! రాధక్కకి యీ యింట్లో పవిత్ర స్థానం వుంది మా బావగారి హృదయంలో ఆమె దేవతై కూర్చుంది. నిజమో, అబద్ధమోగానీ, నువ్వు చెప్పే ప్రేమ కథ యిక్కడెవ్వరికీ తెలీదు! మంచి అనిపించుకొని, మనసుల్లో చోటు చేసుకొని, మరణించిన ఆమెకు నీ మాటలు మచ్చను తెచ్చిపెడుతున్నాయి ! నీది నిజంగా పవిత్ర ప్రేమైతే, నాకు మాటివ్వు ! ఈ విషయం మనిద్దరిలోనే వుండిపోవాలి. నీ వల్లగానీ, నా ద్వారా గానీ మరో వ్యక్తికి తెలీకూడదు ! మా రాధక్కకి కళంక మనేది రాకూడదు ! ఊ! మాటివ్వు!" అంటూ ఆమె చేతిని ముందుకు సాచింది.

అతను కన్నీళ్ళు తుడుచుకొని, ఆమె చేతిలో చెయ్యి వేశాడు. "అలాగే నమ్మా! నే నెవ్వరికీ చెప్పను! నా రాధకి కళంకం రానీను!" అంటూ, వెనుదిరిగాడు.

సీత చీరె పాకెట్టుని అతని కిచ్చింది.

"ఇంకెప్పుడూ రాధపేరు ఉచ్చరించవద్దు! రాధ యింటిఛాయలకి రావొద్దు!"

"వద్దమ్మా! ఆ మాట అనవద్దు! ఈ పాపలో నా రాధను చూచుకుంటాను! నువ్వు క్షమిస్తే, యెవ్వరూ చూడకుండా, అప్పుడప్పుడు వచ్చి, చూసిపోతుంటాను! ఆదొక్కటి మాత్రం కాదనకు!" వుయ్యాలవరకు వచ్చి, పాపను చూసి, కన్నీళ్ళు పెట్టుకుంటూ, యెత్తుకుని, గుండెలకు హత్తుకున్నాడు.

"పాపని తే!" అని, అతని చేతుల నుండి పాపను అందుకుంది. "ఇంక నువ్వు వెళ్ళొచ్చు! మా వాళ్ళు వచ్చే వేళైంది!"

అతను తలుపుబోల్టు తీసి, వో క్షణం ఆగాడు. "నేను రహస్యంగా అప్పుడప్పుడూ వస్తాను. కాదనకు!" అడిగాడు.

"రహస్యాన్ని కాపాడవలసిన బాధ్యత మనిద్దరిదీ' అది గుర్తుంచుకో." ఆఖరిసారి హెచ్చరించింది.

"అలాగే!" నంటూ తలుపు తెరిచాడు.

యెదురుగా సీత తండ్రి, మోహన్ బాబు కనిపించారు. ఓ క్షణం నివ్వెరపోయాడు.

ముసలాయన వుగ్రుడై, తలుపు తీసిన వ్యక్తిని పెటపెటా రెండు చెంపదెబ్బలేశాడు. "వెధవ! రహస్యంగా అప్పుడప్పుడూ వస్తావట్రా! ఇదేమన్నా సాని కొంపట్రా?" మళ్ళీ కొట్టబోయే సరికి, "నాన్నా" అంటూ సీత అడ్డుపడ్డది. "ఛీ! అవతలికి పో! దుర్మార్గురాలా!" అంటూ ఆమెను రెండు వేసి, అవతలికి నెట్టేసరికి, ఆమె పడిపోకుండా అతను పట్టుకున్నాడు.

"నువ్వూ వాడూ కలిసి, దేవాలయం లాంటి యింటిని సానికొంప చేస్తారటే?" అని మళ్ళీ కొట్టబోయే సరికి, "వద్దు! అలా అనవద్దు!" అంటూ సీతను పక్కకు లాగి, "నా పేరు రామారావు! నేను మిలిటరీనించి తిరిగివస్తున్నాను! ఈ అమ్మాయికీ నాకు యెలాంటి..." ఆవేశంగా చెప్పబోయే సరికి. సీత అమాంతం అతని నోటికి తన చెయ్యడ్డుపెట్టింది.

"వద్దు! మాట్లాడొద్దు! ఇక వెళ్ళిపో!" అని, అతనిని నెట్టబోయింది. అంతలో తండ్రి ఆమెచేతిని పట్టుకొని లాగాడు.

"అతని మాటలు నమ్మకండి నాన్నా! రామారావు నాకోసమే వచ్చాడు. అతడు నా కాలేజీమేట్!" యేడుస్తూ అంది.

"నో! డోంట్......రామారావు బిగ్గరగా అరిచేసరికి, మళ్ళీ ఆడపులిలా అతనివైపుకు విరుచుకొచ్చి, అతనినోటికి చెయ్యడ్డుపెట్టింది. నువ్వు బయటికి నడు ముందు! గెటవుట్!" అతనిని వెనక్కు నెట్టసాగింది.

"వాడే కాదు ! నువ్వు కూడా గెటవుట్ ! ఇంక ఒక్క క్షణం కూడా ఉండడానికి వీల్లేదు ! పోండి ! కట్ట కట్టుకు చావండి !" తండ్రి సీతను కూడా బయటకు గెంటబోయాడు.

అంతవరకు మౌనంగా ఉన్న మోహన్‌బాబు కలుగజేసుకున్నాడు.

"మామగారూ ! మీ రాగండి ! తప్పులు చేసినవారిని క్షమించి, పెడదారులు పట్టినవారిని సరిదిద్ది,దేవళం లాంటి ప్రాశస్త్యాన్ని పొందిన యీ యింట్లో, యీనాడు సీతచేసిన పనికి తగిన శిక్ష నే వేస్తాను!" అంటూ అడ్డు వచ్చి, సీతను లోపలికి పిలిచాడు.

సీత వణుకుతూ వచ్చి, తలవంచుకుని నిలబడింది, ప్రపంచమే శూన్యమను కుటున్న బలిపశువులా.

"మామగారూ! నా గతజీవితం మీకు తెలీందికాదు ! తెలిసికూడా, మీ రెండవభార్య ప్రోద్బలంచేత, జులాయి కోరునైన నాకు ఆణిముత్యం లాంటి మీ రాధ నిచ్చారు. ఆ రాధ రాకతో నా జీవితం మలుపు తిరిగి, తేజోవంతమైంది. నా సంసారం చక్క దిద్దింది. నా చెల్లెళ్ళకి పెళ్ళి చేసింది. నా పాలిట అనురాగవల్లిగా, నా కో పాపని ప్రసాదించి, నా దురదృష్టం కొద్దీ కన్నుమూసింది. ఆమె తిరుగాడిన యీ యింటిని నేను దేవాలయంగా భావించి, అనునిత్యమూ, నా రాధనే ఆరాధిస్తున్నాను. ఆమెను నా గుండెల్లో పదిలపరచుకున్నాను.

"పాపను సాకుతూ, వున్న యీ కొద్ది కాలంలో యిదంతా గ్రహించింది సీత! తన అక్కకు యీ యింట్లో నా గుండెల్లో యెంతటి స్థానముందో తెలుసుకుంది! అందుకే, కీర్తిశేషురాలైన రాధని అపకీర్తి పాలవ్వనియ్యకూడదని తనజీవితమే బలిచేయబూనింది ఈసీత!" అంటూ, చేతులు తలమీదుగా పైకెత్తి నమస్కరించాడు మోహన్‌బాబు.

అంతా అయోమయంగా చూశారు.

"అవును! ఈ త్యాగమయిని గురించి నే చెప్పగలను !" అంటూ మళ్ళీ మోహన్‌బాబు ప్రారంభించాడు. ఖిన్నుడైన మామగారి వంక, అచేతనంగా నిలబడ్డ రామారావు వంక ఓ క్షణం చూశాడు.

"నాకు పెళ్లైన తర్వాత, మా తొలినాటి పరిచయంలో రాధ నా కంతా వివరించింది ! రామారావుని తాను ప్రేమించిన విషయం, పెళ్ళాడా లనుకున్న విషయం, అతను మిలిటరీలో చేరి తనను మరచిపోవడం. చివరికి పిన్ని బలవంతాన తనకు పెళ్ళిచేయడం అంతా చెప్పింది. నేను మనస్ఫూర్తిగా మన్నిస్తే, గతం మర్చిపోయి. నాకు సేవచేసుకుంటూ బ్రతుకుతానంది ! అప్పటి నా సంగతి తెలుసు మీకు !

స్త్రీ వొక ఆటవస్తువు! నా అవసరానికి నేను సరేనన్నాను.

"కానీ, అనుభవాలు అనేకరకాల పాఠాలు నేర్పాయి. 'స్త్రీ ఆటవస్తువు కాదు! పురుషుడే వేటవస్తువు' అని గ్రహించాను! ఇల్లే ఓ ఆలయం; అందు భార్య అనే వో ప్రమిద ప్రేమజ్యోతిని జ్వలించి, అనురాగ దీప్తులను వెదజల్లు తుంది! గుడిలోనివాడు అదృష్టవంతు డైతే, ఆ జ్యోతి నిత్యమూ తనకు సేవ చేస్తుంది! కానీ, నేనో...వో దురదృష్ట వంతుడిని! అందుకే నా జీవనజ్యోతి నాకు దూరమైంది! దుఃఖాంధకారంలో దిగవిడిచిపోయింది!

"అలాగే, ఆ ప్రేమమూర్తి తనకు దక్కలేదన్న బాధతో, బహుశః యీ రామారావు ద్వేషభావంతో యిక్కడికి వచ్చివుంటాడు! రాధను చంపాలని పట్టుపట్టి వుంటాడు! యామై రైట్ మిస్టర్ రామారావ్?" మోహన్‌బాబు కంఠం గాద్గదికంగా వినిపించింది.

రామారావు అవునన్నట్లు తల ఆడించాడు మౌనంగా.

"పూర్ ఫెలో! మళ్ళీ డిస్సపాయింట్ అయ్యాడు. అకస్మాత్తుగా యీ సంగతి అతని ద్వారా తెలుసుకొని, విస్తు పోయుంటుంది సీత! తన అక్క జీవితంలో యిదొక మాయని మచ్చ అవుతుందని, ఆ కీర్తిశేషురాలికి అలాంటి కళంకం వాటిల్లకూడదనే ఒకే ఒక్క పూజ్యభావంతో ఆ నిందని తనమీద వేసుకొని, జీవితాన్ని బలి చేయడానికి సిద్ధపడ్డది సీత! ఇప్పుడు చెప్పండి మామగారూ! సీత చేసిన యీ త్యాగానికి యే శిక్ష విధించాలి?"

మోహన్‌బాబు మాటలకి సీత తండ్రి కనుకొలుకుల్లో అశ్రువులు నిలిచాయి.

మోహన్‌బాబు వడివడిగా గదిలో కెళ్ళి, క్షణంలో తిరిగివచ్చాడు.

"మీరు చెప్పలేకపోతే నేనే చెబుతాను మామగారూ! ఇదో! రాధకు ఆనాడు పెళ్ళిలో వేసిన యీ మాలను, ఇప్పుడు మీ సీతకు వేస్తున్నాను! ఇదే తన త్యాగానికి శిక్ష!" అంటూ రాధ ఫోటోనుండి తీసిన చెమ్కీమాలను సీత మెళ్ళో వేశాడు మోహన్‌బాబు.

సీత నిర్లిప్తంగా అతనివంక చూసి, అమాంతం అతని పాదాలమీద సోలిపోయింది.

మామగారు, రామారావు సజల నయనాలతో చూసారు

మోహన్‌బాబు సీత భుజాలను పట్టుకొని లేవనెత్తేసరికి, రామారావు రాధకోసంతెచ్చిన కాశ్మీరుసిల్కుచీరెను, ఆమెకు బహూకరించాడు దీవిస్తూ!

# గర్ల్ ఫ్రెండ్

వంక సరస్వతి



ఎలాగైతేనేం, ముష్టియుద్ధం చేసి బస్సులో పడ్డాడు సంతోష్. అతని కాలు ఒకటి క్రింద ఉండగానే రైట్ చెప్పేశాడు కండక్టరు. బస్సు లోపల ముందరివాళ్ళు వెనకవాళ్ళని, వెనక వాళ్ళు ముందరివాళ్ళని తోసుకుంటు న్నారు. ఎలాగో అందర్నీ తప్పించు కుని ముందరికి వచ్చి నిలబడేసరికి తలప్రాణం తోకకి వచ్చింది.

—అమ్మయ్య అని ఒకసారి గట్టిగా ఊపిరి పీల్చుకున్నాడు సంతోష్.

ప్రసవానికి సిద్ధంగా ఉన్న స్త్రీలా నడవలేక నడుస్తున్నట్లు భారంగా కదుల్తోంది డబుల్—డక్కర్ బస్.

కుడిచేత్తో బస్ కమ్మీకి వ్రేలాడు తున్న బెల్ట్ పట్టుకుని, రెండవ చేతిలో ఉన్న కర్చీఫ్‌తో మొహం తుడుచు కుంటున్న సంతోష్ దృష్టి నాకర్షించింది ముందర సీట్లో కూర్చున్న, పసుప్పచ్చ పరికిణీమీద నల్లవోణీ వేసుకున్న సుందరాంగి. ఆ చిన్నారి ఒడిలో మరో చిన్న వెండికప్పు—బహుమతి కాబోలు. రెండు చేతుల్తో దాన్ని పట్టుకుని దాని వైపే చూస్తోందా అమ్మాయి. అలా కూర్చున్న ఆ అమ్మాయి సంతోష్ కంటికి ముగ్ధ మ నో హ ర ం గా కనిపించింది.

'—ఎక్కడో చూసినట్లుగా వుందే ఈ అమ్మాయిని' అనుకుంటూ జ్ఞాపకం తెచ్చుకోడానికి ప్రయత్నించి విఫలు డయ్యాడు.

ఎందుకో తలెత్తిన ఆ అమ్మాయి కళ్ళు 'నువ్వు నాకు తెల్సులే' అన్నట్లు పల్కరించాయి సంతోష్‌ని.

అబ్బో! ఎంత బావున్నాయో ఆ కళ్ళు. కోటేరులా వున్న ఆ ముక్కు మరీ ముద్దొచ్చేస్తోంది సంతోష్‌కి. ఇన్నాళ్ళూ తన ఊహల్లో తిరుగాడిన సుందరి ఈ పిల్లే ననిపించింది. ఈ అమ్మాయిని ఎలాగైనా పరిచయం చేసుకుని తనదాన్ని చేసుకోవాలి. గట్టిగా నిర్ణయించుకున్నాడు.

ఇన్నాళ్ళకి తనకి ఒక పిల్లంటూ నచ్చినందుకు తన తల్లి దండ్రులు సంతోషిస్తారు. కానీ 'బొత్తిగా చిన్న పిల్లరా' అంటుందేమో అమ్మ. ఈ అమ్మాయికి మహా ఉంటే పదిహేనే వుంటాయి. అంటే తన వయసులో సగం అన్నమాట.

అయితే మాత్రమేం? ఆడవాళ్ళు యిద్దరు పిల్లలు పుట్టేసరికి ఆరిందాలు అయిపోతారు. తనక్కాబోయే భార్య చిన్నది గాబట్టి, ఒకళ్ళిద్దరు పిల్లలు పుట్టినా, అప్పుడే యవ్వనంలోకి అడుగు పెట్టిన నవయవ్వనిలాగే ఉంటుంది. తనని చూసి తన ఫ్రెడ్సంతా అసూయ పడాలపుడు.

బస్సు ఆగింది. దిగినవాళ్ళు లుగు

రయింది నెరజాణ...హవ్వ...హవ్వ! మీకు పెళ్ళయినా పర్వాలేదుట. రెండో భార్యగా ఉండటానికైనా సిద్ధమేనట... ఎంత బరి తెగించింది...ఇదంతా తెలిస్తే దాన్నెవరైనా చేసుకుంటారాని..."

అతను లక్ష్మీవంక కొరకొరా చూడటం మినహా యేమీ చేయలేక పోతున్నాడు. భార్య వాక్ప్రవాహము ఆగటంలేదు.

"రేపు దానికి మొగుడు దొరికి, అయన్నెవరైనా తన్నుకుపోవటానికి ప్రయత్నంచేస్తే తెలిసొస్తుంది అమ్మాయికి, ఆ బాధేమిటో? తన హక్కేమిటో!...అయినా ఇంకొకరి హక్కును తాను పొందటానికి ఎవతండి అది?" ఛాలెంజి చేస్తూ నిలదీసి అడిగేస్తుంది.

భార్య యెప్పుడూ యింత ఉగ్రరూపం దాల్చటం చూడలేదు.

ఇప్పుడేమి చెప్పినా వినదు. నమ్మదు.

ఎవరో ఒకరు తగ్గకపోతే గౌరవం నిలబడేటట్లులేదు. ఆమే తగ్గేటట్లులేదు. తన కా మార్గాంతరం కన్పించటం లేదు.

చివరికి గత్యంతరంలేక బయటి కెళ్ళిపోయాడు కోపంగా.

ఆఫీసునుండి వచ్చిన అన్నయ్యకు కాఫీ యిద్దామని కాఫీకప్పుతో వచ్చిన నీరజ తలుపు ప్రక్కన నిలబడి ఘర్షణంతా విన్నది. అన్నయ్య వెళ్ళిపోవటంతో తనూ వంటింట్లోకి దారితీసింది.

* * *

వారం రోజుల తర్వాతకూడా—

భర్త మీద ఆనాడు లేవనెత్తిన దుమారాన్ని తలచుకొని ముసిముసిగా నవ్వులు నవ్వుకుంటూనే ఉన్నది లక్ష్మి

పులిలాంటి మనిషి పిల్లిలా హడలిపోయారు

తను కల్పించి రాసిన ప్రేమలేఖ పీడనే అయన్ని హడలగొట్టినట్టుగాని, ఆఖరికి దస్తూరినికూడా గుర్తుపట్టకుండా జాగ్రత్త పడ్డట్లుగాని ఆయనకు తెలియనే తెలియదు పాపం!

ఈ రహస్యం, తను ఆడిన నాటకం ఆయనకు తెలియకూడదుకూడా!

ఆ రోజునుండి అనుకొన్న ఫలితం ఆడబిడ్డ నీరజలో కనపడసాగింది.

నీరజ యిప్పుడు గేటు దగ్గరకెళ్ళి ఎవరికోసమూ యెదురు చూడటంలేదు.

ఉవ్వెత్తున లేచి వచ్చిన కెరటం తీరాన్ని తాకి నిశ్చలపోయి నట్లుంది నీరజ యిప్పుడు.






ఫిబ్రవరి పంద్తొమ్మిది!

అంత తేలికగా మరుపొచ్చే దిన మేమీ కాదు సురేష్‌కి.

మూడేళ్ళ క్రితం-సరిగ్గా ఈ రోజు-

ఆఫీసు మెట్లు దిగుతూ సన్నగా నవ్వుకున్నాడు. అనుకోకుండా నిట్టూర్చాడు అప్పుడే గడిచిపోయాయి-మూడేళ్ళు'?

రోడ్డు వెంట నడుస్తూంటే మనసంతా అదోలా తయారయింది. రోజూ చూసే జనసందోహం, అవే భవనాలు, ట్రాఫిక్కు, గందరగోళం! గడియారంతో పందెం. ఇల్లు - ఆఫీసు. ఉదయం-సాయంత్రం. ఏమీ మారినట్టు లేదే-మరి-ఎలా గడిచిపోయాయి-మూడేళ్ళు!?

ఇల్లు దగ్గరవుతుండగా మనసంతా ఏదోలా అనిపించింది. హాయీ కాదు. బరువూ కాదు.

గుమ్మం వేపు చూశాడు-

అరడాటు తలుపు వెనుకనుంచి తనకోసం ఎదురుచూస్తూ-శ్యామల లేదు.

కొన్ని రోజులుగా (లేక - నెలలు గానా?-గుర్తులేదు!) శ్యామల సాయం

త్రాలు తనకోసం ఎదురుచూడటం లేదు.

ఆ సంగతి ఇన్ని రోజులూ పెద్దగా తట్టినట్టు లేదే తనకి? ఇవాళే - అదొక లోటుగా అనిపిస్తోంది!

ఫిబ్రవరి పంథొమ్మిది!

చెప్పులు గిరాటుగా మూలకి విసిరి బట్టలు మార్చుకుంటుంటే వొళ్ళ సారిగా చెప్పలేనంత నీరసమనిపించింది.

ఇంట్లోకొచ్చి ఇంత సేపవుతున్నా- శ్యామల కనిపించదు!

"వొచ్చారా!-"

అని రోజు రోజంతా ఎదురుచూసిన ఆర్ద్రతతో-ఆ పలకరింపు-ఏదీ?

"శ్యామలా!..."

జవాబు లేదు. బాత్‌రూం నుంచి చప్పుడు-బట్టలు మోదబడుతున్నాయి!

"శ్యామలా!..."

"ఆఁ!..."

అంతే. ఫిబ్రవరి పంథొమ్మిది! మూడేళ్ళు!

లుంగీ ఎగగట్టి బాత్‌రూంలో కెళ్ళాడు

బట్టలుతుకుతున్న శ్యామల స్వరూపం ఉల్లాసకరంగా ఏమీలేదు. చెరిరిపోయిన తల. అస్తవ్యస్తంగా చెక్కిన కుచ్చెళ్ళు. ముంజేతుల పైకి బిగుతుగా నొక్కి- చేర్చిన గాజులు. ముఖంలో అలసట.

"బట్టలుతుకుతున్నావా?"

"కనిపించటంలా."

"వినిపించను గూడా వినిపించింది- పనిమనిషి రాలా శి"

"పై పన్లయితే చేస్తాగాని-బట్టలుత కటమ్మాత్రం నా వల్ల గాదమ్మా-అని నిన్న సాయంత్రమే కరాఖండీగా చెప్పేసిందది...రూపాయో రూపాయి న్నరో ఎక్కువిస్తానన్నా వొప్పుకోలా- బట్టలుతకటం బండపనిట - సరే - తప్పేదేముంది."

అరిగిన సోపుతోనే ముఖ ప్రక్షాళనం ముగించాడు

తను వొకవేపు ముఖం కడుక్కుం టుంటే-మరోవేపు-ఉతుకుతూనే ఉంది శ్యామల. బండమీంచి చెదిరి మురికి నీళ్ళు తనమీద పడుతున్నా - పట్టించు కోవటంలేదు.

బట్టలుతకటం-బండ పనే!

అద్దంముందు నిలుచుని ముఖం మరమ్మత్తు చేసుకున్నాడు - ఇంకా! జుత్తు పలచబడుతోందా! ముక్కుకి అటూ ఇటూ నిలువుగీతలు బయలు దేరుతున్నాయా? బుగ్గలు వడిలిపోవటం మొదలవుతుందా? అప్పుడే!-

బట్టలారేసి వచ్చింది శ్యామల-పావు గంటకి.

"బాబుకి వొంట్లో బాగున్నట్టులేదు. మధ్యాహ్నమంతా అదోలా వున్నాడు- ఇందాకే పడుకున్నాడు"

గదిలోకెళ్ళి బాబును చూడాలని పించినా, వెళ్ళలేకపోయాడు. కుర్చీలో కూలబడ్డాడు.




'అద్భుతం' అనేప్పుడు - అతని కళ్ళలో మెరుపు—

నిజమే—

ఏరి కోరి కావాలనే ఏడిపించేవాడు సురేష్ తనని-తను అలిగేట్టు చేసేవాడు. అలకతీరిన తర్వాత ఆ దగ్గరతనంలో ఎంత హాయి...

తలుపు చప్పుడయింది. వెళ్ళి తలుపు తీసింది. నీరసంగా వొచ్చాడు సురేష్. సినిమాకు వెళ్ళినట్లు లేదు. ఎక్కడెక్కడో తిక్కతిక్కగా తిరిగొచ్చినట్టున్నాడు.

మౌనంగా లోపలికి దారితీసింది. కంచాలు సర్ది-వడ్డించింది.

మధ్య మధ్యలో పాత్రలూ గరిటలే మాట్లాడాయి.

ఇల్లు సర్ది తలుపులు మూసి వొచ్చే సరికి పక్క మీద వొత్తిగిలి పడుకున్నాడు సురేష్.

లైటు తీసేసి తటపటాయిస్తూ క్షణం నిలబడింది. బాబుదగ్గరి కెళ్ళి దుప్పటి సర్దింది. సురేష్ కదల్లేదు. పొడిగా దగ్గింది. వెళ్ళి అతనికి తగల కుండా పక్కనే కూచుంది. కొంత సేపటికి అతని చెయ్యి తగిలింది.

వెన్నెల—కిటికీ చువ్వలనుంచి శెలవు తీసుకునే వేళ - మెలకువ వొచ్చింది సురేష్‌కి

గుడ్డి వెల్తురులో శ్యామల కళ్ళు-దూరపు పడవలో దీపాల్లాగా మెరుస్తున్నాయి.

తలగడకి జేరగిలబడి-కిటికీ అవతలికి చూస్తోందామె.

"శ్యామలా-నిద్రపోలేదా?-"

"ఊఁ? ఊఁహూఁ...ఊఁ..."

"అదేంటి? కోపమొచ్చిందా? సాయంత్రం-"

ఆ సరికి శ్యామల మనసంతా తుపాను తర్వాత సముద్రంలా శాంతించింది. మౌనంగా అతడి చెంపను మునివేళ్ళతో రాసింది.

కోటి మాటలు చెప్పని అర్థం అందుకున్నట్టయిందతనికి. పసిపిల్లాడిలా ఆమెను పొదువుకుంటూ – "సారీ! అయామ్ రియల్లీ సారీ...వెరీసారీ!..." అన్నాడు.

చాలా సేపటికి గొంతు విప్పింది శ్యామల–

"నాక్కోపం రావటం లేదే, అన్యాయంగా ఎంత ఆపుకుందామన్నా ఆగట్లేదు–"

"పూఁ..."

"ఏమీ అనుకోకూడదు.."

"అనుకోను–"

"మరి–పెళ్ళికి ముందూ–పెళ్ళయిన కొత్తలోనూ నువ్వేమనేవాడివో గుర్తుందా? ఊరికే అనటం కాదు–అలిగినప్పుడు నన్ను చూడాలని ఎంత ఉబలాట పడేవాడివి! కావాలనే నన్ను ఉడికించేవాడివి! ఏడిపించేవాడివి!-"

"శ్యామలా! స్టాపిట్-సాయంత్రం నుంచీ ఇదే ఆలోచిస్తున్నావా?-"

"అవునూ-"

"సారీ-రియల్లీ వెరీసారీ - నీమీద విసుక్కుని అలా వెళ్ళిపోయాను చూడూ-పిచ్చెత్తినట్టు వూరంతా చెడ దిరిగాను-"

"తెలుసులే - అప్పుడప్పుడూ నీకు అలవాటేగా-"

"సారీ శ్యామలా! ... ఇకమీదట మనం వొకర్నొకరు ఇలా ఎప్పటికీ అపార్థం చేసుకోకూడదు-"

"ఊఁహుఁ..."

"తప్పు-మన ఇద్దరిదీ కాదు-"

"మరి-"

"నే కనుక్కున్న నిజం చెప్పనా-" ఆర్ద్రంగా ఆమె తల నిమురుతూ అన్నాడు-"నీలోనూ నాలోనూ మార్పు లేదు-మన ప్రేమ ఏమీ చెక్కుచెదర లేదు-కాని-నీ అలక-దాని సౌందర్యం-అది మాత్రం మారిపోయింది-మూడేళ్ళ క్రితం నీ అలక వెనక 'డబ్బు' ప్రసక్తి లేదు-ఇప్పుడు నీ అలక వెనక–'డబ్బు చాలకపోవటం' ఉంది..."



# రెండో కాపురం




సునంద మరోసారి ఆ ఉత్తరం చదివింది, డాబామీద కూర్చుని సాయం సంధ్యారాగంలో. కాని నమ్మకం కుదరలేదు. సునంద చిన్నాన్న కూతురు భార్గవి విజయనగరం నుండి రాసిన రెండో ఉత్తరం.

సుదీర్ఘమైన ఆ ఉత్తరం ఆఖరి పంక్తులివి "మగవాడి హృదయం కోర్కెల రెక్కల గుర్రం. దాని భార్య ప్రేమ బంధం అనే కళ్ళెం వేసి అదుపులో

ఉంచుకోవాలి. ఆ బంధంనుండి విముక్తుడైన మగవాడి వొంటరితనం పరిస్థితుల ప్రాబల్యం అనే వంకతోనో, మరో రకంగానో, లొంగిపోయి పతనానికి దారితీస్తుంది. భర్త తనవాడు అని ఎంత నమ్మకమున్నా ఈ నమ్మకం వొకప్పుడు మన కుటుంబ విచ్ఛిన్నానికి దారితీస్తుందో ఏమో! ఆలోచించు"...

"తనకన్నా చిన్నది భార్గవి యెంత సున్నితంగా తన అభిప్రాయాన్ని వెల్లడించింది." ఆశ్చర్యం వేసింది సునందకు. "యింకో గంటలో ఎలాగూ వస్తారు కదా! యేమిటో ఈ సంగతి తేల్చివేయాలి, ఆయన మనస్సుకు తెలుసు. అతను నిన్ను యెంత గాఢంగా ప్రేమించి పెండ్లి చేసుకున్నారో తెలుసు. యెంతగా ఆరాధిస్తున్నారో తెలుసు. అలాంటి వాడినా అనుమానిస్తావు; ఇది కేవలం నీ మనఃభ్రాంతియేమో! దీనివల్ల మీ మధ్యనుండే అనురాగబంధం విచ్ఛిత్తి అవుతుందేమో!"

"చేతులు కాలాక ఆకులు పట్టుకుంటే లాభం యేముంది?"

మనస్సులో ఆలోచనల ప్రతిరూపాలు ప్రతిధ్వనిస్తున్నాయి. "యెలాగైనా సున్నితంగా చెప్పాలి. వ్యవహారం చెడగొట్టుకోకూడదు. తను ఏమాత్రం భర్త ననుమానించినా అతను మొండికేస్తే–"అమ్మో యింకేమేనా ఉందా!" అనుకుంది మనసులో. భయంతోనే కళ్ళు మూసుకుంది. భార్గవి రాసిన మొదటి ఉత్తరంలో కొన్ని పంక్తులు ఆమెకింకా జ్ఞాపకం ఉన్నాయి. "మా వీధికి అవతల మూడు వీధుల తర్వాత బావగారు ఒకరూము తీసుకున్నారు. అప్పటికీ మీ మరిదిగారూ, నేనూ చెప్పాం మేం అద్దెకున్న ఇంట్లోనే వొక రూం ఖాళీగా ఉందని, అందులో ఉండమని. కానీ ఆయన అంగీకరించలేదు. మూడు నాలుగుసార్లు మీ మరిదిగారు బ్రతిమాలారు. కానీ బావగారు మొండి పట్టు మనకు కొత్తేంకాదు. మొన్నోసారి ఆ వీధిలోనే ఉండే మీ మరిదిగారి ఆఫీసు కొలీగ్ కొడుకు బర్త్‌డే ఫంక్షనుకు ఆ వీధి కెళ్ళాను. అప్పుడు మీ మరిదిగారు, బావగారి రూమ్ చూపించారు. పెద్ద మేడింట్లోనే ఆయన రూమ్ సంపాదించారు. ముందుభాగం లోనే వుంది.

తర్వాత ఆ మేడింట్లో చాలా అందమైన ఆడపిల్లలు కన్పించారు. ఆ ఇంటాయన రైల్వేలో రిటైరయిన పెద్దఉద్యోగస్థుడట. ముగ్గురాడపిల్లలట. అందులో పెద్దమ్మాయికి పాపం భర్త పోయాడట. మెరపుతీగలా ఉంటుం దనుకో! గార్డెన్ లో చూశాను, మొక్కల్ని చూస్తూంటే ఆమెను. పేరంటం కొచ్చినవాళ్ళు, ఆమె చాలా గొప్పగా వీణ వాయిస్తుందని..."

తర్వాత మరి సునంద వర్తమానంలోకి వచ్చేసింది.

"మమ్మీ? డాడీ యింకా యెప్పు డొస్తారే" అన్న కొడుకు రవిని గాఢంగా గుండెలకు హత్తుకుంది. అప్రయత్నంగానే, భయంతో ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"యిప్పుడే వస్తారు బాబూ! యింకా విజయనగరంనుండి బస్సు రాలేదు కదా!" అంది. డాబామీద కూర్చుంటే సూర్యమహల్ దగ్గర ఆగే బస్సులు కన్పిస్తాయి.

"మమ్మీ! మనం గూడా డాడీ దగ్గరకు వెళ్ళిపోదాం" అన్నాడు రవి ముద్దు ముద్దు మాటలతో.

"అలాగే బాబూ! ఈసారి నాన్నగారు రాగానే నువ్వే అడుగు."

"యేమండోయ్! సునందగారూ! మీ ఆయనగారింకా రాలేదా! ఈవారం పత్రికలో మీ ఆయనగారి కథానిక ప్రచురణ జరిగిందండి. చదివాను. చాలా బాగుంది ఈ మధ్య మీ ఆయన మంచి మంచి కథలు రాస్తున్నారండీ! నిజంగా మీ రెంతో అదృష్టవంతులండీ, మంచి రచయిత భర్తగా దొరకటం." పొరుగింటి డాబా యజమానురాలు కనకవల్లి, జాజిపూలదండ గుచ్చుతూ ప్రశంసించింది. నవ్వేసింది సునంద.

"అవును నిజమే! కానీ నా అంత రంగంలో అంతర్జ్వాలలో జ్వలిస్తున్న హిమజ్వాల మీకేం తెలుసు" అనుకుంది ఉత్తరం మడిచేసి, మెట్లు దిగుతూ.

రాత్రి పదయింది. భర్త కిష్టమైన వన్నీ తయారుచేసినవి చల్లారి పోయాయి. రవి డాడీకోసం యెదురు చూసి, నిద్రలోకి జారుకున్నాడు.

భర్తను ఈ రాత్రే అడిగేయాలి. తెల్లారితే ఆదివారం. ఆయనొచ్చేరని ఫ్రెండ్సందరూ వొచ్చేస్తారు. కాస్సేపు సాహిత్య ప్రసంగం. ఆ తర్వాత చతుర్ముఖ పురాణం. సాయంకాలం సినిమా, మళ్ళా ఉదయం విజయనగరం ప్రయాణం.........

తలుపు చప్పుడయింది. యెదురుగా రాంబాబు, తన భర్త! "సారీ సునందా! బస్సు లేటయింది." రణస్థలం దగ్గర ట్రబులిచ్చేసింది. అందువల్ల లేట్ అయింది." బేగ్ పక్కన పెడుతూనే సునందను రెండుచేతుల్తోనూ దగ్గరకు తీసుకున్నాడు. సునంద నిర్లిప్తంగా గాఢ పరిశ్వంగంనుండి విడిపించుకుంది.

ప్రతీ శనివారం భర్త సమంగా సాయంకాలం ఆరుగంటలకు వచ్చేసే వాడు. అలాంటిది ఆ మెరుపుతీగ ఆఖరు బస్సుకు వెళ్ళమని చెప్పి ఉంటుంది. సునంద మనస్సులో అనుమానాలు గాలిలో మేడల్లా లేస్తున్నాయి.

"యేమిటో దేవిగారు చాలా

మౌనంగా వున్నారు. చెప్పానుకదా, లేటుకు కారణం. మమ్మల్ని కొంచం అనుగ్రహించండి. డైనింగ్ టేబిల్ దగ్గర, దగ్గరకు తీసుకున్నాడు.

"చారు కొంచెం వేడిచేసి తీసుకు రానా...?" మాట మార్చింది.

"అక్కర్లేదు. దేవిగారే వేడిగా ఉన్నారు. పదార్థాలూ, ఈ డైనింగ్ టేబిల్‌తోబాటూ నేనూ వేడెక్కిపోయాను" అన్నాడు నవ్వి.

సునందకు నవ్వు వచ్చింది చాలా చమత్కారంగా, సున్నితంగా మాట్లాడ తాడు. అదే ఆకర్షణలోనే తను అతన్ని ప్రేమించింది, ఆరు సంవత్సరాల క్రితం. అప్పుడు రాంబాబు, విశాఖలో తమ యింట్లో ముందున్న రూమ్‌లో అద్దెకు ఉండేవాడు. అతనే రాంబాబని, మంచి కథారచయితనీ ఆమెకు తెలియదు. ఒకనాడు పోస్టులో వచ్చిన చెక్కు, పత్రిక, గది తలుపులు తాళం వేసి వుంటే, పోస్టుమేన్, వాళ్ళింట్లో యిచ్చిపోయాడు. అప్పుడు తెలిసింది అతడు రచయితని. పెళ్ళయిన తర్వాత రాంబాబుకు శ్రీకాకుళం ట్రాన్స్ఫర్ అయింది. ఆర్నెల్ల క్రితం విజయనగరం ట్రాన్స్ఫరు, వొంటరి జీవితం మేడింట్లో ముందుగది అమ్మాయి ... భయంతో వొళ్ళు గగుర్పొడిచింది, సునందకి మళ్లీ.

బెడ్‌రూంలో ట్రాన్స్‌ఫార్మర్ బల్బు మందంగా వెలుగుతోంది. పాలమీగడ లాంటి బెడ్‌షీట్, చుట్టూ దోమతెర. సిగరెట్టు కాల్చుకుంటున్నాడు రాంబాబు. సునంద పాలగ్లాసుతో వచ్చింది.

"యింతకీ దేవిగారు యివాళ మూడ్‌లో లేకపోవడం మా దురదృష్టం" అన్నాడు జరీపువ్వుల తెల్లచీరలోవున్న సునందను చూస్తూ.

"బాబు మీకోసం చాలాసేపు చూసి నిద్రపోయాడు."

"నేను నీకోసం వారంరోజులు విరహంలో కొట్టుకొని నలభై మైళ్ళు నాలుగున్నర గంటలు ప్రయాణంచేసి మరీ వచ్చాను..." రాంబాబు సునందను కౌగిట్లోకి తీసుకుంటూ.

భర్తముఖం పరిశీలనగా చూసింది సునంద. ముఖంనిండా అక్కడక్కడా గాట్లు నఖక్షతాలా లేక దంతక్షాతాలా ఆ మెరుపుతీగ వలలోనో, ఆ అమ్మాయి వలలోనో..." మరింక ఊహించలేక కళ్ళు మూసుకుంది సునంద.

"యేమిటీ ఆలోచిస్తున్నావ్?'' బుగ్గ మీద మధురమైన ముద్ర.

"ఏమైనా మీరు విజయనగరం వెళ్ళిన తరువాత చాలా మారిపోయారు."

"అంతే..." దగ్గరకు తీసుకుంటూ.

"చాలా బాగా నీరసించిపోయారు. ఆ హోటల్ భోజనం తిని యెన్నాళ్ళు - చూడండీ ఆ బుగ్గలు యెలా లోతుకు పోయాయో..." ప్రశ్నించింది.



"కొంతకాలం తప్పదు సునందా నాకీ వనవాసం.

"యెందుకండీ మీకీ వనవాసం. విజయనగరంతో మంచి యిళ్ళు దొరకవా? వాతావరణం మంచిది కాదా! మీరు శనివారం రావటం సోమవారం వెళ్ళటం ..." అసలు అనుమానం బయటకు చెప్పలేకపోయింది.

"చాలా బాగుంటుంది విజయనగరం. సాహితీ సంస్కృతుల నిలయం. ఇళ్లూ మంచివి దొరుకుతాయి. అయినా ఆర్నెల్లుగా లేంది ఈవాళ యెందుకడుగుతున్నావ్, ఈ ప్రశ్నలన్నీ..."అన్నాడు రాంబాబు అనుమానంగా. సునంద భార్గవి రాసిన ఉత్తరం సంగతి చెప్పలేక పోయింది.

"యేం లేదండీ. బాబు మీ దగ్గరకు వెళ్ళిపోదాం మమ్మీ అంటున్నాడు."

"బాబా! నువ్వా ... ఇంకెంతకాలం, ఓపికపట్టు..." రాంబాబు సునందని మరి మాట్లాడనివ్వలేదు.

* * *

శనివారం సాయంకాలం మళ్లా డాబా మీద కూర్చుని ఆలోచిస్తున్నది సునంద. సూర్యమహల్ దీపాల తోరణాలు మినుకు మినుకుమంటూ వెలుగుతున్నాయి, ఆమె మనసులోని ఆలోచనలు మినుకు మినుకుమంటూ మెదులుతున్నాయి. ఆమె మనసులోని ఆలోచనలతో అనుమానాలతో స్నేహం చేసి. 'ఆదివారం, సోమవారం కేంపు వెళుతున్నాను రాలేనంటూ' రాంబాబు రాసిన ఉత్తరం ఆమె చేతిలో గాలికి రెపరెప లాడుతోంది. "యేంలేదు - అక్కడే ఉండిపోయి ఉంటారు. అందంగా ఉండే రచయిత అంటే ఎవరికి మోజు ఉండదు. ఆ మేడింటి వాళ్ళు యేదో పిక్నిక్ వేసుకుని ఉంటారు.

అందమైన అమ్మాయిల్ని చూస్తే, ఏ మగవాడికి మనసు చంచలంకాదు. ఈ రచయితల ఆదర్శాలన్నీ రాతలవరకే." ఆమె మెదడు అనుమానం చెదపురుగు దొలిచేస్తోంది.

ఆమె మనసులో యెలాగ సమాధానం పెట్టుకుందామన్నా రాజీపడటంలేదు.

భార్గవి తర్వాత రాసిన రెండు సుదీర్ఘమైన లేఖలు ఆమెను మరేం ఆలోచించనివ్వటంలేదు. అందులో కొన్ని వాక్యాలు ఆమె మనః ఫలకం నుండి తొలగిపోవడంలేదు.

"మళ్లా ఈ మధ్య ఆ వీధి పేరంటానికి వెళ్ళాను. పేరంటానికి వచ్చిన ఆ వీధిలో కొంతమంది అమ్మలక్కలతో పరిచయం కలిగింది. అలాంటివాళ్ళేనట ఆ మేడింటివాళ్లు. యెప్పుడూ యీయనగారి గదిలో దీపం వెలుగుతూనే ఉంటుందిట. నేను మీ మరిదిగారితో యీ విషయం అంటే 'ఛా ! అన్నయ్య గురించి అలా మాట్లాడకు' అని మందలించారు. కానీ ఆయన కూడా మొన్న జరిగిన సంఘటనతో నా వాదన సరైనదేనని అంగీకరించారు. ఈ మధ్య 'కల్పన' సినిమాకు వెళ్లాం. ఆ మేడింటివాళ్ళ ఆడపిల్లల్తోబాటు శ్రీబావగారు వచ్చారు. ఆ మెరపులీగా వచ్చింది. యింకచూడు ఇంటర్వెల్లులో నవ్వులు కేరింతాలు. డ్రింకులు త్రాగడం. ఈ కళ్లతో చూసిన దృశ్యాలు మరి రాయలేను. ఆ ఆడపిల్లలందరూ నిజంగా కుందన బొమ్మల్లాగే ఉంటారు.

బావగారు నిన్న వస్తే, "యేమిటన్నయ్యా అంత నీరసంగా ఉన్నావు. కళ్ళు లోతుకుపోయినాయి. రాత్రిళ్ళు సమంగా నిద్రపోవటంలేదా ?" అని అడిగారు మీ మరిదిగారు.

"లేదు. సమంగా నిద్రపోనివ్వడం లేదు సరస్వతీదేవి. యేం చేస్తాం ? నా కీ రెండో కాపురం తప్పదనుకుంటాను" అని నవ్వుతూ సమాధానం చెప్పారు.

"వాళ్ళలో ఒక అమ్మాయి పేరు సరస్వతీదేవనుకుంటాను మరి. వాళ్ళు బాగా ఉన్నవాళ్ళట గూడాను. యివన్నీ యెందుకు రాస్తున్నానంటే తమనితాము సమర్థించుకోవటానికి ఈ రచయితలు. పరిస్థితుల ప్రాబల్యం అంటూ...ఏదో ఒకటి మొదలుపెడతారు మరి...యిలా రాశానని......"

సునంద ఆలోచనల తెరలన్నీ తెగిపోయాయి. కనకవల్లి డాబామీదనుండి పిలుస్తోంది. "యేమండోయ్ ఈ నెల మీవారి ప్రోగ్రెస్ బాగుందండోయ్; నాలుగు పత్రికలలోనూ నాలుగు కథలు, మాసపత్రికలో సీరియల్ నవల ప్రారంభం. ఈసారి పత్రికలవాళ్ళు పంపించే డబ్బుతో పట్టుచీర కొనుక్కోండి. చాలా బాగున్నాయండి

కథలు. సీరియల్ యెత్తుగడలోనే పాఠకు ల్నాకర్షించేసిందండి. యెలా రాస్తారో ఈ మగవాళ్ళింత చక్కగా..." కనకవల్లి కాంప్లిమెంట్సు అందించేస్తుంది. ఉచితంగా మల్లెలమాల కుట్టుకుంటూ

"కొంపతీసి ఈ కనకవల్లి గూడా తన భర్తని ప్రేమించేస్తుందా ఏమిటి?" అన్న సందేహం కలిగింది. కనకవల్లి మీద చాలా కోపం వచ్చింది. ఆ కోపం క్రింద హాలులోకి వచ్చేసింది. యేదో నిశ్చయానికి వచ్చిన సునంద మనస్సు విశాఖపట్నం ఉత్తరం రాసినంతవరకూ తేలికపడలేదు

* * *

విజయనగరం కొత్త అగ్రహారంలో రాంబాబు ఉండే మేడంటికి రిక్షాలో చేరుకుంది సునంద. గదికివున్న రాంబాబు నేమ్‌బోర్డు చూసింది. గదిలో లైటింకా వెలుగుతూనే ఉంది. వాచీ చూసుకుంది. పదకొండున్నర దాటింది. భార్గవి రాసినవీ చెప్పినవీ నిజమేననుకొంది. నెమ్మదిగా పిల్లిలా గేటు తీసుకుని లోపలికి వెళ్ళి గదిదగ్గర నిలబడింది. లోపలనుండి నవ్వులు, కేరింతలు, వినబడతాయేమోననుకొంది. కాని గదిలో నిశ్శబ్దంగా ఉంది.

"నిజమే అస్తమానం మాట్లాడుకుందికి యేం ఉంటాయి. ఒకరి కళ్ళల్లోకి వొకరు చూసుకుంటూ యెదురెదురుగా కూర్చుని...తర్వాత మరి ఆలోచించలేకపోయింది సునంద. తనూ రాంబాబూ ప్రేమించుకున్న తీపిగురుతులు జ్ఞాపకం వచ్చాయి. అతనిలో ఆ ఆకర్షణ, లాలన, విద్య వుంది.

నెమ్మదిగా తలుపుదగ్గరకు వెళ్ళి నిల్చుంది తలుపు తీసే ఉంది. అయితే ఆమెగారు ఇంకా రాలేదన్నమాట. తలుపుకొడితే యెక్కడ శబ్దం అవుతుందేమోనని తీసి ఉంచారు. కోపం వచ్చింది సునందకు, ఈ మగవాళ్ళ ప్లానులమీద. నెమ్మదిగా తలుపు తోసింది 'యెవరదీ?' టేబిల్‌మీద పుస్తకం మూసేసి వెనక్కి తిరిగి చూశాడు

తననుకున్నది నిజమే! ఆయన ఆమెకోసం వెయిట్ చేస్తున్నారు. ఆమాత్రం చిన్నశబ్దాన్ని గూడా పాము చెవుల్లా పసిగట్టారు. పాపం యెంత విరహంతో ఉన్నారో యేమో! సునంద మనస్సు ఈర్ష్యపడింది

"యెవరదీ స......" రాంబాబు నోటిమాట రాకముందే ఆ పేరుపెట్టి ఎక్కడ పిలుస్తారేమోనని సునంద లోపలికి అడుగుపెట్టింది.

రాంబాబు ఆశ్చర్యపోయాడు. చెయ్యిమీద గిల్లుకున్నాడు. "అల్లా గిల్లుకోకండి. మీరుకలగనడంలేదు...మీ స...ను కాను, నేను సునందను..." అంది కొంచం కోపంగా.

"యిదేమిటి యింత హఠాత్తుగా

వచ్చావ్ ! యెప్పుడొచ్చావ్ ? భోంచేసేవా...?"

"ఆ భోజనం చేశాను. రాత్రి ఏడు గంటలకు భార్గవీవాళ్ళ ఇంటికి వచ్చాను" అంది తలవంచుకునే.

"అసలు సంగతేమిటి ? బాబేడీ ?" ప్రశ్నించాడు.

"యేంలేదు. ఊరికనే చూద్దామని. భార్గవి రమ్మనమని ఉత్తరం రాసింది. మా అమ్మ శ్రీకాకుళంనుంచి వస్తే బాబుని ఉంచేసి వచ్చాను."

"యేమిటంత అర్జంట్. మీ చెల్లెలికి వేవిళ్ళాఏమిటి ?" అతని ప్రశ్నకు సమాధానం చెప్పకుండా రూమంతా చూస్తోంది. చిన్న సోఫా, డన్‌లప్ సింగిల్ బెడ్డు, టేబిల్ లైటు, గోడకు అందమైన ఆర్టు పెయింట్స్ బాగానే ఉంది రూము.

"యేమిటంత పరధ్యానంగా చూస్తున్నావ్?..."

మళ్ళీ తలుపు చప్పుడయింది, చేతిలో ట్రేతో మెరపుతీగ ప్రత్యక్షమయింది. అందులో టీ పొగలు కక్కుతోంది. భార్గవి రాసినదానికన్నా చాలా అందంగా ఉంది. చేతికి బంగారుగాజులు. మెడలో రవ్వల నెక్లెస్ చాలా ఖరీదయిన చీరలో అప్సరసలా వుందామె! ముఖాన బొట్టు లేదు.

"టీ తీసుకోండి" అంటూ సునంద వైపు ఆశ్చర్యంగా చూసింది.

"సరూ !"

భార్గవి అనుమానం నిజమే అయింది. 'సరూ' అని యేకవచన ప్రయోగం చేసి పిలుస్తున్నాడు తన భర్త.

"ఈమెగారు...మీ వదిన. ఈమె ఇంటిగలవారి పెద్దమ్మాయి; పేరు సరోజిని..." అన్నాడు పరిచయం ముగించి. సునంద కింకా ఆశ్చర్యం వేసింది. ఈ సరోజిని కాక మరో సరస్వతీ ఉండాలి ఇంట్లో. కాని నిదానం మీద తెలుస్తుంది అనుకుంది, మనస్సులో కోపంగా; తన భర్త చివరకు గోపాల కృష్ణుడిలా తయారయినాడో యేమో !

"హాయ్! వొదినగారూ, మీ గురించి చాలాసార్లు అన్నగారు చెప్పారు. మిమ్మల్ని తీసుకురమ్మన్నాం. మా ఇంట్లో పోర్షను ఇస్తామని నాన్నగారు చెప్పారు. కాని అన్నగారు అందుకు వొప్పుకోలేదు..."

"యెందు కొప్పుకుంటారూ ! మరి రెండో కాపురం వెలగబెట్టాలికదా..." మనసులోనే అనుకుంది సునంద కోపంగా సభ్యతకోసం చిరునవ్వు పెదాలమీదికి తెచ్చుకుంటూ.

"ఉండండి ఇప్పుడే అందరితోనూ చెప్పి వస్తాను..." అని వెనుతిరిగింది సరోజిని.

"సరూ! ఇప్పుడు వద్దు. యింట్లో అందరు నిద్రపోతున్నారు. రేపొద్దునే చూస్తారు మీ వదిన్ని...నీవు పోయి




పడుకో" అన్నాడు రాంబాబు ఆప్యాయంగా టీకప్పు చేతిలోకి తీసుకుని.

"పాపం సరస్వతిని చూస్తానని ఈయనకి భయమేమోమరి" అనుకుంది సునంద.

"మీ కేమయినా బ్లాంకెట్స్ కావాలా" సరోజిని గుమ్మం అవతలనుండే అడిగింది.

"యేం అక్కర్లేదమ్మా ......" అన్నాడు రాంబాబు తలుపు గడియ వేస్తూ.

అర్ధరాత్రి దాటింది. సునందకు మెలకువ వచ్చింది. రేడియం దయలు మూడు గంటలు చూపిస్తోంది. గదిలో లైటులేదు. రాంబాబు పక్కమీద లేడు. సుమారు ఇరవై నిముషాల వరకూ రాంబాబు వత్తాలేడు. సునంద అనుమానం మరింత బలపడింది. యెక్కడో తోటలో, ఆమే, యీయనా...సిగ్గులేక చలిలో...మరి ఆలోచించలేకపోయింది. 'ఛా' సిగ్గుతో కళ్ళుమూసుకుంది. ఇనీ యెలాగయినా యీ దొంగల్ని పట్టాలి. నిలదీసి అడిగేయాలి. యిలాంటి ప్రలోభాల్లో చిక్కుకుని వుండటం వల్లనే, శ్రీకాకుళం తిరిగి ట్రాన్స్‌ఫరు చేయించుకోకుండా వున్నారు. యీవాళతో యీయనతో అమీతుమీ తేల్చుకుంటారు," అని నెమ్మదిగా లేచింది సునంద.

బయట వరండామీద లైటు వెలుగుతోంది. తలుపుతోసేసరికి కన్పించే దృశ్యం, సునందని ఆశ్చర్యంలో ముంచేసింది.

రాంబాబు వరండా మెట్లమీద కూర్చుని రాసుకుంటున్నాడు. అతని

ప్రక్కగా కాగితాలు దొంతు పెట్టబడి వున్నాయి. అతని కళ్ళు బాగా యెరుపెక్కి వున్నాయి. వెలుగులోనికి చొరనీయకుండా, అతని సువిశాల వక్షస్థలాన్ని టర్కీటవల్ కప్పుతోంది.

సునంద నెమ్మదిగా వెళ్ళి అతని ప్రక్కగా మీది మెట్టుమీద కూర్చుంది. పిల్లగాలి తెమ్మెరలు, ఆమె నుదుటమీద ముంగురులతో నాట్యమాడుతున్నాయి. చుట్టుప్రపక్కల దేన్నీ గమనించనంత శ్రద్ధగా, దీక్షగా రాసుకుపోతున్నాడు. కొన్ని క్షణాల తర్వాత రాంబాబు తలెత్తి చూశాడు.

"నువ్వా! సునందా! నిద్రపట్టలేదా?" లాలనగా అడిగాడు.

"కొత్త ప్రదేశం కదా, అందుకని..." యేం సమాధానం చెప్పాలో తోచక అనేసింది.

లోపల హాల్లో వున్న గడియారం ఐదు గంటలు కొడుతుండగానే తలుపులు తెరచుకున్నాయి.

"గుడ్‌మార్నింగ్ ... వొదినగారూ, అన్నయ్యగారూ" అంటూ మిగిలిన ఆడపిల్లలు బయటకు వచ్చేశారు. భార్గవి రాసినట్లు అందరూ ఆణిముత్యాలే.

అందర్నీ పరిచయం చేశాడు రాంబాబు. అందరూ సునంద చుట్టూ మూగారు. వెనకాతల సరోజిని వచ్చింది కాఫీ కప్పుతో, "మీ వదినగారు వస్తే కాని పూర్తికాలేదమ్మా" అన్నాడు రాంబాబు, సరోజినితో. సరోజిని కళ్ళు ఆనందంతో మెరిసాయి. సునందకు అర్థంకాలేదు. అర్థమయింది. అలా వుందామెస్థితి.

"అందరూ వదినగార్ని కొరికేకండర్రా, వంతులవారీ పంచుకుందాం. ఆడబిడ్డలందరూ అర్ధ మొగుళ్ళన్న సంగతి తెలియాలి. ముందు ఆమెను స్నానంచేసి రానీ, పదండి మీరంతా. తొందరగా తెమలండి, తన్నయ్యకూ, వదినకూ బ్రేక్‌ఫాస్ట్ యిక్కడే..." అంతే.

సునంద మనస్సు ప్రఫుల్లమయిపోయింది, వాళ్ళ అనురాగానికి.

"పద లోపలికి పోదాం. యిప్పటికి నవల పూర్తయింది" అన్నాడు లేస్తూ, సిగరెట్టు వెలిగించుకుని.

ఆ కాగితాలన్నీ దొంతుగా పెట్టింది. నవలపేరు చదివింది, అంతే. మరి స్థబ్దురాలైపోయింది. ఆ నవల పేరు "సరస్వతి."

"యేమిటాలోచిస్తున్నావ్?" మృదువుగా రాంబాబు, సునంద భుజం మీద చెయ్యి వేశాడు. ఆమె అలా తన గుండెల్లోనే తలదాచుకుంది. పశ్చాత్తాపంతో ఆమె కళ్ళు జలపాతాలయ్యాయి.

పిచ్చి సునందా! యెందుకు? యేం జరిగిందని, నువ్విలా వస్తావని నాకు ముందే తెలుసు..."

"యెలా?" ఆశ్చర్యంగా, అతనివేపు చూసింది తడి రెప్పలతో.

"అవును సునందా. చదువు వేరు. సంస్కారం వేరు. భార్గవిలో మొదటిది వుంది. రెండోది లేదు. నేను వాళ్ళం దరితో చనువుగా వుండటం, ఆమె జెలసీ ఫీలయింది. నీ కేదో అన్యాయం జరిగిందని భావించి ఉత్తరం రాసి వుంటుంది. రచయితగా నేను యీ మాత్రం సైకాలజీ స్టడీ చెయ్యగలను. నా జీవితం చిన్నప్పట్నుంచీ నీకు చెప్పాను. తల్లీ, తోబుట్టువులూ యెవ్వరూ లేక యెంతగా అలమటించిపోయానో నీకు తెలుసు. అలాంటిది సరోజినీ చెల్లెళ్లు, అందరూ నా జీవితంలో అమృతం వెదజల్లారు. తోడబుట్టిన చెల్లెళ్ళుకూడా యిలా చూడరేమో! ఈ పవిత్రబంధం యెంత అదృష్టం చేసుకుంటే లభిస్తుంది. యింక మిమ్మల్ని యిక్కడకు యెందుకు తీసుకురాలేదంటే, అసలిప్పటికే ప్రమోషను రావల్సింది. మళ్ళా యెక్కడికో తీసికెళ్ళడం యెందుకని ఆగాను.

యీ వియోగం తాత్కాలికం. అంతే కాక శ్రీకాకుళంలో నా సాహిత్య వ్యాసంగం, మిత్రులవల్ల యెంత వెనక్కి పడిపోయిందో నీకు తెలుసు. యిక్కడి కొచ్చాకనే, చాలా రచనలు రాస్తున్నాను. డబ్బేకాక, మంచిపేరు కూడా సంపాదిస్తున్నాను. వొక ధ్యేయంతో ముందుకు సాగిపోతున్నాను. లేనిపోని నీవు పడే అపోహలు నా కాటంకాలవుతాయి..."

మరి మాట్లాడనియ్యలేదు సునంద.

"పొరపాటు నాదేనండి..." అంది బాధగా.

"పొరపాటు నీదికాదు. మిమ్మల్ని పుట్టించిన బ్రహ్మదేవుడిది. అనుమానం ముందు పుట్టించి మిమ్మల్ని తరువాత పుట్టించాడు."

"పోదురూ మీరు మరీను..." అంది సునంద చిరుకోపంతో.

"పోతాను. తమ రీ రెండో కాపురానికి అనుమతిస్తే" అంటూ దగ్గరకు తీసుకున్నాడు. సునంద తృప్తిగా అతని గుండెలమీద తలవాల్చి నిండుగా ఊపిరి పీల్చుకుంది.






నా చుట్టూ ఒంటరితనపు గూడు అల్లుకున్నాను. అందులో ఎవరికీ ప్రవేశం లేదు! నాకు ఎవరితోనూ మాట్లాడా లని వుండేదికాదు! వీలయినంత సేపు పుస్తకాలు చదవటంలో గడిపేవాడిని. విసుగుపుడితే, గంటలతరబడి వాకింగ్‌కి వెళ్ళేవాడిని! ఇంటికి ఎవరైనా వస్తే, నేను నాగదిలో కూర్చుని తలుపులు మూసుకునేవాడిని! కవిత, కల్పన తప్ప నాతో మాట్లాడే వ్యక్తి మరొకరు లేరు. అక్కయ్య నాకు మళ్ళీ పెళ్ళిచేయటానికి తాపత్రయ పడసాగింది.

"పెళ్ళా! నాకా! నే నిట్లా శాంతిగా బ్రతకటం నీ కిష్టంలేదా?" ఆవేశంగా అరిచాను.

"ప్రసాదూ! నువ్వు ప్రతిదానికీ అలా కోపం తెచ్చుకుంటే ఎలాగురా! నువ్వు చిన్నవాడివి! నీ జీవితం గడవాల్సింది ముందు ఎంతో వుంది. ఎన్నాళ్ళిలా వుంటావు! జరిగిపోయిన ఆ పెళ్ళి ఒక పీడకలలా మర్చిపో!" అంది.

"పీడకలా! ఆ కలలోనే నేను బ్రతుకుతున్నాను!"

"నిన్ను ఆ కలలోనుంచి బైటకి లాగటానికే యీ పెళ్ళి."

"వద్దు అక్కయ్యా, వద్దు యిలాగే

"ఓ! డార్లింగ్," జయ గొంతు అతి మధురంగా విన్పిస్తోంది.

నా రక్తం మరుగుతున్నట్టు అయింది. నాలో నేనే మళ్ళీ చెప్పుకోసాగాను. "ప్రసాద్! జయ యిప్పుడు నీకు ఎవరు? ఎందుకు ఆవేశపడతావు? డాక్టర్‌గారు ఏమని చెప్పారు? ఆవేశపడే ప్రతి మనిషీ పిచ్చిమనిషే నన్నారు జీవితం బెండుముక్కలా తేలిపోవాలి అనలేదూ! లోకంలో ఎంతోమంది అమ్మాయి లున్నారు, వాళ్ళను చూసి నువ్వు ఈర్ష్య పడుతున్నావా?"

"వాళ్ళందరూ వేరు. జయ వేరు."

"అని నువ్వు అనుకుంటున్నావు; కానీ జయ నిన్ను మిగతా అందరినీ చూసినట్టే చూస్తోంది? జయ దృష్టిలో ప్రసాద్ అనే వ్యక్తికి విలువేలేదు." ఈ తర్కంతో నన్ను నేను సంబాళించు కున్నట్లుగా తలపట్టుకుని కూర్చున్నాను!

సర్వర్ బిల్ తెచ్చాడు. జేబులో డబ్బుతీసి అందులో పెట్టి లేచి వచ్చేసాను.

నన్ను నేను నిగ్రహించుకుంటు న్నాను! నాలోనుంచి క్రూరమృగంలా బయటికి వురకబోతున్న యీ ఆవేశానికి పగ్గాలు వేసి, కాళ్ళు, నోరు బంధించి, బందీ చేస్తున్నాను.

దాన్ని బందీ చేయటానికి నాకు చాలా శక్తి కావాల్సి వస్తోంది. నేను బస్‌స్టాప్ దగ్గర నిలబడ్డాను.

జయ అతనితో బైటికి వచ్చింది. ఎర్రటి కారువైపు నడిచాడు. అతను డ్రైవింగ్ సీటులో కూర్చున్నాడు. జయ అతని పక్కకి వచ్చి కూర్చోబోతుండగా, నన్ను చూసింది.

నాలో కసిలాటిది వెల్లువలా వచ్చేసింది.

రెండడుగులు వేసి దగ్గరగా వెళ్లాను.

"హలో! డార్లింగ్!" వ్యంగ్యంగా పలకరించాను.

నాపిలుపులో ప్రేమకంటే, అవమానమే ఎక్కువగా వుంది. నన్ను చూడగానే జయముఖం వెలవెలాపోయింది. నా పలకరింపుకి సమాధానం ఏం చెప్పడమా అన్నట్టుగా కనుబొమలు ముడిచింది.

"ఎవరతను?" అతను అడిగాడు.

"ఎవరో పిచ్చివాడు." కూర్చుని లాగి గట్టిగా డోర్ వేసేసింది.

నేను ఒక అడుగువేసి, ఆ కార్ డోర్ తెరువబోయాను. కానీ నా చేతికి అందలేదు. అప్పటికే ఆ కారు వెళ్ళిపోయింది. (సశేషం)



ఉండనీ నన్ను. నీకు పుణ్యంవుంటుంది. నాకు పెళ్ళిమాట తలపెట్టకు. నేను చాలా సుఖంగా వున్నాను. చేతులు జోడించాడు.

"నువ్వు పెళ్ళి నీకోసం కాదు, మా కోసం చేసుకుంటానని అనుకోరా" అంది.

"వద్దక్కయ్యా! మీకోసం యింకేది చేయమన్నా చేస్తాను ఈమాట మాత్రం నాదగ్గర ఎత్తకు. నాకింకేం చెప్పకు, వెళ్ళు" అన్నాను. అక్కయ్య వెళ్ళి పోయింది!

"పెళ్ళట, పెళ్ళి! ఆ నరకంలో తెలియని అమాయకత్వంతో అప్పుడు అడుగుపెట్టాను ఇప్పుడు అది ఎంత భయంకరమో తెలుసుకుని ఎలా ఒప్పు కుంటాను! చిన్నపిల్ల నిప్పు ముట్టుకుం టుందని తెలియక ఆసక్తితో అందుకుం టుంది! అనుభవంగల పెద్దవాళ్ళు ఆ పని చేయగలరా!"

నేను మంచిపనే చేసాను! అక్క య్యకి ఖచ్చితంగా నా అయిష్టం తెలియ చేసాను అనుకున్నాను.

కానీ అక్కయ్య వూరుకోలేదు ఆ ప్రసంగం అంతటితో సమాప్తి చేయ నీయ లేదు. మళ్ళీ మళ్ళీ పదే పదే ఆ మాట చెప్పసాగింది. నాన్నకూడా, సమ యం దొరికితే, యిదే నస ప్రారంభించే వాడు. భోజనానికి కూర్చుంటే యిదే సంభాషణ! కాఫీ తాగుతున్నా యిదే ప్రసక్తి! ఎప్పుడు కాస్త సమయం దొరికినా, నా పెళ్ళిని గురించిన విష యం ఒక చర్చావేదిక అయిపోయింది!

అక్కయ్య బంధువులందరిచేత నాకు చెప్పించింది!

చివరకి పెళ్ళిచేసుకోకపోతే తనకీ, నాకూ సంబంధం లేదని, వేరే వెళ్ళి వుండమని అంది.

నేను నిలువునా నీరయ్యాను! నేను ఒంటరిగా వుండదమా! అందులో యీ పరిస్థితుల్లో! నాలో అంతర్యుద్ధం ప్రారంభమైంది. చివరికి ఎలాగైతేనే ఒక అమ్మాయితో నా పెళ్ళి సెటిల్ అయింది! తాంబూలాలు పుచ్చుకున్నారు. ముహూర్తాలు నిర్ణయించారు! పెళ్ళి తిరుపతిలో సింపుల్‌గా చేయాలను కున్నారు.

మా ప్రయాణం ఆ రోజునే!

నేనూ, అక్కయ్యా, పిల్లలు మాత్రమే వెళ్ళటానికి నిర్ణయం అయింది. పిల్ల తరపున ఆమెగాక ఆమె తండ్రి వస్తు న్నారు. ఎక్కువ ఖర్చులేకుండా,సందడి చేయకుండా, అమూడుముళ్ళ తతంగం జరగాలని అక్క ఆరాటం.

మేం ప్రయాణానికి అన్నీ సర్దు కున్నాం! పెళ్ళివారు రాలేదు! చూసి చూసి విసుగెత్తిపోయిం! మధ్యవర్తి సాయంత్రం వచ్చాడు. "మాకు కాస్త మాట అయినా చెప్పకూడదా! వాళ్ళెం దుకు రాలేదు? ప్రయాణం అయి ఎదురు

చూసిచూసి చచ్చాం" అంటూ అక్కయ్య గయ్‌మని లేచింది.

"ఆగమ్మా, ఆగు. అక్కడ పిల్ల తండ్రిచేత తిట్లు తిని, తిని వచ్చాను. అక్కడ వాళ్ళింట్లో పెద్ద గొడవగా వుంది," అన్నాడు.

"గొడవా ! ఎందుకు ? ఏమైంది?"

"వాళ్ళకి యితని మొదటిభార్య వుత్తరం వ్రాసింది. అందులో ఇతను పిచ్చివాడని, కావాలంటే హాస్పిటల్‌కి వెళ్ళి ఎంక్వయిరీ చేసుకోమని వ్రాసింది. యిదంతా మనం దాచిపుచ్చి వాళ్ళని మోసం చేస్తున్నామట! ఈ పెళ్ళి చేసే కంటే, ఆ పిల్లకి యింత విషం యిచ్చి చంపేయమని వ్రాసింది!"

"ఏమిటీ! జయవుత్తరంవ్రాసిందా!" అక్కయ్య నీరసంగా, కుర్చీలో కూలబడిపోవటం, నేనుగమనిస్తూనే వున్నాను

"ఆ పిల్ల, ఆక్కడెక్కడో పల్లెటూరులో వుందికదా, ఇవన్నీ తెలియవు అనుకున్నాం కదండీ!"

"అని నేనూ అనుకున్నాను. కానీ గాలికంటే వేగంగా, యీ వార్త వాళ్ళకి తెలిసింది చూడండి. ఆపిల్ల 'నేను బావిలో పడి చస్తానుగానీ, యీ పెళ్ళి నాకు వద్దు' అంటూ ఒకటేఏడుపు. అక్కయ్య నోటమాటరాని మూగదానిలా చూస్తోంది.

"అక్కయ్యా ! మొదటినుంచి నేను పెళ్ళి వద్దుమొర్రో అని చెబుతూనే వున్నాను. కానీ నువ్వు విన్నావా ! చెయ్యి! యింకెన్ని పెళ్ళి ప్రయత్నాలు చేస్తావో చెయ్యి. యింకొంతమంది నన్ను పిచ్చివాడు, పిచ్చివాడు అని అని హేళన చెయ్యనీ, చెయ్యనీ! నీ కిదే సంతోషం అయితే, నాకేం అభ్యంతరం లేదు. నే నేమో కీలుబొమ్మలా నిలబడతాను" నేను ఆవేశంగా అనేసి అక్కడి నుంచి వెళ్ళిపోయాను.

పిచ్చివాడు! పిచ్చివాడు ! అసలు నాకి పిచ్చి ఎక్కించిందెవరు? నా మనసులో అగ్ని పర్వతాలు బ్రద్దలవుతున్నాయి. నన్ను నేనే నిందించుకున్నాను! నాకు నేనే బుద్ధిచెప్పుకున్నాను. ఛ, ఛీ! డాక్టర్ నాకేం చెప్పాడు. 'ఏవిషయాన్ని సీరియస్‌గా తీసుకోవద్దని అన్నాడు. జీవితం తేలికగా నీళ్ళమీద బెండులా తేలిపోవాలి! దానికి ఆవేశం, భారం కాకూడదు! జీవితాన్ని సీరియస్‌గా తీసుకున్నవాళ్ళంతా పిచ్చివాళ్ళే,' అన్నాడు.

ఈ పెళ్ళి ఆగిపోయినందుకు నాకేం బాధ లేదు. కానీ అక్కయ్య మాత్రం చాలా కృంగిపోయినట్టయింది! అక్కయ్య తర్వాత తర్వాత ప్రయత్నించినా, పిచ్చివాడనే విషయం అందరికీ తెలియటం వల్ల, ఎవ్వరూ నాకు పిల్లనివ్వటానికి సాహసించలేదు.

నా పెళ్ళి ప్రయత్నాలు అంతటితో ఆగిపోలేదు. మా బంధువుల్లో ఒకరిద్దరు, "నీ తమ్ముడికి ఎక్కడో సంబంధాలు

వెతకడం దేనికి, నీ కిద్దరు కూతుళ్ళు వుంటేను. నాలుగేళ్ళు ఆగావంటే నీ తమ్ముడిని అల్లుడిని చేసుకుని ఆ యింటికి నువ్వే శాశ్వతంగా యజమానివి కావచ్చు." అన్నారు.

అక్కయ్య చెవికి యీ మాట బాగా ఎక్కిందో లేక, సంబంధాలు కలిసిరాక నిరుత్సాహపడిందోగాని, నాకు మాత్రం ఆ పెళ్ళి బెడద తప్పిపోయి, తాత్కాలికంగా, పెళ్ళి సంగతి వాయిదాపడింది.

నేను ఒంటరివాడిని! కానీ యీ ఒంటరితనంలో నాకు ఎంతో శాంతి, ఆనందం దొరుకుతున్నాయి.

టాంక్ బండ్, పబ్లిక్ గార్డెన్, సికిందరాబాద్‌లో పెరేడ్ గ్రౌండ్ యివి నా విహార స్థలాలు! ఒకసారి, తాజ్ హోటల్లో కూర్చుని కాఫీ తాగుతున్నాను. మధ్యాహ్నం కావటంవల్ల హోటల్లో ఎక్కువ రద్దీ లేదు. నేను కూడా ఓ మూలగా కూర్చున్నాను. అసలు నేను ఏ చోటుకి వెళ్ళినా, అది నాటకం థియేటర్ అయినా, సినిమాహాలు అయినా, హోటల్ అయినా, ఒక మూల చూసుకుని కూర్చుంటాను. ఆ ప్రదేశంనుండి చూస్తే అందరూ నాకు కన్పిస్తారుగానీ, పరిశీలనగా చూస్తే తప్ప, నేను ఎవ్వరికీ కనిపించను!

ఇంతలో ఆ హోటల్లోకి ఇద్దరు వచ్చారు! ఆ అమ్మాయి అధునాతన యువతి. అతను కూడా వేషభాషల్లో ఆ అమ్మాయికి ఏం తీసిపోడు

"ఇక్కడ కూర్చుందామా?" అతను అడిగాడు.

"నో డార్లింగ్! అక్కడికి పోదాం. ఐ వాంట్ ప్రైవెసీ." ఆ అమ్మాయి గోముగా అంది కాఫీకి ఆర్డర్ యిచ్చి కింద చూస్తున్న ఆ అమ్మాయిని చూసాను. వెంటనే నిటారుగా అయాను. ఆంగ్లో ఇండియన్‌గా కన్పిస్తూన్నా ఆ అమ్మాయి ఏవరో కాదు! జయ. జుట్టు బాగా పొట్టిగా కత్తిరించుకుంది కంఠం చుట్టూ పాములావున్న సన్నటి గొలుసు మెరుస్తోంది. వేసుకున్న మేక్సీలో శరీరం ఒంపుసొంపులు స్పష్టంగా కన్పిస్తున్నాయి! హఠాత్తుగా చూస్తే పెళ్ళికాని పిల్లలా వుంది. జయ బిడ్డల తల్లి అని చెప్పినా ఎవ్వరూ నమ్మరేమో! ఇద్దరూ ఫామిలీ రూమ్‌లోకి వెళ్ళారు. సర్వర్ నన్ను కూర్చోపెట్టి ముందు వాళ్ళకి ఏం కావాలో కనుక్కోవటానికి వెళ్ళాడు.

నాకు అక్కడ కూర్చోవటం కంపరంగా వుంది. లేచి వెళ్ళిపోదామా అనుకుంటుండగా, సర్వర్ బయటికి వచ్చి 'వన్ మినిట్ సర్' అని లోపలికి పరుగెత్తి కాఫీ తెచ్చాడు.

నేను కాఫీ తాగక తప్పలేదు.

ఎదురుగా గదిలోనుంచి నవ్వులు విన్పిస్తున్నాయి.



# కసి

కొలిపాక రమామణి

శ్యామల చేత్తో బిడ్డని జోకొడుతున్నా, మనసు ఎటో ఆలోచిస్తోంది. ఉదయంనించి జరిగిన సంఘటనలు ఒకటొకటే మనోఫలకంమీద బొమ్మల్లా కదలాడుతున్నాయి. తొమ్మిదింటికి పెద్దవాళ్ళిద్దరినీ స్కూలుకి పంపి వీధిలో నుంచుంటే పక్కింటి సీత "శ్యామలా 'మిస్సమ్మ' సినిమాకి వస్తారా? ఈ రోజు ఆఖరి రోజు" అంది. శ్యామల సరేనంది. గబగబ తక్కిన పనులు ముగించి, చంటివాడిని తయారుచేసి సినిమాకి బయలుదేరింది. ప్రక్కింటి సీతా,

అన్నపూర్ణలతోకలిసి ఉదయం సినిమాకి వెళ్ళడం శ్యామలకి అలవాటే. వీళ్ళు వెళ్ళేసరికే న్యూస్ రీల్ మొదలు పెట్టేశారు.

"శ్యామలా, మీ ఆయన కదూ ?" అంది అన్నపూర్ణ, బాగా ముందు వరసలో కూచున్న రాజారావుని చూపిస్తూ, ఇంటర్ వెల్‌లో. శ్యామల ఆశ్చర్యంగా చూసింది. అతనే. ప్రక్కనే ఇంకో స్త్రీ.

"ఎవరావిడ?" అంది అన్నపూర్ణ.

"ఏమో !" అంది శ్యామల, ముభావంగా, సంశయంగా చూస్తూ.

ముగ్గురాడవాళ్ళూ రాజారావునీ, ప్రక్కావిడని కుతూహలంగా గమనిస్తూ కూర్చున్నారు. శ్యామలకి ఒళ్ళంతా ముళ్ళు గుచ్చుకున్నట్టుగా వుంది.

రాజారావు ప్రక్క కూర్చున్నావిడ చామనచాయగా, నాజూగ్గా ఉంది. తెల్లటి ఆర్గాండీ చీర కట్టింది. దానిమీద గులాబిరంగు దారంతో చిన్న చిన్న పువ్వులు కుట్టి వున్నాయి. పొట్టి జుత్తుని, వెనక్కి కుచ్చులా రబ్బరు బాండ్‌తో బంధించింది. రాజారావూ, ఆమే టీ తాగుతున్నారు. ఆమె చాలా హుందాగా ఉంది.

"మీ అబ్బాయిని పంపండి. వాళ్ళ నాన్నని పిలుస్తాడు" అంది అన్నపూర్ణ.

శ్యామల మాట్లాడలేదు. పిల్లవాణ్ణి క్రిందకి దింపలేదు.

"ఎవరో ఆవిడ ? మీ చుట్టాలా ?"

"ఊహుఁ" అంది శ్యామల.

"ఆయన ఆఫీసులో పని చేస్తోం దేమో!" అంది సీత.

లైట్లు ఆరాయి. సినిమా తిరిగి ప్రారంభమైంది. సినిమా అంతా చక్కటి హాస్యంతో నిండివుంది. ప్రేక్షకులు నవ్వుతున్నారు. సీతా, అన్నపూర్ణా హాయిగా సినిమాకథలో లీనమైపోయారు. కాని శ్యామల కళ్ళకి ఒక్క బొమ్మ కనబడ లేదు. ఒక్కమాట వినబడలేదు. ఆమె మనస్సు అక్కడలేదు.

సినిమా అయింది. రాజారావూ, ఆమే ముందు కదిలారు. శ్యామలా, సఖులూ వెనక నడిచారు. ఆటో ఎక్కబోతూ శ్యామల, ప్రక్కకు చూసి గతుక్కుమంది. ఆమె ఏపిల్ పళ్ళు కొంటోంది. రాజారావు పక్కనే నిలబడి ఇటువైపే చూస్తున్నాడు. ఒక్కనిమిషం అతని కళ్ళు శ్యామల కళ్ళతో కలుసుకున్నాయి. శ్యామల తల తిప్పేసుకుంది. ఆటో కదిలిపోయింది.

ఇంటి కెళ్ళిన గంటకి సీత వచ్చి, శ్యామల తలుపుకొట్టింది. శ్యామల అన్యమనస్కంగా వచ్చి తలుపుతీసి, వెళ్ళి కూర్చుంది. చిన్నవాడు మరమరాలు ఏరుకుతింటున్నాడు.

"శ్యామలా, కాఫీ త్రాగారా ?" అంది సీత.

"లేదు."

"అలా కూచుంటే ఏమౌతుంది శ్యామలా! లెండి. తర్వాతఆలోచించుకో వచ్చు. పిల్లలు వచ్చే వేళైంది."

శ్యామల కదలలేదు.

"ఈరోజు మీరూ ఆవిణ్ణి చూశారు కనక చెప్తున్నాను శ్యామలా. మీ ఆయనా, ఆవిడా రెండేళ్ళనించీ కలిసి తిరుగుతున్నారు. మా ఆయన చూసారు. మన వీధిలో చాలామందికి ఈ విషయం తెలుసు."

"నాతో ఎందుకు చెప్పలేదు మీరు?" అంది శ్యామల. ఆమెలో దెబ్బతిన్న పక్షి కోపం ఉంది.

"ఎలా చెప్పం శ్యామలా? మీ ఆయన ఎవరితోనో తిరుగుతున్నాడనా? ఇంతకీ వాళ్ళిద్దరి సంబంధం తెలియదు. మీ సంసారం చక్కగా వుంది. లేనిపోనివి చెప్పి కలతలు కలిగించడం దేనికి?" సీత చాలా అనునయంగా చెప్పింది.

ఆ మాటా? యీ మాటా చెప్తూ సీత చాలాసేపు కూచుని, పిల్లలు వచ్చాక వెళ్ళింది.

శ్యామల వంట అయిందనిపించి, పిల్లలకి పెట్టి, పడుకోబెట్టింది.

"మొగుడు కొట్టినందుకు కాదు, తోటికోడలు నవ్వినందుకు" అన్నట్టు శ్యామలకి ఆ వీధివారిమీద కోపంగా ఉంది. తనవెనక ఎంతమంది నవ్వు కుంటున్నారో? అందరికీ తెలుసుట. తనకే యీ విషయం ఆఖరున తెలిసింది. అనుమానించడానికి కూడా రాజారావులో, అతని ప్రవర్తనలో కొట్టవచ్చిన తేడా ఏమీ కనిపించలేదు శ్యామలకి. పెళ్ళైన దగ్గరనించీ ఒక్కలాగే ఉన్నాడు. ఉదయం తొమ్మిదింటికి ఆఫీసుకని ఇల్లు వదిలితే, రాత్రి మళ్ళీ తొమ్మిది, పదిగంటలకి ఇల్లు చేరడం. ఇంటిఖర్చుకని శ్యామల అడిగినంత డబ్బు ఇస్తాడు. పిల్లలను ఎక్కువ చేరతియ్యడు. అలా అని దూరంగా నెట్టివెయ్యడు.

తలుపు టకటక లాడింది. శ్యామల వెళ్ళి తలుపు తీసింది. రాజారావు ఏమీ జరగనట్టే వచ్చాడు. బట్టలు మార్చుకుని, కాళ్ళు కడుక్కుని వచ్చాడు. "భోజనం పెడతావా?" అన్నాడు భార్యదగ్గరికి వచ్చి. వంటకాలన్నీ వెచ్చచేసి పెట్టడం అలవాటు శ్యామలకి. అప్రయత్నంగానే ఆమె లేచి, వంటకాలు వెచ్చచేసి టేబిల్‌మీద పెట్టింది.

"నువ్వు తిన్నావా?" అన్నాడు రాజారావు, భోజనానికి ఉపక్రమిస్తూ.

శ్యామల మాట్లాడలేదు. అతను రెట్టించి అడగలేదు. అతను భోజనం చేస్తూ వుంటే, శ్యామల కోపంతో ముందుగదిలోకి వెళ్ళి కూర్చుంది.

రాజారావు భోజనంచేసి, వక్కపలుకు వేసుకుని ముందుగదిలోకి వచ్చి, చేతిలోకి పేపరు తీసుకున్నాడు. అతని

నిర్లక్ష్యం చూస్తే ఒళ్ళుమండింది శ్యామలకి.

"ఆవిడెవరు ?" అంది తీక్షణంగా చూస్తూ.

"హూఁ ?" తలపైకి ఎత్తేడు రాజారావు.

"మీతో సినిమాకి వచ్చినావిడ ఎవరు ?"

"సునీత."

"మీ ఆఫీసులో పనిచేస్తోందా ?"

"కాదు."

"రెండేళ్ళుగా మీ ఇద్దరూ కలిసి తిరుగుతున్నారుట. నాతో ఎందుకు చెప్పలేదు ?"

"నీకుతెలుసు ననుకున్నాను."

"ఎలా అనుకున్నారు ?" ఆమెలో కోపం రెట్టించింది.

"అందరికీ తెలిసినట్టే, నీకూ తెలిసి వుంటుందని లేదా ఎవరేనా చెప్పి వుంటారని."

"నా కెవ్వరూ చెప్పలేదు."

రాజారావు మాట్లాడలేదు.

"మీ ఇద్దరిదీ ఎలాంటి సంబంధం?"

"నువ్వు అనుకునేలాంటిదే."

"అంటే ?"

"నువ్వు నాకు ఎంతో, సునీతా అంతే."

"నేను భార్యని, ఆవిడ నాతో సమానం ఎలా అవుతుంది ?" ఉద్రేకంతో శ్యామల కంఠం తీరబోయింది.

"నీ మెళ్ళో తాళి కట్టాను. ఆమె మెళ్ళో కట్టలేదు. అదే తేడా." రాజారావు తాపీగా అన్నాడు.

"ఇద్దరు భార్యలా ?"

"అలాగే అనుకో." అతని నిర్భీతికి అసహ్యించుకుంది శ్యామల.

"మీరిలా అన్యాయంగా మాట్లాడుతూ వుంటే, నే నింక ఏమనగలను ?"

"ఉండు శ్యామలా, ఉద్రేకం వద్దు. సావకాశంగా మాట్లాడుకుందాం." తాపీగా అన్నాడు రాజారావు.

ఆమె మాట్లాడలేదు.

"నాకూ, సునీతకీ మూడేళ్ళనించీ పరిచయం ఉంది. ఎలా అయింది, ఎక్కడ అయింది అంటూ పాత కథలు తిరిగి చెప్పకోడం అనవసరం. కాని ఆ పరిచయం పెరిగి, అనుకోని రూపం దాల్చింది."

"ప్రణయంలోకి మారింది అంతేగా!"

"నువ్వే పేరుతో పిలిచినా అభ్యంతరంలేదు కాని మా ఇద్దరిమధ్యా పరస్పరాకర్షణ పెరిగింది. ఆమె చదువూ, తెలివితేటలూ, విషయ పరిజ్ఞానం, మాట తీరూ – నన్ను ఆవిడవైపుకు లాక్కువెళ్ళాయి. నాలో ఆవిడ ఏం చూసిందో, కాని సునీతా నాకు చేరువైంది."



"మీరు వివాహితులనీ, పిల్లలు ఉన్నారని తెలుసా ?"

"సునీతకి మనింటి విషయాలు అన్నీ తెలుసు."

"హుం. అన్నీ తెలిసే మీతో అలా తిరుగుతోందా ?"

"అది నువ్వనుకున్నంత తొందరగా జరగలేదు శ్యామలా ! ఎంతో ఘర్షణా, మానసికంగా ఎంతో అశాంతీ అనుభవించాం."

"చివరికి నా మనశ్శాంతి తుడిచేసారుగా! అయినా, నేను మీకంత నచ్చకపోతే ఎందుకు పెళ్ళి చేసుకున్నారు ?"

"నువ్వు నచ్చకపోతే చేసుకునేవాడిని కాను. ఇప్పటికీ నీలో నాకేం లోపం కనిపించదు."

"అందుకే దాన్ని తగులుకున్నారు." కసిగా అంది శ్యామల.

రాజారావు ముఖం చిటపటలాడింది. "అంత నీచంగా మాట్లాడకు శ్యామలా."

"ఇప్పుడు నన్నేం చెయ్యమంటారు? నాకు విడాకులిచ్చి, ఆ విడ ని చేసుకుంటారా ?"

"నీకు నేను విడాకులు ఇవ్వను. ఎప్పటిలాగే మన సంసారం నడిచిపోనీ."

"అదెలా సాధ్యం ? ఆవిడ సంగతీ, మీ సంబంధం తెలిసాక నేను మీతో కాపరం చెయ్యలేను" శ్యామల చరచరా పడకగదిలోకి వెళ్ళి చంటివాడి పక్కన పడుకుంది. ఆమె మనసులో కోపం, ఉక్రోషం, ఈర్ష్య!

కాస్సేపటికి రాజారావు వచ్చి, తన మంచంమీద పడుకుని అన్నాడు – "ఈ మూడేళ్ళుగా నీకు ఏ సంగతీ తెలియదు. మన సంసారం సాఫీగా సాగిపోతూ ఉంది. నా ప్రవర్తనలో తేడా ఏమీ నీకు కనిపించలేదు. ఇకముందూ నీ యెడల నా ప్రవర్తన మారదు. నీకూ, పిల్లలకి ఏ హానీ జరగదు."

"మీరు మా నుంచి దూరంకావడం కన్న పెద్ద నష్టమేమిటి వుంటుంది ?" శ్యామల కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"మీకు నేను ఎప్పుడూ దూరం కాను" అన్నాడు రాజారావు.

శ్యామలకి రాత్రంతా నిద్దరపట్టలేదు. ఎన్నో ఆలోచనలు, శంకలు, భయాలు. రాజారావు పిల్లలు కలగకుండా ఆపరేషన్ చేయించుకున్నాడు. మరి ఆ సునీతకి ఈ సంగతి తెలుసా ? ఎందు కీయనని పట్టుకున్నట్టు ?" ఎన్నాళ్ళు పట్టుకుంటుంది ?

రోజులు గడుస్తున్నాయి. శ్యామల ఏ నిర్ణయానికీ రాలేకపోయింది. రాజారావుకి విడాకులు ఇద్దామనుకుంది. కాని యీ వయస్సులో తనకి ఉద్యోగం ఎవరిస్తారు ? ఒక దర్జాలో బ్రతుకుతున్న తను డబ్బు యిబ్బందులు పడుతూ పిల్లలని పైకి తీసుకురాగలదా ? కాలు ముందుకువెయ్యాలంటే పిల్లల భవిష్యత్తు అడ్డువస్తోంది. కాని తను ఊరుకుంటే ఆమెని తిన్నగా తెచ్చి ఇంట్లోనే పెడతాడేమో రాజారావు !

"నేనే ఇలాంటి పని చేసివుంటే మీకు ఎలా ఉండేదో ?" అంది శ్యామల ఒకరోజు రాజారావుతో.

"ఎలాంటి పని ?"

"అదే, ఇంకో మగవాడిమీద మోజు కలిగిందని చెప్పి, వేరే తిరుగుతూ ఉంటే."

"అవును శ్యామలా, నేనూ అలాగే ఆలోచిస్తూవుంటా. నా భార్య యింకో పురుషుడితో తిరుగుతే నేను సహిస్తానా అని ! ఆ ప్రశ్నకి నాకు జవాబు దొరకనేలేదు.''

"మీకేం ఎన్ని మాటలైనా చెప్తారు. ఇవాళ సునీత, రేపు ఇంకో గీత.

సిరిలేని వాళ్ళకి ఎంతమంది అయితేనేం?" శ్యామల కసి తీర్చుకుంది.

"పొరపాటు శ్యామలా. నేను వ్యభిచారిని కాను."

"మరి, దీని పేరేమిటో ?" సణుక్కుంది శ్యామల

శ్యామల ఏ నిర్ణయం తీసుకోకుండానే రోజులు దొర్లిపోతున్నాయి. రాజారావు మునపటిలాగే అడిగినంత డబ్బు శ్యామల కిస్తున్నాడు. అతని దినచర్యలో మార్పులేదు శ్యామల మాత్రం భర్తకి శారీరకంగా దూరమైంది. ముభావంగా అతని అవసరాలు చూస్తుంది.

శ్యామల రాత్రీ, పగలూ ఆలోచించింది. కాని తన సమస్యకి పరిష్కారం కనిపించలేదు రాజారావుని వదిలేసి, పిల్లలతో సంసారభారం మొయ్యలేదు. అలా అని అతనితో సంసారం చెయ్యలేదు.

శ్యామల మానసికంగా చిత్రహింస అనుభవించింది. అతను డబ్బు ఇస్తాడు. తనని మర్యాదగానే చూస్తాడు. కాని మనిషికి కావలసిన ప్రేమ కరువైంది. రాజారావు ప్రేమా, వ్యామోహం అంతా ఆ రెండవ స్త్రీ మీదే !

ఎందుకిలా జరిగింది ? శ్యామల గిజగిజ లాడింది. తను పెద్దగా చదువుకోలేదు. సునీత అంత నాజూకుగా ఉండదు. నిజమే! కాని యిన్నాళ్ళ తమ వైవాహిక జీవితం అంతా బూటకం అంటే శ్యామలకి కడుపులో కలిచినట్టాతోంది.

ఆమె వ్యథతో సంబంధంలేకుండా రోజులూ, నెలలూ గడిచాయి. పిల్లలు పెద్దవాళ్ళు అవుతున్నారు. శ్యామల దృష్టంతా పిల్లలమీదే కేంద్రీకరింపబడింది. భర్తకి దూరమైన కొద్దీ, పిల్లలకి చేరువైంది. తల్లీ, పిల్లలూ ఒకరిగా మెలిగారు.

పిల్లలు పెద్దవాళ్ళు అవుతుంటే రాజారావులో కూడా మార్పు వచ్చింది. అతడు శ్యామలకి దగ్గిరగా రావాలనీ, పిల్లలతో ఎక్కువ సమయం గడపాలనీ ఆశించేవాడు. కాని శ్యామల యింకా దూరం జరిగింది.

"నీ పద్ధతి నాకేం అర్థంకావటం లేదు" అన్నాడు రాజారావు, ఆ రాత్రి శ్యామలతో.

శ్యామల మౌనంగా ఉండిపోయింది.

ఎన్నాళ్ళిలా దూర దూరంగా ఉంటావు ?" రెట్టించాడు రాజారావు.

"మీరే నన్ను దూరంచేశారు."

"చేసుకున్న భార్యనే ప్రేమించాలని ఏదైనా రూల్ ఉందా ? ఒక మగవాడు ఇద్దరు స్త్రీలను ప్రేమించకూడదా ?"

"నేను మిమ్మల్ని ఎప్పుడూ తప్పు పట్టలేదు మీ మనసుకు తోచినట్టు మీరు చేశారు. నా మనసు చెప్పినట్టు నేను నడుచుకుంటా " శ్యామల చాలా శాంతంగా జవాబు చెప్పింది.

"నీకు నేను ఏం తక్కువ చేశాను? నువ్వు కోరినంత డబ్బు ఇస్తున్నాను."

"అందుకే మీకు భోజన సదుపాయం చేస్తున్నాను."

"పిల్లలను కూడా నాకు దూరం చేస్తున్నావు. వాళ్ళు నాదగ్గిరకి చనువుగా రారు, మాట్లాడరు." రాజారావు కంఠంలో విచారం వుంది.

"ఇన్నాళ్ళూ మీకు పిల్లల అవసరం కనిపించలేదు. వాళ్ళని ఏనాడూ చేర తియ్యలేదు...మీ వ్యామోహంలో మీరు వున్నారు. పిల్లలు కూడా పెద్దవాళ్ళు అవుతున్నారు. వాళ్ళకీ జ్ఞానం వచ్చి మంచీ, చెడ్డా తెలుస్తోంది. ఒక్కసారి మీరు ఆప్యాయత ఒలకబోసి రమ్మంటే, వాళ్ళు ఉక్కిరి బిక్కిరి అవుతారే కాని లేని ప్రేమ నటించలేరు."

రాజారావు సాలోచనగా భార్యవైపు చూశాడు. ఆమెలో చాలా మార్పు కనిపించింది. మునపటి అమాయకత్వం లేదు. కస్సుబుస్సుమనే కోపం లేదు. ఒకరకమైన శాంతం వచ్చింది. కాని ఆ నెమ్మదితనం ఎదుటి వ్యక్తిని స్థిరంగా ఉండనివ్వక కలవరపెడుతోంది.

రాజారావు భార్యకి తిరిగి దగ్గిర అవ్వాలనే ప్రయత్నంలో విఫలు డయ్యాడు. తన ఇంటికి తనే అతిథిగా మారాడు. పిల్లలూ, శ్యామలా ఒకటి – తను పరాయివాడు.

అతనికి హఠాత్తుగా సునీతమీద ఉండే వ్యామోహం, ఆకర్షణ తగ్గిపో జొచ్చాయి. చేరువవుతున్నకొద్దీ వారిద్దరి మధ్యా భేదాభిప్రాయాలు పొడచూపాయి. అతని లోపాలు ఆమెకి, ఆమెలోని బలహీనతలు అతనికి తెలిసిపోయాయి.

రాజారావు నిర్లిప్తంగా కాలం వెళ్ళ బుచ్చాడు. పిల్లలు పెరిగి పెద్దవాళ్ళు అయ్యారు. చదువులూ, వారి వివాహాలు జరిపించారు శ్యామలా, రాజారావు. కొడుకు లిద్దరూ ఉద్యోగరీత్యా దూర ప్రదేశాలు వెళ్ళారు. కాలం ఎంత ముందుకు వెళ్ళినా, జీవితంలో ఎన్ని మార్పులు జరిగినా శ్యామల మారలేదు. రాజారావు జుత్తు పండింది. డయాబిటీస్ వ్యాధితో బాధపడ్డాడు, సునీత గుండె జబ్బుతో మరణించింది.

రాజారావు రిటైర్ అయ్యే రోజులు వచ్చాయి. ఆరోజు కూతురిని అత్తవా రింటికి పంపి, శ్యామల ఓ చిన్నసంచీతో రాజారావు దగ్గిరకి వచ్చింది.

"నేను వెళుతున్నాను" అంది.

"ఎక్కడికి?" ఆశ్చర్యపోయాడు రాజారావు.

"ఆశ్రమానికి"

"ఎందుకు?"

"ఇక్కడ నా కింక పనిలేదు. కొడుకు పెండ్లి చేసా. కూతురిని అత్త వారింటికి పంపాను."

"చిన్నవాడి పెండ్లి చెయ్యవా?"

"అది పెద్దవాడి బాధ్యత."




రాజారావుకి భయంవేసింది.

"మరి నా సంగతి? నన్నెవరు చూసుకుంటారు?"

"మీ సంగతి చూడవలసిన బాధ్యత నాకు లేదు. ఇన్నాళ్ళూ డబ్బు ఇచ్చారు పిల్లలని పెంచి పెద్దవాళ్ళని చేసాను. మనిద్దరి మధ్యా డబ్బు సంబంధం తప్ప ఇంక ఏంవుంది?"

"ఇంకేమీ లేదా శ్యామలా? ఎంత కఠినంగా మాట్లాడుతున్నావు!"

"ఇంకే సంబంధం వుందీ?" శ్యామల అతని కళ్ళలోకి చూస్తూ సూటిగా ప్రశ్నించింది.

రాజారావు కాస్సేపు సమాధానం చెప్పలేకపోయాడు.

"చాలా అన్యాయం శ్యామలా! నన్నీ వయసులో, యీ పరిస్థితిలో వదిలి వెళ్ళిపోవడం."

శ్యామల జవాబు చెప్పలేదు. సంచీ చేతబట్టుకుని లేచింది.

రాజారావు ఆమె చెయ్యి పట్టుకున్నాడు "వద్దు శ్యామలా నీ అవసరం నాకుంది. నువ్వు లేకుండా నేను ఎలా బ్రతుకను! నా అవసరాలు ఎవరు చూస్తారు. నామీద జాలితోనైనా వుండిపో. నీకు మాత్రం ఓ తోడు వద్దా? ఒంటరిగా గడపగలవా?"

"హుం. ఇన్నాళ్ళూ ఒంటరిగానే గడిపాను. నాకు తోడు వద్దా అంటున్నారు. నాకో తోడూ, మనసుకో ప్రేమా కావలసినప్పుడు మీ రివ్వగలిగారా? ఎప్పుడైతే మీరు వేరేతోడు వెతుక్కున్నారో ఆనాడే ఒంటరిదానినయ్యాను. ఇప్పుడు నాకు క్రొత్త కాదు."

శ్యామల అతని చెయ్యి విడిపించుకుని ముందుకు సాగింది.

రాజారావు ఆమె కఠినహృదయానికి బాధపడ్డాడు శ్యామల మెత్తని మనసు యింత కఠినశిలలా ఎప్పుడు మారిందో? అతను కుప్పలా కూలిపోయాడు.



# రోమియో

మాదిరెడ్డి సులోచన

డ్రాయింగ్స్, నోట్సు పూర్తిచేశాము

ఆ నోట్స్ బుర్రలోకి ఎక్కించడమే తరువాయి, కళ్లు మూసుకున్నాను. తలగడ క్రిందున్న నోట్సన్నీ విక్స్ వెపరబ్‌లోని అడ్వర్టయిజ్‌మెంటు యారోల్లా నా బుర్రలోకి యెక్కి, అది నేను కాగితం మీద కక్కి ఫస్టన పాసయినట్టు కలలు కంటున్నాను.

"మాలా ...మాలా!" కంగారుగా వచ్చింది సుధ. విసుగ్గా కళ్లు విప్పాను.

"ఏ మాల కావాలి తల్లీ? కనకాంబరమా, కదంబమా!"

"అమ్మా! మాలతీ! ఒట్టి మాలతి కాదు, మామిడి మాలతీ! పరిహాసానికి సమయముకాదే. పరిష్కారం చెప్పు" అన్నది అటు, ఇటు చూస్తూ. మామిడి మా ఇంటిపేరు.

"మళ్ళీ ఏమొచ్చిందే! ఈ వారంలో వంట లక్ష్మి చూసుకుంటుంది కదా!" అంది విసుగ్గా.

"అంత విసుగెందుకే!" ఏడుపు గొంతుకతో అన్నది.

"విసుగుకాక మరేమిటి? ఈ శాస్త్ర గ్రంథాలన్నీ నూరి తాగినా నాకు ఫస్టు క్లాసు రాదని తెలుసు. క్లాసు వచ్చినట్టు కల కంటున్నాను. నువ్వు అర్చావ్ ...

నాలాంటి దానికి కలలు కనే హక్కు లేదు కదా!"

"కలలే కాదు, పిల్లల్ని కనే హక్కు కూడా స్త్రీల కిచ్చాం అని మన రాజ్యాంగం నంబర్...నంబర్..." అంటూ వచ్చింది లక్ష్మి.

"జ్ఞాపకంలేని విషయాన్ని యెందుకు వాగుతావ్ ? మన చెలి ... అంటే సుద్దమ్మకు ఏదో కష్టం వచ్చిందట..."

"ఆఁ...సాలిమ్మ మళ్ళీ వచ్చిందా!" లక్ష్మి బిక్కమొహం వేసింది. సుధ దాని రెక్క పట్టి కూలేసింది.

"మన ఇంటివాళ్ల పిన్నిలేదూ ?"

"పిన్ని ఉంది, బాబాయ్ ఉన్నాడు. వాళ్ల పిల్లలు, ఈ మధ్యే ఉద్యోగాన్వేషణలో వచ్చిన ఆమె తమ్ముడూ, అందరూ ఉన్నారు..."

"అదేనే...ఆ తమ్ముడు నాకు లౌ లెటర్ వ్రాసాడు" అన్నది సుధ.

"ఆఁ! లౌ లెటర్ మీన్స్! ప్రేమలేఖ వ్రాశాడా ?" కళ్లు పెద్దవిచేసి అడిగింది లక్ష్మి.

"ఆఁ అచ్చంగా ప్రేమలేఖ వ్రాసి, నేను బయటినుండి వస్తుంటే చేతిలో పెట్టాడు."

"కంగ్రాచ్యులేషన్స్!" లక్ష్మి ఎగిరి గంతేసింది. సుధ చెయ్యి కంగారుగా నొక్కింది.

"థాంక్స్ చెప్పను, తంతాను..." అన్నది సుధ

"ఉత్త అవ్వ కబుర్లు! లవ్ లెటర్ అందుకోవటం లక్ అంటాను. నువ్వేమంటావు మాలా ?" లక్ష్మి సంబరపడింది.

"నోరు ముయ్యమంటాను. లవ్ లెటర్ అందుకోవటం లక్కేగాని అలాంటి తిక్కమొహం వ్రాశాడంటే ఏడ్వవల్సిందే" అన్నాను, హనుమంతుడి అన్నలా ఉన్న పిన్నిగారి తమ్ములుం గారి రూపురేఖలు ఊహించుకుంటూ.

నవ్వితే దవడపళ్లు కనిపిస్తాయి. నడిస్తే ట్విస్టా, షేకా అర్థంకాదు. నెత్తిన వుగ్గుపెట్టుకున్నట్టున్న దుబ్బు జుట్టులో ఎన్ని పేలున్నాయో అనిపిస్తే, మన తలే బరా, బరా గోకేసుకోవాలనిపిస్తుంది.

చారలున్న ప్యాంట్లు, పెద్దపువ్వుల చొక్కాలు వేసుకుని తిరుగుతుంటే ఏదో అనీజీగా ఉంటుంది.

మా అందర్లో సుధ అందంగా, బొమ్మలా ఉంటుంది.

"చింపేసి, చెత్తబుట్టలో పడెయ్యరాదూ ?" అన్నాను.

"అబ్బ ! మీరు ఏడిపిస్తారని చెప్పలేదే......"

"ఆఁ ఏం జరిగింది ?" లక్ష్మి దగ్గరగా వచ్చింది.

"నిన్న పొద్దున పంపుదగ్గర పయిట పట్టుకున్నాడు, ఉదయం హాల్లో కళ్లు చికిలించాడు..."

"పళ్ళు ఇకిలించినందుకు సంతోషించు" అన్నాను. దాని చేతిలోని ఉత్తరం లాక్కున్నాను, విప్పాను.

మై డియరెస్ట్, స్వీట్, స్వీట్ సుధా!

నా భుజం మీదుగా సంబోధన చదివింది లక్ష్మి

"స్వీట్‌గా ఉన్నాము—" మూతి ముడిచింది.

"షటప్!" సుధ అరిచింది.

"థాంక్యూ!...ఊఁ చదవ్వే..." లక్ష్మి హుషారుగా ఈల వేసింది.

"నేను నిన్ను చూచిన మొదటి క్షణంలోనే ప్రేమించాను..."

"లవ్ ఎట్ ఫస్ట్ సైట్...కమాన్."

"చూచిన తక్షణమే పలుకరిందా మనుకున్నాను, కాని నీ కిరువైపులా శంకిణీ,ఢంకిణీలా..." "పీడి పోలిక కూడా! అయినా ఎందుకు ఉడుక్కోవాలి! అతడిని హనుమంతుడు అనుకున్నానుగా!

"పీకకి యెన్ని గుండెలే..." లక్ష్మి కళ్ళు ఎర్రజేసింది.

"నేను లెక్కపెట్టలేదు..." సుధ ఉడుక్కున్నది..

"ఊఁ...బావుంది," అన్నాను. ఉత్తరంనిండా విరహం, ఆవేదనా, ఆరాటం ఒలకబోశాడు.

"ఓయ్! తెలుగు సినిమాలు తెగ చూస్తాడులా ఉందే. అంత బరువైన సంభాషణలు వ్రాశాడంటే..."

"లక్ష్మి! ఇప్పుడు అతను ఏం చూస్తాడు, ఏం చేస్తాడని కాదు అతడి బారినుండి యెలా తప్పించుకోవాలే!" బిక్కమొహం వేసింది.

"నా కిక్కడో సందేహము. ఒన్ వే ట్రాఫిక్కా! నీ కేం ఇంటరెస్ట్ లేదా?" లక్ష్మి అడిగింది.

"ఓ కోరిక మాత్రం ఉంది. అత నంగీకరిస్తే నీ కిచ్చి చేయాలని." వెటకారంగా అన్నది సుధ.

"యెంత పొగరే..."

"రెండుకిలోల పొగరుగాని కాసేపు ఊరుకో లక్ష్మి! సుధా! ఇతడిని పట్టించుకోకు నువ్వు నిర్లక్ష్యం చేస్తే అతనే సర్దుకుంటాడు. అదీకాక వచ్చే సోమవారమే అతనికి ఇంటర్వ్యూ ఉంది. కాగానే వెళ్ళిపోతాడని పిన్ని చెప్పింది."

"సోమవారం వరకు అతడి..."

"ఆఁ...ఆ రోమియో రొమాన్స్ భరించాల్సిందే," అన్నాను అప్పటి నుండి పిన్నిగారి తమ్ముడి అసలు పేరు మరచిపోయి 'రోమియో' అని పిలవటం మొదలుపెట్టాము. సుధ ఒంటరిగా, ఒక్క క్షణం ఉండక, మమ్మల్ని అంటిపెట్టుకుని తిరిగింది. సోమవారం సాయంత్రం ఉత్సాహంగా ఇల్లు చేరాం. పిన్నిగారు చాటంత ముఖంతో వచ్చింది.

"ఇదిగో ఈ స్వీట్స్ పుచ్చుకొండే అమ్మాయిలూ. మా తమ్ముడు ఇంటర్వ్యూలో సెలెక్ట్ అయ్యాడు.







పెళ్ళి అయి కాపురం పెట్టేవరకు ఇక్కడే ఉంటాడు," అన్నది సంతోషంగా.

మా సుధ ముఖం,సుద్దకంటే తెల్లగా పాలిపోయింది.

"ఆఁ... అలాగా, సంతోషం ..." అన్నాను ఏడ్వలేక నవ్వుతూ.

ఆ తరువాత అతని అగడాలు ఎక్కువయ్యాయి. బయటికంటే ముగ్గురం కలిసి వెడతాం. స్నానానికెలా వెడతాం. ఏమిటో చదువుకుందామని హాస్టల్లో చేరి, భోజనము బాగా లేదని బస ఏర్పాటు చేసుకుని, పనివారితో నానాపాట్లు పడి స్వశక్తిని నమ్ముకుని, ఏదో వంతులవారీగా ఉడకేసుకుని తిందామంటే, ఈ రోమియో బెడద వచ్చిపడింది. ఆ రోజు ఐదు గంటలకే సుధ స్నానంచేసి వచ్చి బుద్ధిగా చదువుకుంటుంది.

తొమ్మిది గంటలకు నేను బాత్‌రూమ్ లోకి వెళ్ళాను. స్నానంచేసి చీర చుట్టుకున్నాను. వెంటిలేటర్ లో నుండి టప్‌మని వచ్చిపడిందో కాగితపు ఉండ. తుపాకిగుండు తాకినట్టు ఉలికిపడ్డాను. రోమియో సంగతి మరిచిపోయి, ఆదుర్దాగా విప్పాను.

"డియర్ సుధా! అర్థంకాదా నా బాధ..." ఈతనికి కవిత్వం కూడా వచ్చనుకున్నాను. ఉత్తరం అంతా గాథలతో, బాధలతో సాగింది.

అది చించి పడేశాను. ఆ సాయంత్రం పిన్నిగారి పనిమనిషి సుధను పిలిచింది. ఏమిటని వెడితే అక్కడ రోమియో ఉన్నాట్ట ఇది పరుగెత్తుకు వచ్చింది.

"మనము ఇల్లు మార్చటం తప్ప మరో దారిలేదు," సుధ బాధ.

"ఇల్లు తేరగా ఎక్కడ దొరుకు తుంది. పరీక్షలముందు ఈ గొడవ దేనికి ?" అన్నాను.

దొడ్లోకి వెడుతుంటే, కిటికీలో నిలబడి నవ్వుతాడు. వరండాలోకి వెడితే కూనిరాగాలు తీస్తాడు..." ఏడ్పుముఖం పెట్టింది సుధ. అతనితో చెప్పిచూద్దామనుకున్నాను.

"ఏమండీ రోమియోగారూ !" ఆవేశంగా వెళ్ళాను. స్టయిలుగా సిగరెట్టు కాలుస్తూ, చేతికున్న గొలుసు సవరించుకుని, నిర్లక్ష్యంగా చూశాడు.

"ఏమిటండీ మీ ఉద్దేశం ?"

"పడుచు పిల్లవాడు పిల్లదాన్ని ప్రేమిస్తే తప్పా ?"

"కాదండీ ఒప్పు ! ఆ ప్రేమతోనే పెళ్ళికూడా చేసుకుంటారా!"

"యెందుకండీ అంత వెటకారం ! ప్రేమ నాకు సంబంధించింది గనుక ప్రేమిస్తాను. పెళ్ళి పెద్దలకు సంబంధించింది," అన్నాడు.

"ఓర్నీ యిల్లు బంగారంగానూ !" అనుకున్నాను. "మీ అక్కకు చెబుతాను" బెదిరించబోయాను.

"చెప్పు......" అన్నాడు ముసి, ముసిగా నవ్వుతూ. అతనికి వాళ్ళక్క సంగతి బాగా తెలిసే ఉంటుంది. ఆమె తనింట్లోవాళ్ళని ఏ పొరపాటు అంగీకరించదు. పెళ్ళి ఏదో చేస్తానంది. అది త్వరలో ఉంటే మా బాధ తప్పుతుందని పిన్నిగార్నే పెళ్ళి విషయం కదిపాను

"పిన్నిగారూ ! మీ తమ్ముడి పెళ్ళెప్పుడు ? సంబంధం కుదిరిందా ?" ఆమె సంబరంగా కొండనాలుక కనిపించేలా నవ్వింది.

"మా వాళ్ళకు సాంప్రదాయం, కట్నం ఘనంగా కావాలి. వీడికేమో అందమయిన అమ్మాయి కావాలి అన్నీ సమకూరవద్దూ?" అన్నది చంద్రహారం సవరించుకుంటూ.

"అన్నీ సమకూరేలోపల...రోమియో రోడ్డున పడితే..." అనబోయి నాలుక కరుచుకున్నాను.

"ఏమిటి ?"

"ఏంలేదు పిన్నీ ! ఆలస్యం అయితే అందకాడు, ఉద్యోగం చేస్తున్నవాడు. ఎవరయినా ప్రేమిస్తే, కట్నం, గిట్నం పోతాయని..."

"ఆ బెంగ నీకు అక్కరలేదు. మావాడు అలాంటివాడు కాదు. అవునూ" నావైపు అనుమానంగా చూచింది పిన్ని. కర్మ! ఉండి, ఉండి అతడిని ప్రేమించే కర్మ పట్టటం ఏమిటి ! ఏం చేయాలి ? పరీక్షలముందు రోజుకో సమస్య. సుధ మరీ దిగులుపడిపోయింది.

"ఆడదానికి రక్షణలేని ఈ సమాజాన్ని తగలెయ్యాలి" అంది సుధ.

చేతకానివాళ్ళంతా తప్పు ఇతరుల మీదికి దులిపి, తాము ఆదర్శవాదులం అంటారు. మా ఆలోచనలో మేం ఉండగానే మరో ప్రేమలేఖ. సుధకు రాహు, కేతువుల్లా మేం దాపురించగా మట సినిమాకు రమ్మని ఆహ్వానం. అల్లరికాకుండా రోమియోకు బుద్ధి చెప్పాలి! యెలా ? అతను వ్రాసిన ఉత్తరం తీసుకువెళ్ళి పిన్నిగారికి చూపాను. ఆవిడ ఆదిశక్తి అయి తమ్ముడిని అదమాయిస్తుందనుకున్నాను. అలక్ష్యంగా నవ్వింది.

"చూడూ, మాలా! ఈ ఉత్తరం నీ కెందుకు వ్రాయలేదు? ఆ సుధకే వ్రాశాడంటే ఆమె ప్రోత్సాహం ఉండే ఉంటుంది "

అమ్మా ! పిన్నమ్మా ! యెంత తెలివయినదానవు ! ఈ విషయము సుధతో చెప్పాను. అది గుర్యుమంది.

"ఛీ ఛీ ! వెధవ రాయబారం చేసి పరువు తీశావుకదే. ఈ ఉత్తరం ఆవిడ కెందుకు చూపావు ? అక్కడికి నువ్వు బుద్ధిమంతురాలవయినట్టు, మేము అల్లరి చిల్లరి వారమయినట్టు..." మా సుధ అరుస్తూనే ఉంటుంది. దానికి నాలుకపై అప్పుడప్పుడు స్వాధీనం తప్పుతుంది. దానికి ఉన్న అవలక్షణాలన్నీ కనిపించకపోయినా రెండు మాత్రం ఎదుటివారిని బాధపెడతాయి. దురుసుగా నోరు పారేసుకుని ఫ్రాంక్ నెస్ అనుకుంటుంది పాపం! తనంత తెలివైందీ అందమయిందీ లేదనుకుంటుంది. నేను ఆలోచించి, ఓ చిన్న చీటీ వ్రాసి దానికిచ్చాను.

"ఇది నీ రోమియోకు అందించు... ఊఁ..."

అది చదివి కుదిరిపడింది.

"అమ్మో! ఇంకేమయినా ఉందా? ఆ మెట్ల గదిలో యెవరేంచేసినా చూచే దిక్కులేరు "

"సుధా ! మనల్ని మనం రక్షించుకోవాలి స్త్రీకి రక్షణ ఇస్తాం అంటూ సమాజం రడీగా కూర్చోదు గదిలోకి నువ్వు వెళ్ళటంలేదు. పిన్నిగారు ప్రక్కింటి ఆమెతో సినిమా కెళ్లేరోజు మెట్లగదికి తాళం వేసుకుపోతుంది..."

"ఏమిటో నా కర్థం కావటంలేదు." సుధ ముఖం చిట్లించింది.

"అమ్మా ! రెండు రెండ్లు ఆరు అంటే అర్థమవుతుంది. నాలుగు అంటే యెలా అని అడిగే మేధావివి. నీకు చెప్పినా అర్థంకాదు పదిగంటలవరకు ఓపిక పట్టు," అన్నాను.

"సరే..." అయిష్టంగా తల ఊపింది.

---

నెరజాణ పోజు ! మగధీరులమని ముఖం తిప్పుతూ తిరిగే ముఠాను చూస్తే ముచ్చెమట్లు పోస్తాయి తనకు. ఒళ్లంతా వాయ్యారమే అన్నట్టు ఉలికిపడుతుంది.

"పిన్ని ఆ గుమ్మం తాళం వేసుకోక పోతే ?" లక్ష్మి అడిగింది.

"తరువాత మరో కోణంనుండి ఆలోచించుకోవచ్చు" అన్నాను.

ముగ్గురము తర్జన, భర్జన చేశాక, ఉత్తరం రోమియోకు అందజేసింది, సుధ! ఆ క్షణంలో అతని ముఖం వర్ణించతరం గానంతగా మారిపోయింది. చింకి చాటంతయింది. ముగ్గురం చదువుతున్నా, మా దృష్టి అంతా పిన్ని మీదే ఉంది. ఆమె మెట్ల గదికి తాళం వేసుకుపోవటం చూచి అందరం తేలికగా నిట్టూర్చాం.

"మన సుద్దపప్పు అనుకుని పిన్నిగార్ని ముద్దెట్టుకోడుకదా!"

"అంత చొరవ ఉన్నవాడను కోను..."

బాబాయిగారు, పిల్లలు భోజనాలు చేశారు. రోమియో భోజనం చేశాడో లేదో గాని మౌనము భోజనము చేస్తూ సిగరెట్టుమీద సిగరెట్టు - కాల్చివేస్తున్నాడు. గాలి వచ్చినప్పుడల్లా సెంటు గప్పుమని గదిలోకి వచ్చి ముక్కుపుటాలు అదరగొడ్తుతుంది.

హాల్లో గడియారం టంగు, టంగు మని పదిసార్లు కొట్టింది. నేను తొంగి చూశాను. రోమియోగారు లేరక్కడ.

"సుధా, లక్ష్మి, రండే..." పిలిచాను.

"ఛ...ఛ...మంచి ప్రేమ కథను అంతంచేస్తున్న పాపానికి, ప్రతీ జన్మలో ఆడపిల్లవై పుడతావు."

"థాంక్స్! నీకు మొగుడునయ్యే దౌర్భాగ్యం పట్టనందుకు..." అన్నాను. ముగ్గురం హాల్లో జీరో బల్బువేసి యెరగనట్టు నిల్చున్నాం. అందరికి ఉద్వేగంగానూ, ఏదో డిటెక్టివ్ సినిమాలోని ఆఖరి సీను చూస్తున్నట్టు ఉంది. సిగరెట్టు వాసన విపరీతంగా వస్తుంది.

"మాలా! సిగరెట్టు వాసన భరించలేక ఉక్కిరి బిక్కిరవుతావేమో ... ప్రణాళికలూ..." లక్ష్మి ఏదో అనబోయింది. టక్కున దాని నోరు మూశాను. అవతల తాళం తీసిన శబ్దం అయింది. అక్క వేసుకున్న ఏర్పాటు కొత్తగా వచ్చిన తమ్ముడికి తెలియదు.

"డార్లింగ్!..." బొంగురుగా వినిపించింది. చీకటి చీల్చుకుని చూడాలని ప్రయత్నించినాను. పిన్నిగారు భయంతో నిలబడిపోయింది.

"మా అక్కను గూర్చి భయపడుతున్నావా సుధా! నో ... నో ... నా ప్రేమ, పెళ్ళి నా యిష్టం! అక్క యెవరు? దుక్కలా మన ప్రేమకు అడ్డు వస్తే నరికేస్తాను..." ఆవేశంగా ముందుకు దూకాడు.

"ఒరేయ్! నీ నోరు పడ ... నీ కడుపు కాలా!" పిన్ని శాపనార్థాలు పెడుతూ లైటు వేసింది.

రోమియోగారి ముఖం చూచి లక్ష్మి నోటికి గుడ్డ అడ్డం పెట్టుకుంది.

"అక్కా! అది కాదే..."

"ఏది కాదురా! నేను దుక్కలా ఉన్నానా? నీ పెళ్ళాం వచ్చి చేసి పెట్టిందా! నువ్వురా? నీ కడుపు కాలా!" శాపనార్థాలు పెడుతుంది. మేం మా గదిలోకి తప్పుకున్నాము. చెవులు మాత్రం పిన్నిగారి గొంతు వినడానికి వదిలాం. మైకు లేకుండానే ఇల్లంతా ప్రతిధ్వనిస్తుంది, ఆమె కంచు కంఠం.

"లక్ష రూపాయల కట్నంతో పెళ్ళి చేయాలని అమ్మా, నాన్న ఉబలాట పడుతుంటే ప్రేమించాటర ... పెళ్ళి కావల్సి వచ్చిందట..."

"నా మాట వినక్కా..." రోమియో బొంగురుగొంతు.

"ఇంకేం వినాలిరా! నా చెవులారా నీ ఆంతర్యం ఏమిటో విన్నాను పాపం ఆడపిల్లలు బుద్ధిమంతులు కాబట్టి బ్రతికి పోయాం..."

"అమ్మయ్య! పిన్ని మనకు సర్టి ఫికెటు ఇచ్చేసిందేవ్ ..." సుధ సంతోషంగా అరిచింది.

"అవునుకాని మాలా! ఆ హను మంతుడికి లక్షరూపాయల కట్నం ఇస్తా రంటావా?" లక్ష్మి అనుమానం.

"లక్ష కట్నంతో పాటు సవా లక్ష కోరికలు తీరుస్తారు కొందరు పిచ్చి ముఖాలు," అన్నాను. పిన్నిగారికి మా సంగతులు బాగా తెలుసు. వహ అయితే పదివేల రూపాయలుకూడా ఇవ్వగలరో, లేరో!

ఆ రాత్రి కలత నిదురపోయాము. రాత్రంతా ఏదో సణుగుడు గొణుగుడు వినిపించింది. మర్నాడు పిన్ని మమ్మల్ని పిలిపించింది.

"మీరు వెళితే ఏదో అనుకున్నాను. ఒత్తి బడద్దాయి. ప్రేమ ఒక్కడే తక్కువయిందట. వాడి ఆఫీసు కు దగ్గర, మా అన్నయ్య ఇంట్లో ఉండ మన్నాను..." తేలికగా నిట్టూరుస్తూ చెప్పింది.

"థ్యాంక్యూ పిన్నీ! మీ దెంత మంచి హృదయం..." అన్నాను. పిన్ని దాటంత ముఖం చేసుకుని వెళ్ళి పోయింది.

"ఏమిటే పిన్నిని మునగచెట్టు యెక్కించేశావ్..."

"షటప్! పాపం ఎంత సాయం చేసింది. ఆడది, అబల, గిబల అంటూ కబుర్లు చెప్పక, మన సమస్యలు మనం పరిష్కరించుకోవాలి..."

"జై వీరనారీమణికి..." అరిచింది లక్ష్మి. సుధ వచ్చి లోపలికి లాక్కు పోయింది.

"పరీక్షలు చూస్తే ఎక్స్‌ప్రెస్ రైలు బండిలా వస్తుంటే, ఏమిటే మీ ఆగ డాలు!" ఆరాదానిలా అరవటం మొదలు పెట్టింది, రోమియో బారినుండి తప్పించు కున్న కన్యారత్నం మా సుద్దమ్మ.

---

సి.యస్.రావు సీరియల్

# కాంచన కుటీరం



మానవచరిత్ర ఒక మహా ప్రవాహం.

ఆ ప్రవాహానికి విసుగూ, విరామాలు లేవు. అలాగే విసుగూ, విరామాల కతీతంగా నిరంతరం ప్రవహించే జీవనది గోదావరి. ఎక్కడ పుట్టిందో అందరికీ తెలుసుగాని, ఎప్పుడు పుట్టిందో ఎవరికీ తెలీదు. నాసిక్ పుట్టినిల్లట సాగరం మెట్టినిల్లట. ఆ పుట్టినింటి మధ్యా, ఈ మెట్టినింటి మధ్యా నిరంతర ప్రయాణం. ఈ ప్రయాణం పొడవునా ఆ ఒడ్డునా ఈ ఒడ్డునా ఎన్నో గ్రామాలు, పట్టణాలూ వెలిశాయి. అలా వెలిసిన గ్రామాలనూ, పట్టణాలనూ ఎవరెవరో పాలించారు. ఎవరు పాలించినా, ఎంత కాలం పాలించినా గోదావరి మెట్టినింటికి చేరినట్లే మట్టిలో కలిసిపోయారు. కాని

ఆ గ్రామాలూ, పట్టణాలూ సజీవంగా నే ఉన్నాయి. గోదావరిలో పాతనీరు పోయి కొత్తనీరు ఎప్పటికప్పుడే వచ్చినట్లుగానే ఆ పట్టణాల్లోనూ, గ్రామాల్లోనూకూడా పాతజనం మట్టిలో కలిసి, కొత్త జనం పుడుతూనే వున్నారు. చరిత్ర పుటలు పెరుగుతూనే వున్నాయి.

తరతరాలకీ మానవ జీవితంలో వచ్చే మార్పుల్లాగే ఆ పల్లెలూ, పట్టణాలూ రూపురేఖలు మార్చుకున్నాయి. యాభైఏళ్ళ క్రితంనాటి మాట.

గోదావరి తూర్పుతీరాన చైతన్యపురి అది పెద్ద పట్టణమూ కాదు; చిన్న పల్లే కాదు. చైతన్యపురిలో గోదావరి ఒడ్డుని ఆనుకుని కాంచన కుటీరం. పేరుకు కుటీరం కాని, అదో చిన్న కోట. బంగారం వయస్సు తెలియదు. కాని ఆ కోట వయస్సు అప్పటికే రెండు వందల ఏళ్ళట. ఆ చైతన్యపురిలోని ప్రజలందరూ కాంచన కుటీరాన్ని దివాణమంటారు అక్కడి ప్రజలందరికీ ఆ దివాణం తల్లిలాంటిది. కష్టమొచ్చినా సుఖమొచ్చినా కన్నతల్లివలె ఆదుకుంటుంది; గోదావరితల్లి ఆగ్రహిస్తే నీడనిస్తుంది. ఎంతోమంది రైతాంగానికీ, ఆ వూళ్లోని ప్రజలకు జీవనోపాధిని కల్పిస్తుంది. దాన ధర్మాలకూ, పుణ్యకార్యాలకూ కాంచనకుటీరం పెట్టింది పేరు.

అది సంధ్యా సమయం.

సూర్యుడు అలసి గోదావరి పశ్చిమ తీరాన జలకాలాడుతున్నాడు. ఆ సంధ్యారుణ కాంతుల్లో గోదావరి బంగారంలా మెరిసిపోతోంది. ఆ కాంతిలో కాంచన కుటీరం మేలిమి కుటీరంలా వెలుగుతోంది.

కాంచనకుటీరం చుట్టూ ఎత్తైన పాటి మట్టిగోడలు. ఆ ప్రహారీలో ఎత్తుగా ఎదిగిన కొబ్బరి చెట్లను సహితం బయటకు కనిపించనీయనంత ఎత్తైన గోడలవి ఆ ప్రహారీకి ఒకేఒక ద్వారం ద్వారానికి ఇరుప్రక్కలా రెండు సింహాల బొమ్మలు. ఇనుప కటకటాల గేటు ఆ సాయంత్రం తెరుచుకుని ఉంది. ఆ వూళ్ళోని పెద్దలు ఒక్కొక్కరే ఆ ద్వారంగుండా కాంచనకుటీరం ప్రాంగణంలోకి వస్తున్నారు. కొందరు పాతఫోర్డు కాన్వాస్ టాప్ కార్లలోనూ,మరి కొందరు గుర్రపు సార్టలలోనూ ఆ ప్రాంగణంలోకి చేరారు. ముందు గేటు నుంచి కాంచనకుటీరం సింహద్వారానికి వెళ్లే దారికి ఎడంపక్క రకరకాల పూల మొక్కలు, క్రోటన్స్; కుడిపక్క దాదాపు ఒక ఎకరం మేర గుబురుగా పెరిగిన గులాబీల తోట - చూసేవారికి కన్నుల పండుగగా కనిపిస్తున్నాయి. కాంచనకుటీరం వెనక ఎత్తుగా ఎదిగిన కొబ్బరిచెట్లు, మామిడిచెట్లు, పనస చెట్లు సాయంత్రపు చల్లనిగాలికి వొయ్యారంగా తలలు వూపుతున్నాయి ఆ

ప్రాంగణంలో అడుగుపెట్టిన వారికి సృష్టిలోని ప్రకృతి అంతా సింగారించు కొని, అక్కడే విడిది చేసినట్లు అనిపిస్తోంది.

అలా ఆ ప్రాంగణంలో అడుగు పెట్టిన ఆహ్వానితులు ఒక్కొక్కరే కాంచనకుటీరం సింహద్వారం దాటి ముందు హాలులోకి అడుగుపెడుతున్నారు సింహద్వారం దగ్గర నిలబడిన దివాన్ రాఘవయ్య ఒక్కొక్కరిని హాలులోకి ఆప్యాయంగా ఆహ్వానిస్తున్నాడు. వచ్చిన అతిధులకు రాఘవయ్య కొత్తకాదు. తెల్లటి గ్లాస్కో మల్లుపంచె, దానిమీద నల్లని జోధ్ పూర్ కోటు, నెత్తిన తలపాగా, కళ్లకు గోల్డు ఫ్రేం కళ్ళజోడు, నెరిసిన ఒత్తయిన మీసాలు, మీసాల మాటున తొణికిసలాడే చిరునవ్వు – చూసిన ప్రతి వ్యక్తికీ రాఘవయ్య ఆ దివాణంలో అతి ముఖ్యమైన వ్యక్తి అనే భావం కలుగుతుంది.

వచ్చిన ఆహ్వానితులందరూ హాలులో చేరారు

రాజా రాజశేఖరంగారు స్థాపించిన కాలేజీ ప్రిన్సిపాల్, రాజశేఖరంగారి కుటుంబ డాక్టరు, ఆ వూళ్ళోని ఇతర ప్రముఖ్యులు, చుట్టుపక్కల గ్రామాల నుంచి వచ్చిన పెద్ద రైతులు – అదరూ హాలులో సమావేశమయ్యారు. ఎవరికి పరిచయమున్నవారితో వారు పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నారు. అంతమంది అక్కడ ఆరోజున సమావేశమవడానికి కారణం రాజా రాజశేఖరంగారి మనవడు క్రాంతిబాబు ఇరవై ఒకటవ పుట్టినరోజు కావటమే ఆ దివాణానికి అనాటికి మిగిలిన ఏకైక వారసుడు క్రాంతిబాబు. అందుకే ఆ దివాణంమీద ఆధారపడినవారు, ఆ దివాణం శ్రేయోభిలాషులు, ఊళ్లోని పెద్దమనుష్యులు అందరూ అక్కడికి చేరారు.

హాలులో ఒక పక్క అధునాతనమైన సోఫాసెట్ ఉంది. మరోపక్క సనాతన సాంప్రదాయానికి గుర్తుగా పరుపులూ, బాలీసులూ అమర్చి ఉన్నాయి. మధ్యలో అంగుళం నేల కూడా కనబడకుండా కెంపులు చిందే మెత్తని పట్టు తివాచీలు పరచివున్నాయి. హాలు మధ్యలో ఒక పెద్ద బల్లమీద తెల్లని బట్ట పరచి, రకరకాల ఫలహారాలు, పళ్లు – అప్పటికే దివాణం నౌకర్లు అందంగా అమర్చిపెట్టారు. హాలుకు ఎదురుగా రెండుపక్కలకూ ఎదురుబదురుగా మేడమెట్లు ఉన్నాయి. మెట్లమీద కూడా ఎర్రని, ఖరీదైన కంబళీలు పరిచి వున్నాయి. ఆ రెండు మేడమెట్లకు మధ్య గోడకు మూడు తైలవర్ణ చిత్రాలు అమర్చబడి వున్నాయి. ఆ తైలవర్ణ చిత్రాలకుకుడివైపునా, ఎడమవైపునా రెండు పులి చర్మాలూ, పులి చర్మాలపైన తుపాకీలు గోడకు తగిలించి

వున్నాయి. ఆ తైలవర్ణ చిత్రాల చుట్టూ బంగారు రంగు ఫ్రేములు బిగించబడి వున్నాయి. మధ్యలో వున్న తైలవర్ణ చిత్రం రాజా రాజశేఖరంగారిది. ఆయన అక్కడ చేరిన వారందరికీ సుపరిచితుడు. నెత్తిన కోర తలపాగా, తలపాగా మీద కలికితురాయి, తీక్షణమైన చూపులు, పులికోరల్లా మెలితిరిగిన బుగ్గమీసాలు, కొనతేలిన ముక్కు, విశాలమైన నుదురు, రెండుగా చీలినట్లు కనబడే బలమైన చిబుకముగల రాజా రాజశేఖరంగారి చిత్రం చూసేవారికి జీవకళ ఉట్టిపడుతూన్నట్లు గోచరిస్తోంది. ఆయనకు ఎడం పక్క ఆయన కొడుకైన రాజేష్ చిత్రం వుంది. ఆ చిత్రంలో రాజశేఖరంగారి చిత్రంలా కాకుండా కొంత కొత్తదనం కనబడుతోంది రాజేష్ కళ్లలో ఏదో ఆవేదన, అంతుపట్టని ఆలోచన స్పష్టంగా గోచరిస్తున్నాయ్. రాజా రాజశేఖరంగారి చిత్రానికి, రాజేష్ చిత్రానికి కర్పూరపు చెమికీ దండలు వేసివున్నాయి. రాజశేఖరంగారి చిత్రం కుడిపక్కన ఆయన రెండో కుమారుడు చైతన్య తైలవర్ణ చిత్రముంది. ఆ చిత్రానికి మాత్రం దండ వేసిలేదు. చైతన్య చిత్రం అచ్చు దొరబాబు చిత్రంలా వుంది. ఉంగరాల జుత్తు, నూనూగు మీసాలు, కోటేరులాంటి ముక్కు, చూడగానే ఆకర్షింపజేసే చూపులు, వయస్సులో వున్న ఆడవాళ్ళ మనస్సుల్ని ఇట్టే అయస్కాంతంలా ఆకట్టుకొనే అందం చైతన్య చిత్రంలో కొట్టొచ్చినట్టు కనిపిస్తాయి. అతని చిత్రం ముందు గులాబి రేకుల రాశి పోసివుంది.

దాదాపు వందమంది ఆ హాలులో చేరినా, ఎవరికి పరిచయమున్నవారితో వారు మాట్లాడుకుంటున్నా, అంత గొడవగానూ, అల్లరిగానూ లేదు. ఎవరి మటుకు వారు ఆ ఇంటి గౌరవానికి అనుగుణంగా, చాలా నెమ్మదిగానే మాట్లాడుకుంటున్నారు. అయినా నిశ్శబ్దమైన కొండలోయల్లో ప్రవహించే సెలయేటి గలగలల్లాంటి ధ్వని ఎప్పుడూ నిశ్శబ్దంగా వుండే ఆ హాలులో వినబడుతూంది.

రాఘవయ్య గడియారం చూసుకొని, సింహద్వారందాకా వెళ్ళి, ఒకటి రెండు సార్లు చూసివచ్చాడు. ఆయన ఎవరి రాక కోసమో ఎదురుచూస్తున్నాడు. ఆయన మొహంలో వేళ మించిపోతూన్న ఆత్రుతా, కంగారూ స్పష్టంగా కనబడుతున్నాయి.

సింహద్వారందాకా వెళ్ళిన రాఘవయ్య ఒకటి రెండుసార్లు మేడ మెట్లవైపుకూడా చూశాడు. ఆయన ఆత్రుత గమనించి, కాలేజీ ప్రిన్సిపాల్‌గారు దగ్గరకొచ్చాడు.

"ఇంకా ఎవరైనా రావాల్సిన వాళ్లు

న్నారా?" అని అడిగాడు ప్రిన్సిపాల్ రాఘవయ్యను.

రాఘవయ్యకు నిజం చెప్పడం ఇష్టం లేక. "అబ్బే! అదేం లేదు. ఇంకా ఎవరైనా వస్తున్నారేమోనని చూస్తున్నాను " అన్నాడు.

ఇంతలో స్రవంతి మేడమీద తన గదిలోంచి బయటికొచ్చింది. కుడివైపు నున్న మెట్లమీదనుంచి హాలులోకి మెల్లగా దిగుతూ, హాలులో వున్న జనాన్నంతా పరిశీలనగా చూసింది. మెట్లు సగం దిగి మధ్యలోనే ఆగిపోయింది. అంతవరకూ ఆవిడ రాకను హాలులోవున్న పనివాళ్లు గానీ, వచ్చిన అతిథులుగానీ ఎవ్వరూ గమనించలేదు. ఆ క్షణంలో రాఘవయ్య చూపులుకూడా సింహద్వారం వైపే వున్నాయి.

"క్రాంతిబాబు ఇంకా రాలేదా, రాఘవయ్యగారూ?" అంది స్రవంతి మెట్లమీద నిలబడి

ఆవిడ స్వరం వినగానే హాలంతా నిశ్శబ్దంతో నిండిపోయింది. గలగలా ప్రవహించే సెలయేరు ఒక్క క్షణం స్తంభించినట్లయింది ఆవిడ స్వరం తియ్యనిదే; అయినా అందులో ఏదో గాంభీర్యముంది. ఆవిడ అడిగింది మామూలు ప్రశ్న! అయినప్పటికీ ఆ ప్రశ్న వెనుక ఏదో సంజాయిషీ కోరుతున్నట్లుంది.

అందరి చూపులూ ఆవిడవైపు తిరిగాయి.

ఎక్కడి పనివాళ్లు అక్కడ చేతులు కట్టుకు నిలబడిపోయారు.

చుట్టూ జరీ తెల్ల పట్టుచీర కట్టుకుందావిడ. పాదాలుకూడా కనబడకుండా చీర కుచ్చెళ్ళు నేలను తాకుతున్నాయి. పైన ఆకుపచ్చని కాశ్మీర్ శాలువా కప్పుకుంది. ఆవిడ జుట్టు నెరిసీ నెరియనట్లున్నా, కుడిపక్క ఒక పాయ మాత్రం బాగా నెరిసినట్టు స్పష్టంగా కనబడుతోంది. చెవులకు రవ్వల దుద్దులు, మెడలో ముత్యాలహారమూ, చేతులకు నిండుగా బంగారు గాజులు మాత్రమున్నాయి. విశాలమైన ఆవిడ కళ్ళు ఆ వయస్సులోకూడా ఓ ప్రత్యేకమైన అందాన్ని యిస్తున్నాయి. పచ్చని ఆవిడ శరీరఛాయ బంగారపు ఛాయనే వెక్కిరిస్తున్నట్టుంది. వెడల్పయిన ఆ నుదుటిమీద కుంకుమబొట్టు లేదు ఆవిడ మొహం సూర్యుడులేక చిన్నబోయిన ఆకాశంలా వుంది. రెప్పలార్పకుండా ఆవిడనే చూస్తోన్న అతిథులకు వైధవ్యమూ, వృద్ధాప్యమూ తొందరపడి ఆవిడను చేరుకున్నాయా అనిపించేలా వుంది ఆవిడ అందం.

రాఘవయ్య జనాన్ని తప్పించుకొని, స్రవంతి కెదురుగా ఆఖరిమెట్టు దగ్గర నిలబడ్డాడు

"క్రాంతిబాబు ఇంకా రాలేదా? వచ్చి తన గదిలోంచి బయటకు రాలేదా ?" అంది, స్రవంతి రాఘవయ్య నుద్దేశించి

"ఇంకా రాలేదమ్మా! ఈపాటికి రావల్సిందే," అన్నాడు రాఘవయ్య.

"మీరు ఉదయం చెప్పలేదా ?" అంది స్రవంతి మిగిలిన మెట్లు దిగుతూ.

"చెప్పానమ్మా! ఉదయం తలంటు పోసుకుని కొత్త బట్టలు వేసుకొని, బయటకు వెళ్లేముందే చెప్పాను - సాయంత్రం ఆరున్నరకు అతిధులందరూ వస్తారు; ఈ రోజున మీ పుట్టినరోజు వేడుక జరుపుకోవాలి, ఎక్కడకు వెళ్ళినా ఆ సమయానికి రండి బాబూ అని." రాఘవయ్య సంజాయిషీ చెప్పుకున్నాడు.

"కాని రాలేదు. ఊళ్ళోని పెద్ద లందరూ వచ్చారు. వారి వారి పనులు మానుకొని మన మాట మన్నించి వచ్చినవారిని ఇలా ఆపుచేయడం మర్యాదా?" అంది స్రవంతి.

రాఘవయ్య మరోసారి చేతిగడియా రాన్ని చూసుకొని, "ఆరూ ముప్పై అయిదైంది. మద్రాసులో తనతో కలిసి చదువుకున్న స్నేహితుని ఇంటికి వెళతానని వెళ్లాడు. ఇప్పుడే మనిషిని పంపిస్తాను," అని రెండడుగులు వేశాడు.

వచ్చిన అతిధులందరూ స్రవంతికి నమస్కారాలు చేశారు. చిరునవ్వుతోనే వారందరి నమస్కారాలూ స్వీకరించి, ప్రతినమస్కారం చేసింది స్రవంతి.

కాలేజీ ప్రిన్సిపాల్‌గార్ని, తమ కుటుంబ డాక్టర్ని చుట్టుపక్కల పల్లెల్లో తమ పొలాలను పండిస్తున్న రైతుల్ని కుశలప్రశ్నలు వేసింది.

ఇంతలో బయట మోటారుసైకిలు చప్పుడు వినబడింది. ఆ చప్పుడు వినగానే రాఘవయ్య పెద్ద బరువు దిగిపోయినట్లుగా, "అదుగో! క్రాంతిబాబు మాటలోనే వచ్చారు," అన్నాడు స్రవంతివైపు చూస్తూ.

స్నేహితుడు రఘుతో కలిసి చాల హుషారుగా హాల్లోకి అడుగుపెట్టిన క్రాంతిబాబు ఎదురుగా వున్న తల్లినీ, హాలునిండా వున్న పెద్దల్ని చూసి, అడుగులో అడుగు వేసుకుంటూ అతి నెమ్మదిగా హాలలోకి వచ్చాడు. తల్లి దగ్గరకు వెళ్ళాడు. రఘు కాస్త ఎడంగానే ఆగిపోయాడు.

క్రాంతిబాబు వంగి, తల్లి పాదాలకు నమస్కరించాడు.

అతని నెత్తిమీద కుడిచేయి ఆనించి, ఆశీర్వదించింది స్రవంతి.

క్రాంతిబాబు లేచి, నిలబడి-రఘును పిల్చి, "ఇతను రఘు అమ్మాజీ! మద్రాసులో ఎం. ఏ.లో నా క్లాస్‌మేట్. మన పక్కవూరు రామాపురం తాశీల్దారుగారి అబ్బాయి. అతన్ని పిల్చుకొని వద్దామని వెళ్ళాను ఆలస్యమైంది కాస్త," అన్నాడు ఎంతో వినయంగా, ఆలస్యానికి సంజాయిషీ చెప్పుకుంటూ, స్నేహితుడ్ని పరిచయంచేస్తూ.

స్రవంతికి రఘు నమస్కారం చేశాడు.

అతనికేసి స్రవంతి ప్రశ్నశీలంగా చూసింది వినయ విధేయతలుగల కుర్రవాడన కొంది.

"చిన్నతనంనుంచీ మద్రాసులోనే చదువుకున్నావా? ఎం. ఏ. కు మాత్రం మద్రాసు వెళ్ళావా?" అంది స్రవంతి రఘు నుద్దేశించి.

"ఎస్సెస్సెల్సీ దాకా మన ప్రాంతం లోనే చదువుకున్నాను. ఆ తర్వాతే నాన్నగారు నన్ను మద్రాసు పంపిం చారు మరో శుభవార్త! క్రాంతీ, నేనూ ఎం ఏ ఫస్టుక్లాసులో ప్యాసయ్యాం. ఈ వేళ ఉదయమే ఓ స్నేహితుడు మద్రాసునుంచి వైరిచ్చాడు," అన్నాడు రఘు.

వచ్చిన అతిథుల్లో చదువుకున్నవాళ్లు క్రాంతిబాబును అభినందించారు.

స్రవంతి మనస్సు ఆనందంతో నిండినా, మొహంలో ఆనందపు ఛాయలు మాత్రమే కనిపించాయి. ఒక్కసారి కొడుకు మొహంలోకి చూసి, "ఇంక కార్యక్రమం ప్రారంభిద్దామా రాఘవయ్య గారూ!" అంది స్రవంతి

మళ్ళీ హాలంతా నిశ్శబ్దమైంది.

"అలాగేనమ్మా!" అంటూ రాఘవయ్య గొంతు సవరించుకొని, "ఈ రోజు క్రాంతిబాబు పుట్టినరోజు. గతంలో ఇరవైసార్లు క్రాంతిబాబు పుట్టినరోజుల సందర్భంగా మనందరం కలుసుకున్నాం. వేడుకలు చేసుకున్నాం. బాబును ఆశీర్వ దించాం. కాని ఈనాడు జరుపుకుంటున్న పుట్టినరోజు పండుగకు ఒక ప్రత్యేకత వుంది. ఈనాటితో క్రాంతిబాబుకు ఇరవై ఒక్క సంవత్సరాలు నిండాయి ఈ రోజునే ఆతను ఎం. ఏ. ప్యాసైనట్టు కూడా శుభవార్త మనందరికీ తెల్సింది అంటే క్రాంతిబాబు ప్రాజ్ఞుడయ్యాడు ఈ దివాణం వ్యవహారాలన్నీ స్వయంగా చూసుకోగలిగే వయస్సు అతని కొచ్చింది; వయసుతో పాటు అర్హతా వచ్చింది. ఈ దివాణం యావదాస్తికీ ఏకైక వారసుడు మన క్రాంతిబాబే నని మనందరికీ తెలుసు ఇంతకాలం బాబు చిన్నవాడు కావటం మూలంగా, మరో మగదిక్కు లేకపోవటంచేతా స్రవంతమ్మ గారే ఈ ఎస్టేట్ వ్యవహారాలన్నీ చూశారు రాజా రాజశేఖరంగారి హయాం నుంచీ వస్తూన్న దానధర్మాలనూ, ధర్మ కార్యాలనూ, దివాణం పరువు ప్రతిష్ఠ లనూ స్రవంతమ్మగారే స్వయంగా జరిపించారు; నిలబెట్టారు. ఇంతవరకూ క్రాంతిబాబు ఎప్పుడు ప్రాజ్ఞుడవుతాడా, తాను యిన్నాళ్లుగా మోసిన బాధ్యతలను స్వీకరిస్తాడా అని ఆమె ఎదురు చూశారు ఇన్నాళ్లకు ఆమె కోరిక నెరవేరింది. ఈ శుభ సమయంలో మీ అందరి సమక్షం లోనూ దివాణం బరువు బాధ్యతల్ని, పరువు ప్రతిష్ఠల్ని స్రవంతమ్మగారు క్రాంతిబాబుకు అప్పగిస్తున్నారు," అని ఉపన్యాసం ముగించి, స్రవంతి అందించిన

తాళాల గుత్తిని తీసుకొని క్రాంతి బాబు చేతికిచ్చారు

అతిథులందరూ చప్పట్లు కొట్టారు. అక్కడ చేరిన పెద్దలలో కొందరు క్రాంతిబాబు నాలుగుమాటలు మాట్లాడా లని పట్టుబట్టారు.

క్రాంతిబాబు చాల వినయంగా, "నాకు చాల పెద్ద బాధ్యతను అప్ప జెప్పారు-మా అమ్మగారూ, రాఘవయ్య గారూ. ఆ బాధ్యతను ఎంతవరకు నేను నిర్వర్తించగలనో ఈనాడు నేను చెప్ప లేను. కాలమే నిర్ణయించాలి." అని కూర్చున్నాడు

స్రవంతి తన కొడుకు వినయ విధేయతలకు లోలోనే మురిసిపోయింది.

"ఇంక తర్వాత కార్యక్రమం కానివ్వండి," అంది స్రవంతి, రాఘవయ్యతో.

బర్త్ డే కేక్ ఉన్న టేబుల్ దగ్గరకు క్రాంతిబాబును రాఘవయ్య తీసుకెళ్లాడు. కేక్ మీద వెలుగుతూన్న ఇరవై ఒక్క కొవ్వొత్తి దీపాలను వూది, క్రాంతిబాబు బర్త్ డే కేక్‌ను వెండి కత్తితో కోశాడు. ఆహ్వానితులందరూ మరోసారి చప్పట్లు కొట్టి క్రాంతిబాబుకు పుట్టినరోజు శుభా కాంక్షలను అందజేశారు. అది ముగియ గానే క్రాంతి మౌనంగా తాత తండ్రుల తైల వర్ణచిత్రాల దగ్గరకు వెళ్ళి, ఎంతో భక్తితో నమస్కరించాడు. అది చూసిన స్రవంతి కళ్ళు చెమ్మగిల్లాయి. పెద్దల పట్ల క్రాంతి చూపించే భక్తిగౌరవాలు రాఘవయ్యకు ఎంతో ఆనందాన్ని కలి గించాయి. ఇన్నాళ్లకు మళ్ళీ రాజా రాజ శేఖరంగారి వంశానికి ఒక వారసుడనే వాడు తయారయ్యేడన్న సంతోషంతో ఆయన కళ్లూ చెమ్మగిల్లాయి.

వచ్చిన అతిథులందరూ విందు ఆరగించారు. రాజశేఖరంగారి కాలంనుంచీ కాంచనకుటీరంలో జరిగే విందుల్లాగే ఆనాటి విందుకూడా హుందాగా, హోదాకు తగ్గట్టుగా సాగింది. విందు ముగిసిన తర్వాత అతిథులు ఒక్కొ క్కరే స్రవంతమ్మగారి దగ్గరా, క్రాంతి బాబు దగ్గరా, రాఘవయ్య దగ్గరా సెలవు తీసుకుని వెళ్ళిపోయారు.

క్రాంతి స్నేహితుడు రఘుకూడా 'వెళ్లొస్తానని' చెప్పి, వెళ్ళిపోయాడు.

ఇక హాలులో మిగిలింది దివాణంలో వుండే నౌకర్లూ, రాఘవయ్యా, స్రవంతి, క్రాంతిబాబు మాత్రమే.

స్రవంతి నౌకర్లందర్నీ పిల్చి "వీళ్ళందరికీ తలొక వందరూపాయలయా ఇవ్వండి," అని రాఘవయ్యను ఆదేశించింది. ఆవిడ ఆదేశం ప్రకారం నౌకర్లందరికి పేరు పేరునా వంద రూపాయల చొప్పున పంచిపెట్టాడు రాఘవయ్య.

"ఇక ఈ రోజుకు మీరందరూ వెళ్ళి విశ్రాంతి తీసుకోండి." స్రవంతి నౌకర్లందరితో అంది.

నౌకర్లుకూడా ఒక్కొక్కరే హాలు లోంచి వెళ్ళిపోయారు. అప్పుడు ఆవిడ క్రాంతిబాబు కళ్ళలోకి సూటిగా చూసింది. ఆవిడ మనస్సు ఏదో ఆనందంతో, కొత్త గర్వంతో నిండిపోయింది.

క్రాంతిబాబు, "అమ్మాజీ!" అని ఏదో మాట్లాడబోయాడు.

స్రవంతి బాబు మాట్లాడటానికి అవకాశ మివ్వకుండా, "రాఘవయ్యగారూ! బాబు కళ్ళు ఎంత ఎర్రగా వున్నాయో చూడండి! అంత నిద్దరలేకుండా ఆలోచించాల్సిన బరువు బాధ్యతలు ఇంతవరకూ ఆతనికేమీ లేవే! ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోమని చెప్పండి," అని చరచరా మేడమెట్లు ఎక్కి తన గదిలోకి వెళ్ళిపోయింది.

ఆవిడ వెళ్ళినవైపే రాఘవయ్యా, క్రాంతిబాబుకూడా ఒక్క క్షణం చూస్తూ నిలబడిపోయారు. తరువాత ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

"ఉదయంనుంచీ మోటారుసైకిలు మీద తిరగటంచేత మీ కళ్ళు ఎర్రబడి నట్టున్నాయి బాబూ! మీ గదిలోకి వెళ్ళి విశ్రాంతి తీసుకోండి. అమ్మగారు చెప్పే ఏ మాట అయినా మీ మంచి కోరే, మీ మీద ప్రేమతోనే!" అన్నాడు రాఘవయ్య.

క్రాంతిబాబు మేడ మెట్లెక్కి తన గదిలోకి వెళుతూ, 'నామీద ప్రేమతోనే' అనుకొని తనలో తనే నవ్వుకున్నాడు. చిన్నతనంనుంచీ తండ్రి లేక తండ్రి ప్రేమ ఎరగను. తల్లి వుండి తల్లి ప్రేమ ఎరగను. ప్రేమంటే ఏమిటో అందులోనూ తల్లిప్రేమంటే ఏమిటో ఉదయాన్నే నా స్నేహితుడు రఘు అనుభవించడం చూశాను. ఇప్పుడు అమ్మాజీ అన్న మాటలు ప్రేమతోనే అని రాఘవయ్యగారు నన్ను బుజ్జగిస్తే, అది తల్లిప్రేమేనని ఎలా సరిపెట్టుకోగలను? అనుకుంటూ తన గదిలోకి వెళ్ళి మంచంమీద నడుం వాల్చాడు క్రాంతిబాబు.

## 2

గంటక్రితమే తెల్లవారినా, క్రాంతిబాబుకు మెలకువరాలేదు. అతని గది కాంచన కుటీరంలో తూర్పువైపు నుంది. గదికి తూర్పువైపు వరండా లోకి కొబ్బరిఆకులు వాలి వుంటాయి. ఉదయాన్నే ఆ కొబ్బరి ఆకుల సందుల్లోంచి పడే సూర్యకిరణాలు ఆ వరండాలోనూ, క్రాంతిబాబు గదిలోనూ వెలుగునీడల ముగ్గులు వేస్తాయి. అలా కిటికీలోంచి తన మొహంమీద పడిన ఓ పదునైన సూర్యకిరణం క్రాంతిని తట్టి లేపింది. కళ్ళు నులుముకుంటూ లేచాడు. నిజానికి అతను ఏరోజూ అంత ఆలస్యంగా లేవలేదు. గతం రాత్రి చాలా పొద్దుపోయేవరకూ నిద్ర పట్టలేదు. ఏవో ఆలోచనలు మనస్సు చుట్టూ సాలెగూడులా అల్లుకొన్నాయి.

తనకి ఊహ తెలిసిన దగ్గర్నుంచీ నిన్న జరిగిన పుట్టినరోజు పండుగ దాకా తాను జరిపిన జీవితం గురించి ఆలోచించకుండా ఉండలేకపోయాడు. తన అయిదవ ఏటనే మద్రాసు తీసుకు వెళ్ళి కాన్వెంట్‌లో చేర్చారు. అంత క్రితం కూడా తాను తల్లి ఒడిలో కూర్చున్నట్టుగానీ, తనని అక్కున చేర్చుకున్నట్టుగానీ, ముచ్చటకు అన్నం తినిపించినట్టుగానీ తనకి గుర్తురాలేదు. మరి ఊహ తెలియని పసితనంలో అమ్మ తనని లాలించిందేమో! అలా లాలించేఉంటే, ఆనాటికి తనకు ఊహ తెలియకపోవడం తన దురదృష్టం! చిన్నతనంలో ఈ కాంచన కుటీరంలో ఉన్నన్నాళ్లూ రాజీ ఆయా తనని అమ్మలా సాకింది. మాటలు నేర్పింది. తొలి అడుగులకు చేయూత నిచ్చింది. కాకి నలుపనీ, పాలు తెలుపనీ చెప్పింది. రాఘవయ్యగారు అక్షరాలు నేర్పాడు. అప్పటికే తనకి తండ్రీ తాతా లేరు. అలా తను రాజీ ఆయాదగ్గర ఆడు తున్నప్పుడూ, రాఘవయ్యగారి దగ్గర చదువుతున్నప్పుడూ - అమ్మాజీ అలా వచ్చి, ఓ చిరునవ్వు నవ్వి వెళ్ళిపోయేది. మద్రాసులో కాన్వెంట్‌లో చేరి చదువుకొనే రోజుల్లో కూడా కొత్తలో తనవెంట రాజీ ఆయా కొన్నాళ్లపాటు వుంది. అదొక్క ఏడాదిపాటే. ఆ ఆర్భాటం చూసి తోటి పిల్లలు క్రాంతి ఏదో ఊరికి జమీందారట అని గొప్పగా చెప్పుకొనే వారు. కొండలు దూరంనుంచి చూస్తే నున్నగా అగుపించినట్లే నా బ్రతుకూ చెప్పుకొనేవాళ్ళకూ, చూసేవాళ్ళకూ గొప్పగా అగుపిస్తుంది. కాని మానసి కంగా నేను పొందే తృప్తీ, తన ఇంట్లో తనకు దొరికే ప్రేమా తల్చుకుంటే - తన బ్రతుకు కొండకంటె గతుకుల మయం!

పూరిగుడిసెలో ఉన్న తల్లయినా, రాజ్‌మహల్‌లో ఉన్న తల్లయినా బిడ్డల్ని ఒకేలా కంటారు. పూరిగుడిసెలో ఉన్న తల్లి తన బిడ్డకు ఆప్యాయత తప్ప మరేమీ ఇవ్వలేదు. రాజమహల్‌లో పుట్టిన తల్లి అన్నీ యిచ్చి ఆప్యాయత మాత్రం ఇవ్వలేదు. మనసులో ఉన్నా పైకి చూపించలేదు. అంతస్థులూ, అంతస్థులకు తగ్గ మర్యాదలూ, తల్లికీ బిడ్డకూ మధ్య కూడా గోడలు పెడతాయి. తన అయిదవ ఏట మద్రాసు వెళ్ళి, వస్తే ఏడాదికొకసారి ఈ కాంచన కుటీరాని కొచ్చి నాకు నచ్చినన్ని రోజులుండి తిరిగి వెళ్లిపోయే వాణ్ని. ఎన్నాళ్ళ తర్వాత వచ్చినా కుశల ప్రశ్నలు అడగడమే తప్ప ఏనాడూ అమ్మ నన్ను 'వచ్చావా బాబూ' అంటూ సందిట చాచి దగ్గరకు తీసుకోలేదు నాకు కావల్సినవి సమ కూర్చబడ్డాయో లేవో రాఘవయ్యగార్ని, రాజీ ఆయాను అడిగేదేకానీ 'ఏం

కావాలి బాబూ!' అని నన్ను ఏనాడూ అడగలేదు. ఊహ తెలిశాక ఇది జమీందారీ ఇంటి పద్ధతి కాబోలు అని సరిపెట్టుకొనేవాణ్ని. నేనూ బయటి ప్రపంచంలోకి చదువుకోటానికి వెళ్ళి ఉండకపోతే, ఈ బంగారు పంజరంలోనే బతికేసివుంటే నా కింతటి తపనా, ఆ వేదనా ఉండి ఉండేవి కావేమో! బయటి ప్రపంచం కళ్లారా చూశాక, ఈ కాంచన కుటీరం, ఇక్కడి మర్యాదలూ, పద్ధతులూ, ఇక్కడి ఆప్యాయతలూ, అభిమానాలూ అన్నీ కృతకంగానే కన్పిస్తున్నాయి.

నిన్న రఘు ఇంటికి నేను వెళ్ళి నప్పుడు అక్కడ జరిగిన సంఘటన చూసింతర్వాత ఎంత చిక్కబట్టుకుందా మన్నా మనస్సు నన్ను కాదని ఆలోచిస్తూనే వుంది. రఘు టెలిగ్రాం అందుకొని, తొందరగా విప్పి, చదువుతూనే – 'అమ్మా!' అని ఒక గావుకేక పెట్టి, 'నేనూ క్రాంతీ ఫస్టు క్లాసులో ప్యాసయ్యాం' అంటూ పసివాడిలా గంతులేశాడు. మనిషికి ఏదైనా దెబ్బ తగిలితే మొట్టమొదట వచ్చే పిలుపు 'అమ్మా' అని అలాగే ఆనందం వచ్చినా చెప్పుకోవాలనిపించేది అమ్మకే. తన బిడ్డకు కలిగిన ఆనందా న్నయినా, విషాదాన్నయినా తన విషాదంగా, తన ఆనందంగా పంచుకో గలిగేది అమ్మ ఒక్కతేనేమో! రఘు అమ్మను చూసింతర్వాత తెలిసింది. రఘు పిలుపు వినగానే ఆమె వంట ఇంట్లోంచి "ఏమిటి బాబూ!" అంటూ వచ్చింది రఘు వరదలా కట్టలు తెంచుకొనే ఆనందంతో "మే మిద్దరమూ ఎంఏ.. ఫస్టుక్లాసులో ప్యాసయ్యా మమ్మా!" అని మళ్ళీ చెప్పాడు. ఆ మాట వినగానే తన కొడుకు ఆనందాన్ని చూసి పున్నమి చంద్రుని చూసి పొంగి పోయే సముద్రంలా పొంగిపోయింది ఆ తల్లి. తప్పటడుగులువేసే పసిపాప ఏదైనా కొత్తమాట పలికితే మురిసిపోయి బిడ్డను ఎత్తుకొని ముద్దాడే తల్లిలా రఘుని ఆవిడ దగ్గరకు తీసుకొని అతని తలనిండా ముద్దులు కురిపిం చింది. అతని వొళ్ళు ఆప్యాయంగా నిమిరింది. ఆ ఆప్యాయతలోనూ, ఆ అనురాగంలోనూ వాళ్లిద్దరి కళ్లూ చెమ్మగిల్లాయి. ఆ సంఘటన చూసిన తన కళ్ళు కూడా చెమ్మగిల్లాయి

"ఉండండి బాబూ!" అంటూ ఆమె గబగబా లోపలకు వెళ్ళి, రెండు లడ్లు పట్టుకొచ్చి స్వయంగా ఆమె చేతులతో మా యిద్దరి నోళ్లూ తీపిచేసింది. ఆ క్షణంలో రఘు అమ్మలో నేనూ అమ్మను చూశాను. నేనూ ఇంటికి వెళ్ళి నేను ప్యాసైన సంగతి అమ్మాజీతో చెబితే, నన్ను కూడా రఘు అమ్మ రఘును లాలించినట్లే అమ్మాజీ లాలిస్తుందని ఆశపడ్డాను కాని మేము

ఇద్దరమూ ఎం. ఏ. ఫస్టు క్లాసులో ప్యాసయ్యామని రఘు చెప్పినప్పుడు చుట్టూ వున్న అతిధులు నన్ను అభినందించారు. అమ్మ మాత్రం ఒక్క చూపుతోనే నన్ను అభినందించి ఊరు కుంది. ఎం ఏ. ఫస్టుక్లాసులో ప్యాసు కావడం ఏదో సాధారణమైన విషయంగా అమ్మాజీ భావించినట్లు అనిపించింది. పోనీ అమ్మాజీకి ఎం. ఏ. సంగతి తెలీదని అనుకుంటే, ఆవిడ కూడా బి. ఏ ప్యాసైందని విన్నాను. ఆవిడకు చదువు సంగతి తెలీదని ఎలా సరిపెట్టు కోగలను ? — అలా క్రాంతి ఆలోచించు కుంటూ వున్నాడు

రాణీ ఆయా కాఫీకప్పుతో గదిలోకి వచ్చింది.

"కాఫీ తీసుకో బాబూ !" అంది రాణీ ఆయా.

"ఈ వయస్సులో ఇన్ని మెట్లెక్కి-నువ్వే ఎందుకు తెచ్చావు ఆయా కాఫీ ? ఇంకా పనివాళ్ళు ఉన్నారుగా" అన్నాడు క్రాంతి కాఫీకప్పు అందుకుంటూ.

"అదేమిటి బాబూ, అలా అంటావు. నీ చిన్నతనంలో నిన్ను చంక నెత్తుకొని బతిమాలి బతిమాలి గోరు ముద్దలు తినిపించేదాన్ని. ఇప్పుడు పెద్దవాడివయ్యావు. ఏడాది కొకసారి వచ్చి, పది రోజులుండి వెళుతున్నావు. నా చేతులతో నీకు కాఫీ ఇవ్వడం నా కేదో తృప్తి. ఇలాగే మీ నాన్నగారినీ, మీ తాతాయినీ చూసుకున్నాను. నిన్నూ చూసుకుంటున్నాను," అంది రాణీ ఆయా.

## ముఖ్య గమనిక

రచయిత(త్రు)లు తమ తమ రచనలు పంపేటప్పుడు కొత్త పోస్టల్ రేట్లు జూన్ 1 నుంచి అమలులోకి వచ్చినవి గుర్తుంచుకొని తగినన్ని తపాలా బిళ్లలు వేసి పంపవలసిందిగా కోరుచున్నాను.

ఎడిటర్, యువ

ఆమె మాటల్లో కల్మషం లేదు. కొండంత ఆప్యాయత వుంది. 'ఆయా చూపించే ఆప్యాయతకు క్రాంతి మనస్సు కదిలిపోయింది.

కాఫీ తాగుతూనే ఆమె మొహంలోకి రెప్పలార్పకుండా చూశాడు క్రాంతి. కాఫీ త్రాగుతూవుండే ఆమెపొందే తృప్తి తనని తన్మయుడ్ని చేసింది. ఆమె తృప్తిలో అతని మనస్సు తడిసి పోయింది.

ఆమె చేతికి ఖాళీకప్పు అందిస్తూ, "ఆయా! నా కో చిన్నపని చేసి పెడతావా ?" అన్నాడు క్రాంతి.

"చెప్పు బాబూ!" అంది ఆయా.

"ఏంలేదు. నే నొకసారి అమ్మాజీని చూడాలి నేను వారి గదిలోకి రావొచ్చేమో అడిగిరా" అన్నాడు క్రాంతి.

"అమ్మాజీ పిలవకుండా నేనూ వారి గదిలోకి వెళ్లకూడదు బాబూ! రాఘవయ్యగారితో చెబుతాను. వారు వెళ్ళి అమ్మజీతో చెబుతారు," అంది ఆయా రాజీ.

క్రాంతిబాబు చెప్పిన మాట రాజీ ఆయా లెక్కలు చూసుకుంటూన్న రాఘవయ్యగారితో చెప్పింది. రాఘవయ్య సరేనని, అమ్మాజీ గదిలోకి వెళ్ళి క్రాంతిబాబు కోరికను తెలియ జేశాడు.

రాఘవయ్య మొహంలోకి ఓసారి తీక్షణంగా చూసింది స్రవంతి. అది ఆవిడ ప్రత్యేకత. చాల విషయాలలో ఆవిడ కళ్ళతోటే మాట్లాడుతుంది. ఆవిడ ఆదరించినా, అభిమానించినా, శాసించినా, శిక్షించినా కళ్ళతోటే! మాటల కందని భావాలను కళ్ళతో వ్యక్తంచేసే శక్తి ఆమె కళ్ళకుంది. ఆ చూపులు రాఘవయ్యకు అర్థమయ్యేవి. తాను ఏదో పొరబాటు చేసినట్లు అర్థ మయ్యేదికానీ, చేసిన పొరబాటు ఏమిటో ఆయనకు స్పష్టం కాలేదు.

"రాజీ ఆయా నాతో చెప్పిన మాట తమతో చెబుతున్నాను" అన్నాడు రాఘవయ్య తన తప్పేమీ లేదన్నట్టు.

"అది సరే రాఘవయ్యగారూ! నిన్న సాయంత్రం జరిగిందంతా మర్చి పోయారా ?" అంది స్రవంతి ఏదో ఇంగ్లీషు నవల పేజీలు తిరగేస్తూ.

రాఘవయ్య ఒక్క క్షణం ఆలోచించి, "ఏం జరిగిందమ్మా! బాబు పుట్టినరోజు వేడుక జరిగింది" అన్నాడు అనుమానంగానే

"అంతేనా ? నిన్న జరిగిన బాబు పుట్టినరోజు వేడుక మామూలు పుట్టిన రోజు పండగనేనా మీ అభిప్రాయం!" అంది స్రవంతి పుస్తకం మూస్తూ.

"ఆఁ! అర్థమైందమ్మా! ఇరవై ఒకటవ పుట్టిన్రోజు వేడుక. ఆ సందర్భంలో అందరి సమక్షంలోనూ ఈ దివాణం సర్వాధికారాలూ బాబుకు

అప్పగించారు మీరు," అన్నాడు రాఘవయ్య.

"అవును కదా! నిన్నటినుంచీ ఈ ఎస్టేట్‌కు సర్వాధికారి బాబు అయినప్పుడు నా గదిలోకి రావడానికి అనుమతి కోరడమేమిటి అతను! నన్నే అతని గదికి రమ్మని ఆజ్ఞాపించాలని చెప్పండి. అధికారంతోబాటు దానికి తగ్గట్టు ఆజ్ఞాపించడమూ నేర్చుకోవాలి. బాధ్యతలు వహించటమూ నేర్చుకోవాలి అని బాబుకు చెప్పండి," అంది స్రవంతి.

రాఘవయ్య చిరునవ్వు నవ్వి, "ఈ క్రమశిక్షణా కట్టుబాట్లతోనే దాదాపు ముప్పైయేళ్ళ బట్టి మగదిక్కు లేక పోయినా ఈ ఎస్టేట్‌ను నిర్వహించుకొస్తున్నారమ్మా," అన్నాడు రాఘవయ్య ఆవిడను ప్రశంసిస్తూ.

"మనిషి మనిషిగా బ్రతికితే అన్ని పనులూ చేయడం కష్టంగానీ, మరగా మారితే ఏ పనైనా చేయొచ్చు. బాబు గదికి నేనే వస్తున్నానని చెప్పండి" అంది స్రవంతి.

* * *

క్రాంతిబాబు గదికి రాఘవయ్య వచ్చాడు.

"అమ్మాజీయే మిమ్మల్ని చూడ్డానికి వస్తామన్నారు బాబూ!" అని రాఘవయ్య ముక్తసరిగా చెప్పి వెళ్ళి పోయాడు.

ముక్తసరిగా మాట్లాడటం, ఆనందాన్ని అయినా, విషాదాన్ని

---

ఇప్పుడు మీరు అతని పళ్లను
పిప్పిపళ్లు కాకుండా చెయ్యవచ్చును.



# వాడండి సిగ్నల్ 2

పళ్లను గట్టిపరచి దంత క్షయాన్ని నివారించేందుకు
దీనిలో అత్యంత ప్రభావంగల ఫ్లోరైడ్ ఫార్ములా ఉంది.

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

లింటాస్-SG2. IA-1710TL

**పంటినొప్పివల్ల కలిగేది కేవలం బాధ మాత్రమే కాదు. దంతక్షయానికి అది సంకేతం కూడా. అశ్రద్ధ చేస్తే దంతక్షయం మరింతగా జరిగి పిప్పి పళ్ళు అయిపోతాయి.**




*నోటిలో ఊరే ఆమ్లాలు పళ్లలోకి చొచ్చుకుపోయి దంతక్షయాన్ని కలిగించకుండా మామూలు టూత్‌పేస్టులు ఆపలేవు.*




*సిగ్నల్ 2లో అత్యంత ప్రభావంగల ఫ్లోరైడ్ ఫార్ములా ఉంది ఇది నోటిలోని ఆమ్లాలు పళ్లలోకి చొచ్చుకుపోయి దంతక్షయం కలిగించకుండా అరికడుతుంది.*

## పిప్పి పళ్ళను నిరోధించే టూత్‌పేస్ట్

పరిస్థితి విషమించక ముందే మీ కుటుంబంలో వారంతా వాడండి సిగ్నల్ 2—దంతక్షయాన్ని నిరోధించడంలో నిరూపించబడిన టూత్‌పేస్ట్ దీనిలోని ప్రత్యేకమైన ఫ్లోరైడ్ ఫార్ములా పళ్ళతో కలిసి వాటిని గట్టిపరుస్తుంది, పళ్ళకు హాని కలిగించే నోటి ఆమ్లాలను నిరోధించేందుకు మరింత శక్తినిస్తుంది—పిప్పి పళ్ళు కాకుండా కాపాడుతుంది దంతక్షయాన్ని అరికట్టడంలో దీనికి మించిన టూత్‌పేస్ట్ లేదు. మేం చెప్పిందే మీరు నమ్మక్కర్లేదు. మీ దంత వైద్యుని కూడా అడగండి.




**ఫ్లోరైడ్‌తో**

# సిగ్నల్ 2

**కుటుంబంలో వారికి పిప్పి పళ్ళు రాకుండా నిరోధిస్తుంది.**



లింటాస్_SG2. 18-1710 TL

అయినా చాల ముభావంగా వ్యక్తపరచటం, అటువంటి జమీందారీ వంశాలలో ఆచారం. రాఘవయ్య చెప్పినమాటలో క్రాంతిబాబు తన తల్లి గదిలోకి రానవసరంలేదు అన్న ధ్వని అంతర్గతంగా వుంది.

అమ్మగారు తన గదిలోకి ఎప్పుడు వస్తుందా అని క్రాంతిబాబు ఎదురు చూస్తున్నాడు. రఘును వాళ్ళ అమ్మ దగ్గరకు తీసుకున్నట్లే తనని కూడా తన తల్లి పరాయివాళ్లు ఎవ్వరూ లేరు కాబట్టి తనని దగ్గరకు తీసుకోవచ్చని ఆశపడ్డాడు. అతని ఆలోచన అతనికే ఆశ్చర్యాన్ని కలిగించింది తనకు ఇరవై ఒక్క సంవత్సరాలు నిండాయి. తాను ఇప్పుడు పసివాడు కాదు. తల్లి వొడిలో తలదాచుకొనే వయస్సు కాదు. అయినా అమ్మ ఆప్యాయతకోసం అతని మనస్సు ఆరాటపడుతోంది. దీనికంతటికీ కారణం నిన్న తన స్నేహితుడు రఘు వాళ్ళ అమ్మ ఆప్యాయతను పొందటం తాను కళ్లారా చూడటం కావచ్చు. లేదా తాను చిన్నతనంనుంచీ తల్లి ఆప్యాయతకు, అనురాగానికీ నోచుకోక పోవడం కావచ్చు. ఏది ఏమైనా మనసులో తలెత్తే కోరికలకూ, ఆలోచనలకూ కారణాలు, అర్థాలు చెప్పడం కష్టం. మనిషి మనస్సు అరణ్యంలాంటిది — అనుకున్నాడు క్రాంతిబాబు.

స్రవంతి గదిలోకి అడుగుపెట్టింది.

ఆలోచనల్లో పడ్డ క్రాంతి, తల్లి రాకను గమనించలేదు.

"ఏమిటి బాబూ! అంత పరధ్యాన్నం" అని స్రవంతే పలకరించింది.

ఉలిక్కిపడి కుర్చీలోంచి లేచాడు క్రాంతిబాబు.

తన గదిలో తన కళ్ళముందు ఒంటరిగా నిలబడిన అమ్మ ఆ క్షణంలో తనకి ఎంతో తపస్సు తర్వాత ప్రత్యక్షమైన దేవతలా అగుపించింది

"అమ్మా!" అంటూ ఆవిడ దగ్గరకు వెళ్ళి, తల్లి ఒడిలో వాలిపోదామనిపించింది క్రాంతికి. అనిపించినా అలా చేయలేకపోయాడు. ఏం మాట్లాడాలో తెలియక పసివాడిలా, "నేను ఎం.ఏ. ఫస్టుక్లాసులో ప్యాసయ్యానమ్మా!" అన్నాడు

స్రవంతి నవ్వుకుంది.

"నిన్ననే చెప్పావుగా బాబూ! చాల సంతోషించాను," అందావిడ.

ఆ తర్వాత ఏం మాట్లాడాలో క్రాంతిబాబుకు అర్థంకాలేదు.

స్రవంతి ఒక సోఫాలో కూర్చుంటూ, క్రాంతిని కూడా కూర్చోమంది.

ఆ తల్లీ కొడుకు లిద్దరూ అంత ఏకాంతంగా కలుసుకోవడం - క్రాంతికి ఊహ తెలిశాక అదే మొదటిసారి.

"నీతో కొన్ని ముఖ్యవిషయాలు

చెప్పాలని వచ్చాను బాబూ. మన కాంచన కుటీరం చుట్టూవున్న ఎత్తైన ప్రహారీని నువ్వు చిన్నతనంనుంచీ చూస్తూనే వున్నావు. ఆ ప్రహారీ వున్నది కాంచన కుటీరానికి రక్షణ మాత్రంగానే కాదు. బయటి జనాన్నీ, మనల్నీ వేరుచేసే గోడలవి. బయటి జనం అందరిలా మనం ప్రవర్తించలేం. అలా ప్రవర్తించడానికి మన వంశ ప్రతిష్ఠా, సాంప్రదాయమూ అంగీకరించవు. వరమంత్రపుసిరిని ఎవరైనా సంపాదించ వచ్చు కాని తరతరాలుగా వస్తూన్న సాంప్రదాయాన్నీ, పరువు ప్రతిష్ఠల్నీ మధ్యలోసిరిని పొందగలిగినవారు సంపాదించలేరు. వంశ సాంప్రదాయంకోసం, పరువుప్రతిష్ఠలకోసం ప్రాణం ఇవ్వడానికైనా, ప్రాణం తియ్యడానికైనా వెనకాడని వంశం బాబూ మనది. అటువంటి సాంప్రదాయాన్నీ, పరువు ప్రతిష్ఠల్నీ మీ తాతగారు నా చేతిలో పెట్టి వెళ్ళారు.

"నేను ఈ ఇంటి కోడలిగా అడుగు పెట్టేనాటికి నేనొక సాధారణ స్త్రీని కాని సాధారణ స్త్రీకి సహజంగా వుండే చపలత్వాలన్నింటినీ చంపుకొని మీ తాతగారు నాకు అప్పగించిన బాధ్యతలను నిర్వహించడంకోసం చాలా కృతకంగా బ్రతకడం నేర్చుకున్నాను. మట్టిలోంచి తవ్వి తీసిన నల్లరాయిని తెచ్చి శిల్పి తన మనస్సులోవున్న బొమ్మగా మలుస్తాడు. ఆ బొమ్మకో పేరు పెడతాడు. అలా శిల్పి నామకరణం చేసిన నాటినుంచీ బొమ్మ నల్లరాయే అయినా శిల్పి పెట్టిన పేరుతోనే చెలామణి అవుతుంది. నన్నూ అలాగే ఈ వంశ పరువుప్రతిష్ఠలు, మీ తాతగారు నాకు అప్పజెప్పిన బాధ్యత బొమ్మగా మలిచాయి. చూసేవాళ్ళకు మనిషినే. కాని నిజానికి నేను బొమ్మలా బతుకుతున్న మనిషిని" అంటూ ఆవిడ ఒకసారి కళ్ళు మూసుకొని సోఫాకు జారగిలబడింది.

ఇన్నాళ్లూ తాను అమ్మామ్మలో జమీందారిణీ హోదానూ, అహంకారాన్నీ మాత్రమే చూడగలిగాడు. తొలిసారిగా అమ్మ మనసు, ఆవిడ మనసులోని ఆవేదనా అతనికి అర్థమయ్యాయి కొంత వరకు.ఎంత కృతకంగా బ్రత్కాలనుకున్నా మనిషిలోని మనిషి ఏదో సమయంలో బయటకు తొంగిచూస్తూనే వుంటాడనుకున్నాడు

కళ్ళు మూసుకొనే స్రవంతి మళ్ళీ చెప్పడం మొదలెట్టింది.

"అసలు నువ్వు నా కడుపున పడటమే ఒక కలలాంటి నిజం బాబూ! అంతవరకు ఎంతో ఆవేదనతో క్రుంగిపోయే నేనుతల్లినికాబోతున్నానని పొంగిపోయాను. నువ్వు పుట్టాక తల్లినయ్యానని నిన్ను చూసుకుని మురిసిపోయాను. నువ్వు పసికందుగా పురిటిమంచంలో





# నోటి దుర్వాసనను ఆపండి...
# కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో
# దంతక్షయాన్ని ఎదుర్కోండి

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత, కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకోండి. కోల్గేట్, ప్రపంచమంతటా దంత వైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది అవి ముందు నోటి దుర్వాసన, ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు, దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పనిచేస్తుందంటే :



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చక్కగల నురుగు బాగా లోతుకువెళ్ళి హానికరమైన ఆహారపు అణువులను బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

హాయినిగొల్పే, తాజా శ్వాసకోసం, పళ్ళను తెల్లగా రూపొందించేందుకు ప్రపంచంలో ఎక్కువ మంది, మరే ఇతర టూత్‌పేస్ట్ కన్న ఎక్కువగా కోల్గేట్‌నే కొంటూ ఉంటారు!




**ఒక్క దంతవైద్యులు మాత్రమే**
**దీనికన్న మేలైన దంతరక్షణ సమకూర్చగలరు.**

వున్నప్పుడు నిన్ను ముద్దులతో ముంచెత్తాను; చూలింతగా వున్నప్పుడు నిన్ను నవమాసాలూ మోసాను; బాలింతగా వున్నప్పుడు ఎత్తుకొని ముద్దాడాను. పురిటిస్నానం అయిన రోజునే నువ్వు ఆయా సందిట్లోకి వెళ్ళావు అదీ ఈ వంశ ఆచారమట! తల్లిగా కొన్నాళ్ళు తల్లడిల్లాను. ఆ తర్వాత నువ్వు ఎదుటపడినా అంతస్తులూ ఆచారాలూ గీసిన గీతలు అడ్డురావటం చేత, నున్నగా దువ్వివున్న నీ తలను ముద్దుగా రేపేదాన్ని; మెత్తని నీ బుగ్గల మీద మృదువుగా చిటికెవేసేదాన్ని. అంతకుమించి నువ్వు ఎంత ముద్దొచ్చినా, తల్లిగా నా మనస్సు ఎంత తహతహలాడినా నిన్ను అక్కున చేర్చుకోలేదు. ఈ వంశ సాంప్రదాయమూ, ఆచారమూ శాసించిన ప్రకారం నీకు దూరంగా బ్రతికాను. చిత్రం చూశావా ? ఆనాడు నిన్ను దగ్గరకు తీసుకొని ముద్దాడదామంటే ఆనాటి నా హోదా, సాంప్రదాయపు కట్టుబాట్లూ నీకూ నాకూ మధ్య గోడ కట్టాయి. ఇప్పుడు నా చేతుల్లో హోదా లేదు. అధికారం లేదు. నిన్ననే అవి నీకు అప్పజెప్పాను. నువ్వు ఇప్పుడు ఈ ఎస్టేట్ యజమానివి పోనీ ఇప్పుడు నిన్ను తల్లిగా దగ్గరకు తీసుకుందామంటే నీ హోదా, నీ అధికారం అడ్డుగా నిల్చాయి, ఈ ఎస్టేట్ జమీందారును ఎంత తల్లినైతే మాత్రం అంత చనువుగా దగ్గరకు తీసుకోగలనా ! దానికి మన జమీందారీ సాంప్రదాయం ఒప్పుకుంటుందా ?" అంటూ ఆవిడ కళ్ళవెంట రెండు కన్నీటి బొట్లను రాల్చింది.

క్రాంతికి తల్లి ఒడిలో వాలిపోవాలనిపించింది. 'అమ్మాజీ' అని పిలవడం మానేసి 'అమ్మా ! అమ్మా!' అంటూ నోరు నెప్పి పుట్టేదాకా పిల్చి, పిల్చి ఎంతోసేపు ఆవిడ వొడిలో వుండిపోవాలనుకున్నాడు. చివాలున తన సోఫా లోంచి లేచి, తల్లికూర్చున్న సోఫా వేపు కదిలాడు.

అప్పటికే స్రవంతి సోఫాలోంచి లేచి నిలబడింది.

"రాఘవయ్యగారినుంచి నువ్వు నేర్చుకోవల్సిన విషయాలూ, తెల్సుకోవలసిన విషయాలూ చాలా వున్నాయి బాబూ! మన వంశ చరిత్రను ఏ చరిత్రకారుడూ పుస్తకాల్లో పదిలపర్చలేదు. రాఘవయ్యగారు తన గుండెల్లో రాసి దాచుకున్నాడు. వస్తాను బాబూ!" అని ఆవిడ బయటకు వెళ్ళిపోయింది.

కాని క్రాంతిబాబు ముచ్చట తీరలేదు.

(సశేషం)

Printed and Published by A. Chandra Sekhar Rao at 5-9-88, Public Garden Road Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001. Editor: A. SUDHAKARA RAO

# క్విజ్

## బహుమతి : రూ. 116

ఈ క్విజ్‌లో మొదటి అయిదింటికి నాలుగేసి సమాధానాలు ఇచ్చాం. అందులో సరైన సమాధానాన్ని మీరు ఎంచుకొని క్విజ్‌ను పూర్తిచేయాలి. మిగతా అయిదింటికి పాఠకులే సమాధానాలు 6 నుంచి 10 వరకూ ఇచ్చిన "డాష్" లలో వ్రాయాలి.

## 'క్విజ్' లో పాల్గొనేవారు పాటించవలసిన నిబంధనలు

1. సమాధానాలు "యువ" కూపనుమీద మాత్రమే వ్రాసి పంపాలి. కవరుమీద "క్విజ్" అని స్పష్టంగా వ్రాయాలి. అందులో క్విజ్ కూపన్ తప్ప మరేమీ ఉండరాదు. కూపన్‌లో ఎటువంటి దిద్దుళ్ళు ఉండరాదు. కూపన్లను పోస్టులోనే పంపాలి స్వయంగా వచ్చి ఇచ్చేవాటిని స్వీకరింపబడవు.
2. ఒకరికంటే ఎక్కువమంది ఆల్‌కరెక్ట్ సమాధానాల్ని పంపితే, వారికి బహుమతి సొమ్ము పంచడం జరుగుతుంది. సంఖ్య మరీ ఎక్కువైతే లాటరీ పద్ధతి అమలుపరుస్తాం.
3. సమాధానాలు సీలువేసిన కీ సొల్యూషన్‌తో సరిపోవాలి.
4. దీనికి సంబంధించిన విషయాలలో "యువ" సంపాదకునిదే తుది నిర్ణయం. క్విజ్ సమాధానాలను అక్టోబరు సంచికలో ప్రకటిస్తాము. ఈ విషయమై ఎట్లాంటి ఉత్తర ప్రత్యుత్తరాలకు అవకాశం లేదు.
5. మాకు కూపన్లు చేరవలసిన ఆఖరు తేదీ ఆగస్టు 28. ఆ పైన వచ్చినవాటిని పరిశీలించడం జరగదు.

## సెప్టెంబరు నెల క్విజ్

1. మన దేశంలో హైకోర్టు జడ్జి ఈ వయస్సు వచ్చేవరకూ పదవిలో ఉంటాడు

   ఎ) 60 బి) 65 సి) 62 డి) 58

2. చంద్రమండలాన్ని తాకిన తొలి అంతరిక్ష నౌక

   ఎ) సర్వేయర్ - I బి) అపోలో - I సి) అపోలో - II డి) టానిక్ -

3. మన దేశంలో తొలిగా జనాభా లెక్కలను కిందివారి కాలంలో జరిపారు.
ఎ) కర్జన్ బి) కారన్ వాలిస్ సి) రిప్పన్ డి) విలియం బెంటింక్

4. గుండె కొట్టుకోవడాన్ని కొలిచే పరికరం
ఎ) కిమోగ్రాఫ్ బి) ఫోనోగ్రాఫ్ సి) కార్డియోగ్రాఫ్ డి) బరాగ్రాఫ్

5. 'నాగానందం' గ్రంథకర్త
ఎ) కల్హనుడు బి) బాణభట్టు సి) హర్షవర్ధనుడు డి) భారవి

6. ప్రపంచ ప్రఖ్యాతి చెందిన కోహినూర్ వజ్రం ప్రస్తుతం ———— దేశంలో ఉంది.

7. 'గద్య తిక్కన' బిరుదు పొందినది ————

8. 1934, 1935, 1936 సంవత్సరాలలో వరసగా మూడుసార్లు వింబుల్డన్ టెన్నిస్‌ను గెల్చిన ఆటగాడు ————

9. ప్రపంచ జనాభాలో భారతదేశపు జనాభా శాతము ————

10. మన రాష్ట్రంలో అభ్రకం ఎక్కువగా ———— వద్ద లభిస్తుంది.

యువ
క్విజ్ కూపన్ - సెప్టెంబర్ '78
సమాధానాలు

1 ☐ 2 ☐ 3 ☐ 4 ☐ 5 ☐

6 ________ 7 ________ 8 ________

9 ________ 10 ________

పేరు. ________________

అడ్రస్: ________________

________________

________________